శ్రీ ధన్వంతరయేనమః

## ఆయుర్వేదౌషధ

# అనుపానపథ్యమంజరి






"నాత్మార్థం। నాపికామార్థం
అథభూత దయాంప్రతి॥"
(చ॥ చి॥ 1 అ॥ 59 శ్లో



సంపాదకులు :
ఆయుర్వేదభిషక్ & ఆయుర్వేదప్రవీణ,
రెంటచింతల కృష్ణమూర్తిగారు, A. C

ప్రకాశకులు :
శ్రీ రామమోహన ఆయుర్వేద
సంఘము, విజయవాడ

తులు 3000] 1950

# Ninth Andhra Ayurveda Unani Conference & Exhibition

GUNTUR, 23rd & 24th F...

**Rama Mohan Ayurveda Pharmacy**

has taken part in this Exhibition The medicines he exhibited were tested and certified to be placed in the 1st Class by the Conference

*(Sd) S Ramayya,*
*Secretary*

*(Sd) G Srinivasamurty,*
*President.*

---

ంధ్ర ఆయుర్వేద యూనాని
వైద్య సమ్మేళనము

గుంటూరు, 1927 సం॥ ఫిబ్రవరి 23, 24 తేదీలు

శ్రీ రామమోహన ఆయుర్వేదఫార్మసీ, బెజవాడ.

ఏతత్ప్ర... శనములో పాల్గొనిరి. వారు ప్రదర్శించిన ఔషధము... ము తరగతిలోనివిగా ప్రదర్శన పరీక్షకులచే

...మయ్య, (సం.) జి. శ్రీనివాసమూర్తి,
అధ్యక్షులు.

# విజ్ఞప్తి

ఈ ధర్మ వైద్యశాలా ఔషధ కర్మాగారములు, 1915 సం॥లో శ్రీ శంకర వెంకట్రామయ్య, శ్రీ బొడ్డపాటి వెంకటప్పయ్య పంతులుగార్ల వల్ల స్థాపింపబడి పలుకుబడిగల కమిటీపరిపాలనక్రింద లక్షలకొలది ప్రజలకు ఉచిత వైద్యసహాయము చేయుచున్నది. ఆయుర్వేదౌషధములను, చికిత్సలను ఎల్లరకు ఉచితముగా ప్రయోగించుట, ఆయుర్వేదౌషధములన్నియు శాస్త్రీయముగా తయారుచేయించి స్వల్పధరలకు ప్రజల కందించుటయు ఈసంస్థయొక్క ముఖ్యోద్దేశ్యములు. ఇంత దిగ్విజయముగ ఈ సంస్థ ఖ్యాతిగణించుటకు మాఔషధముల ప్రాశస్త్యమే ముఖ్యకారణము. ఇచ్చట ఔషధములు అన్నియు చక్కని పరిశోధనలతో, విశేష వ్యయప్రయాసలకోర్చి నిర్దుష్టముగ అనుభవజ్ఞులగు వైద్యులచే తయారుచేయబడుచున్నవి. ఇచ్చట ఆయుర్వేదౌషధములన్నియు నమ్మకముగా గలవు. ఇందుపై వచ్చు ఆదాయము యేవ్యక్తికిని చెందక అంతయు ధర్మవైద్యశాలా నిర్వహణమునకై వినియోగింపబడుచున్నది. ఈసంస్థయందు శల్య చికిత్సగూడ యేర్పాటుచేసి విరిగిన ఎముకలు మొదలగు శల్యములకు సంబంధించిన అన్ని చికిత్సలు సమర్థత నిర్వహింపబడుట వలన బహుజనోపకారిగనున్నది.

ఈపుస్తకములో ఔషధయోగములు, వాటిగుణములు, మోతాదులు, అనుపానములు వీలైనంతవరకు అందు పడు ద్రవ్యభాగములు చేర్చబడినవి. ఈ సంస్థయందు తయారుచేయు ఔషధములు, వాటి గుణములు, అనుపానములు వగైరాలను "అనుపానపథ్యమంజరి" అను పేరుతో 1934 సం॥రమున అప్పటి కమిటీవారిచేత ప్రచురింపబడి ప్రజానీకమునకు ఉపయోగపడినది. ఇప్పటికి సుమారు 20 సం॥ కావచ్చినది. ఈమధ్య ఎన్నియో మార్పులు కలిగినవి. అందువలన ఇప్పటి కమిటీవారు అట్టి పుస్తకమును ఔషధయోగములును, ప్రమాణముగ, శాస్త్రీయముగాను, అనుభూతయోగములును, వాటిమోతాదులు, అందుపడు

వస్తుభాగములు పథ్యాపథ్యములు విపులముగ ప్రజలకు వుపయోగించునటుల ముద్రించి చేయవలెనని వుద్దేశించి ఫార్మశీ ప్రధాన వైద్యులైన శ్రీ ఆయుర్వేదభిషక్ రెంటచింతల కృష్ణమూర్తిగారిని తయారుచేయవలసినదిగా కోరి మిక్కుటమగు తగు శ్రద్ధతో అనేక ప్రమాణగ్రంధములు పరిశీలించియు, ఘనవైద్యులు పండితులు అగు,

1. శ్రీ. ఆయుర్వేదోద్ధారక,
   డాక్టర్ : ఆచంట లక్ష్మీపతి B A, M B C M గారు
2. శ్రీ. ఆయుర్వేద మహామహోపాధ్యాయ,
   తి. ప. రామానుజస్వామిగారు
3. శ్రీ. వైద్యవల్లభ,
   రాణీ వెంకటాచల ప్రసాదచయనులుగారు

ఆయుర్వేద విశారద & వైద్యవిద్వాన్,
చక్రవర్తుల నరసింహాచార్యులుగారు A R A C

మొదలగు పెద్దలయొక్క సూచనలను, సలహాలను పొంది అనేక ప్రయోగములలో ముఖ్యముగా వైద్యేతరులకు బోధపడునట్లు కష్టపడి యీగ్రంథము వ్రాసినారు. కావున యీపుస్తకము వైద్యులకు, వైద్యేతరులకు లాభోపయోగకారి కాగలదని నమ్ముచున్నాము.

కాబట్టి ప్రజలెల్లరు తమకు కావలసిన ఔషధములను మా ఫార్మశీనుండి గ్రహించియు, మాము చేయు ధర్మకార్యములయందు ధర్మవైద్యశాలకు ద్రవ్యసహాయము నొనర్చియు ఈసంస్థయొక్క యభివృద్ధికి తోడ్పడగోరుచున్నాము.

ఇట్లు,

విజయవాడ
20-8-'50

శ్రీరామమోహన
ఆయుర్వేద ధర్మవైద్యశాల సంఘము.

# ప్రస్తుత పాలక వర్గము

అధ్యక్షులు

శ్రీమంతు శ్రీ రాజా యార్లగడ్డ శివరామ ప్రసాదబహద్దరు
జమీందారు గారు, చల్లపల్లి ఎస్టేటు.

ఉపాధ్యక్షులు.

శ్రీ చిట్టూరి రామకృష్ణయ్య శ్రేష్ఠిగారు
శ్రీ కోట వెంకటాచలం పంతులుగారు
శ్రీ ఉప్పులూరి కృష్ణమూర్తి పంతులుగారు బి.ఏ.
రిటైర్డు జాయింటు రిజిస్ట్రారు.

గౌరవ కార్యదర్శి.

శ్రీ లక్కరాజు నిరంజనరావు పంతులుగారు బి.ఏ., బి.ఎల్.

సహాయ గౌరవ కార్యదర్శులు.

శ్రీ బొడ్డపాటి వెంకటసుబ్బారావు పంతులుగారు బి.ఏ.
శ్రీ పాటిబండ్ల రామమూర్తి పంతులుగారు బి.ఏ., బి.ఎల్., వకీలు.

సభ్యులు.

శ్రీ నందిపాటి జగన్నాయకులు శ్రేష్ఠిగారు
శ్రీ ఇవటూరి సుబ్బారావు పంతులుగారు
శ్రీ నండూరి వీరభద్రరాయశర్మ పాకయాజిగారు
శ్రీ నండూరి గోపాలకృష్ణమూర్తి పంతులుగారు
శ్రీ పాటిబళ్ళ వెంకటేశ్వర్లుగారు
శ్రీ డాక్టర్ జంధ్యాల దక్షిణామూర్తిగారు యల్.యం.పి.
శ్రీ సి. చక్రవర్తిగారు బి.ఎ., బి.యల్., వకీలు.
శ్రీ శిష్టా వెంకటకృష్ణయ్యగారు బి.ఎ., బి.యల్., వకీలు.

---

# ఉపోద్ఘాతము

శ్లో॥ యోగేనచిత్తస్యపదేనవాచాం । మలంశరీరస్యచవైద్యకేన,
యోపాకరోత్తంప్రవరంమునీనాం । పతంజలింప్రాంజలిరానతోస్మి॥

శ్లో॥ నమామిధన్వంతరిమాదిదేవం । సురాసురైర్వందితపాదపద్మమ్,
లోకేజరారుగ్భయమృత్యునాశం । దాతారమీశంవివిధౌషధీనామ్॥

"ధాతుసామ్యక్రియాచోక్తా [illegible]స్యాస్యప్రయోజనమ్".

. . "చతుర్ణాంభిషగాదీనాం శస్తానాంధాతువైకృతే
ప్రవృత్తిర్ధాతుసామ్యార్థా చికిత్సేత్యభిధీయతే".

అనెడి చరక వచనప్రకారము ఆయుర్వేదప్రయోజనము స్వస్థితి యందుండు ధాతువులను సమస్థితియందే యుండునట్లు జేయుటయు, వికృతిజెందిన ధాతువులను చికిత్సాదులచే సామ్యావస్థకు దెచ్చుట. అనగా ఆరోగ్యమును కాపాడుట. ఇదిస్వస్థవృత్తమనియు, ఆతురవృత్తమనియు రెండువిధములుగా యుండును. స్వస్థవృత్తమనగా ఆరోగ్యవంతుడు తన ఆరోగ్యమును చెడకుండా కాపాడుకొను విధానములు తెలియ ... ఆతురవృత్తమనగా ధాతువులు వికృతిజెందుటవలన కలుగు ... గములయందు చికిత్సలచే ధాతువులను సమస్థితికిదెచ్చి ఆరోగ్యము కలిగించుట. అట్టిచికిత్సకు "భిషగ్ద్రవ్యాణ్యుపస్థాతారోగిపాదచతుష్టయం" అను వాగ్భటవచన ప్రకారము వైద్యుడు, ద్రవ్యములు (ఔషధములు) పరిచారకుడు, ... వారలను పాదచతుష్టయముగ తీసుకొనబడెను. వానిలోనేదిలేక ... చికిత్స యసంపూర్తిగనేయుండును. అయినప్పటికిని పాదచతుష్టయమునందు వైద్యుని ముందుగా చెప్పుటయు, తక్కిన మూడుపాదములు సరిగయున్నప్పటికి వైద్యుడు లేక అవి వ్యర్థములగుటవలనను, వైద్యునికి ప్రాధాన్యత నొసంగబడెను.

అందులకే చరకుడు "విజ్ఞాతా శాసితాయోక్తా ప్రధానం భిషగత్రతు" అని వైద్యునకు ప్రాధాన్యత నొసంగియున్నాడు. అందువలన వైద్యుడు శాస్త్రజ్ఞానము, అనుభవము, ధర్మబుద్ధి కలిగినవాడుగను యుండవలెను.

పైన జెప్పిన పాదచతుష్టయములో వాగ్భటాచార్యుడు వైద్యుని యనంతరము ద్రవ్యము (ఔషధము) లకు ప్రాధాన్యత యొసంగబడెను. కారణమేమన వైద్యుడు శాస్త్రోక్త ఔషధముల యొక్క గుణములను

ఔషధములయందు పడు ద్రవ్యములను, వాటిగుణములను, వాని నుప యోగించు విధానము (అనుపానము)లను, ప్రమాణము (మోతాదు) మున్నగువానిని చక్కగా నెరింగియున్నగాని రోగములయందు సమయోచితముగా ఔషధముల నొసంగి చికిత్సయందు సాఫల్యత నొందజాలడు. మరియు శాస్త్రోక్త ఔషధములు లేకున్న వైద్యుడు ఎంతటి సమర్థుడైననూ చికిత్సయందు జయముగాంచుట దుర్లభము. కనుక సగము చికిత్స శాస్త్రోక్త ఔషధములయందు ఆధారపడియున్నదనుటలో ఎంత మాత్రము సందేహముండదు. ఇట్టి శాస్త్రోక్త ఔషధములు తయారు చేయవలెనన్న చాల వ్యయప్రయాసలకు గురికావలసి యుండును. వైద్యుడు తానే స్వయముగా ఔషధములు తయారుచేసుకొనవలసిన బాధ్యత యున్నప్పటికి తనకు కావలసిన కొద్ది పరిమాణము కొరకు యెక్కువ వ్యయప్రయాసలు పడవలసి యుండును. అందువలన నిర్దుష్టమైన ఔషధములు తయారు జేసి వైద్యసోదరులకు ప్రజలకు లభ్యపరచేయవలెనను ఉద్దేశ్యముతో

విజయవాడలోని శ్రీరామమోహన ఆయుర్వేదధర్మవైద్యశాల సంఘం వారు ఒక ఔషధకర్మాగారము(ఫార్మసీ)ను స్థాపించి ఆయా ఔషధములకు కావలసిన మూలికలను, ఇతర ద్రవ్యములను భారతదేశమందలి వివిధ భాగములనుండి సకాలమున తెప్పించి శాస్త్రోక్తముగ గొప్ప పరిమాణములతో అనుభవముగల వైద్యులచే నిర్దుష్టముగ ఔషధములను తయారు చేయించి సామాన్య ధరలకు విక్రయించు చున్నారు. విక్రయము చేయు ఔషధములమీద వచ్చు ఆదాయము ఎవరి స్వార్థమునకు వుపయోగింపబడక ధర్మవైద్యశాల పోషణకే వినియోగింపబడుచున్నది. ఇందులకు పైసంఘమువారికి అనేక కృతజ్ఞతాభివందనములు.

## అనుపాన విశిష్టత

శాస్త్రోక్తముగా తయారుకాబడిన యేయౌషధమునైనను అందుకుసంబంధించిన యేదోవిధమైన అనుపానముతో సేవించవలెను.

"యథాజలగతం తైలం తత్క్షణాదేవసర్పతి,
ఏవమౌషధమఙ్గేషు ప్రసర్పత్యనుపానతః"

అను యోగరత్నాకర సూచన ప్రకారము నీటిమీదవైచిన తైల బిందువు వెంటనే నీటియందంతటను వ్యాపించుచుందంబున అనుపాన ముతో కూడిన ఔషధము శరీరమునందు శీఘ్రముగా వ్యాపించి రోగ ములను హరింపజేయును.

ఇట్టి ఋషివాక్యముల ననుసరించి ఔషధమునకు అనుపానము ముఖ్యమై యున్నది. కనుక ప్రతి యౌషధము అనుపానముతో సేవించ వలయును.

## పథ్యాపథ్యముల విశిష్టత

సామాన్యముగ పథ్యమనునది అపథ్యమనునది వ్యాధినిబట్టియే నిర్ణయించబడును. ఔషధమునుబట్టి వ్రాయుటకు వీలుకలుగదు. కాని రోగి రోగ నివారణ కొరకు ఔషధసేవ జేయునప్పుడు పథ్యము నాచ రించినయెడల ఔషధమునకు సహాయపడి త్వరలో ఆరోగ్యము చేకూర్చును.

ఎట్లనగా— "నిదానౌషధపథ్యాని త్రీణియత్నేనచిన్తయేత్
తేనైవరోగాశ్శీర్యన్తే శుష్కేనీరఇవాంకురాః."

తా॥ రోగవిషయమున ముఖ్యముగ రోగనిదానము, ఔష ధము, పథ్యము యీమూడింటిని బాగుగా నాచరించినయెడల నీరు ఎండు టచే అంకురములు నశించు చందంబున పథ్యము నాచరించుటవలన రోగములు నివారణ నొందగలవు. అను ఋషివాక్యములవలన వ్యాధి నివారణకు ఔషధము, అనుపానము, పథ్యాపథ్యములు ముఖ్యములై యున్నవి. అందువలన పైసంఘమువారు తమ ఔషధ కర్మాగారము (ఫార్మసీ)నందు తయారగుచున్న ఔషధములకు అనుపానములను, వ్యాధులకు పథ్యాపథ్యములను వైద్యులకు, ప్రజలకు సుబోధకమగునట్లు ఇదివరలో "అనుపానపథ్యమంజరి" అను పుస్తకము ప్రకటించి యుండిరి. అట్టి పుస్తకమునే ఇంకనూ విశేష వివరములతో వ్రాయవలసినదిగా ఈ సంస్థయొక్క ఔషధకర్మాగారమున ప్రధానవైద్యునిగా నుండిన నన్ను కోరి నాకు ఈ సదవకాశమొసంగినందులకు పై సంఘమువారికి కృతజ్ఞుడను.

# గ్రంథస్థ విషయము

ఈ పుస్తకమునందు 1. ఔషధఅనుపానములు 2. పథ్యాపథ్యములు 3. ఇతరవిషయములు 4. రోగములు - ఔషధములు 5. విషప్రతివిషములు అను 5 భాగములు కలవు.

ఔషధ అనుపాన ప్రకరణమునందు:— ఆయుర్వేద గ్రంథములయందు ఒకేరకమైన ఔషధయోగములు అనేకవిధములుగా చెప్పబడియుండుటవలన ఏఔషధయోగము ఏగ్రంథమునుండి గ్రహింపబడినదో ఆగ్రంథనామముయొక్క సంజ్ఞాక్షరములు ఔషధనామముదగ్గర వ్రాయబడినవి. ఇందులో కొన్ని H. P (హాస్పిటలు ప్రిపరేషన్సు) ఔషధయోగములుకలవు. అట్టియోగములుగల గ్రంథములను ప్రమాణములుగ యిచ్చియున్నాను.

ఔషధముయొక్క ఫలశ్రుతి వచనముగా వ్రాసిన సులభముగా జ్ఞాపకమునకు వచ్చుట కష్టముగా యుండునను వుద్దేశ్యముతో ముఖ్యమైన ఫలశ్రుతిగల శ్లోకములు పద్యములు వ్రాయబడినవి. ఔషధములయందు వడుద్రవ్యములు సాధ్యమైనంతవరకు పూర్తిగనే ద్రవ్యములను పేరుతో వ్రాసియున్నాను. కాని ఎక్కువ ద్రవ్యములుగల ఔషధములకు మాత్రము ముఖ్యమైన ద్రవ్యములు, రస విష గంధక పాషాణ సంబంధమైన ద్రవ్యములు మాత్రమే వ్రాయబడినవి. మరియు విషసంబంధమైన ద్రవ్యములు కలిసిన ఔషధములవద్ద మోతాదులో విషభాగము యెంత యున్నది, యెటుల సేవింపతగినది మొదలగు వివరములు వ్రాయబడియుండెను. కొందరు మిత్రులు ఔషధములయందు వడు ద్రవ్యములయొక్క భాగములనుకూడ వివరించవలసినదిగా సలహా యిచ్చియున్నారు. అట్లు ద్రవ్యభాగములు వేయుటకు గ్రంథవిస్తరణభీతిచే అట్టి ప్రయత్నమును విరమించితిని. ఇంకనూ ఔషధముఖ్యగుణములు ఔషధ ప్రమాణము (మోతాదు)లు వ్రాయబడినవి.

ఔషధములయొక్క అనుపానములు ప్రయోగములను పేరుతో వ్రాయబడి యుండెను. ఇప్పటి కాలప్రజలకు ఔషధమునకు ఏరసమో

ఏకల్క-మో అనుపానముగా చెప్పిన వాటిని చేసుకొనుటకు బద్ధగించి ఆయాగుణములు గలిగిన మరియొక ఔషధమును అనుపానముగ యివ్వ వలసినదిగా కోరుచున్నారు. అందువలన ఈ పుస్తకమునందు కొన్ని చోట్ల ఔషధములకు ఔషధములనే అనుపానములుగా వ్రాసియుంటిని. అట్టి అనుపానములు వ్రాయుటలో ఏ ఔషధయోగము ఏ గ్రంథము నుండి గ్రహింపబడినదో ఆ గ్రంథమునందు ఆ ఔషధమునకు చెప్పబడిన అనుపానములను ముందుగా వ్రాసి ఆ గ్రంథముయొక్క పేరు సంజ్ఞాక్షరములతో వ్రాయబడి యుండెను. తరువాత అనుభవరూపములైన అనుపానములను వ్రాయబడి యుండెను. అనుపానములు ఔషధము నకు ఏ విధముగా సహాయపడునో "గమనింపు" అనుచోట విపులముగా వ్రాయబడి యుండెను.

"పథ్యాపథ్య" ప్రకరణమునందు ఏరోగమునకు ఎట్టిఆహార విహార ములు హితములు గా యుండునో, ఎట్టివి అహితములుగా యుండునో వ్రాయబడినవి. పథ్యాపథ్యములను యోగరత్నాకరము, బసవరాజీయము, వైద్యచింతామణి అనుగ్రంథముల నాధారముగ తీసుకొని వ్రాయడమైనది.

"ఇత్యర్థవిషయసమ్ము"లను ప్రకరణమునందు వైద్యులు ముఖ్యముగా తెలుసుకొనవలసిన విషయముల గురించి వ్రాయబడియుండెను.

"రోగములు – ఔషధములు" అను ప్రకరణమునందు సామాన్యముగ ఏరోగములయందు ఎట్టిఔషధములు వుపయోగింపవలయునో వివరములు వ్రాయబడినవి.

"విషప్రతివిషములు" అను ప్రకరణమునందు విషద్రవ్యములను సేవించినప్పుడు వెంటనే చేయవలసిన చికిత్సావిధానములు, వాటి విరుగుళ్లు వ్రాయబడియుండెను.

ఈ పుస్తకము యిన్ని వివరములతో వ్రాయబడినందున వైద్యులకు, ప్రజలకు వుపయోగకారియగు నని తలచుచున్నాను. కనుక యిట్టి పుస్తక సహాయముతో వైద్యులు, ప్రజలు వైద్యసహాయము పొందగల రని ఆశించుచున్నాను.

నాకు ఈ పుస్తకము వ్రాయుటకు తగిన సలహాలనుయిచ్చిన—

1. శ్రీ ఆయుర్వేద మహామహోపాధ్యాయ తి. వ. రామానుజస్వామిగారు
2. శ్రీ ఆయుర్వేదోద్ధారక, డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, బి.ఏ.ఎం.బి.సి.యం. గారు
3. శ్రీ వైద్యవల్లభ రాణీ వెంకటాచలపతి ప్రసాదచయనులుగారు
4. శ్రీ ఆయుర్వేద విశారద అండ్ వైద్యవిద్వాన్
చక్రవర్తుల నరసింహాచార్యులు ఏ. ఆర్. ఎ. సి. గారు
5. శ్రీ కోట వెంకటాచలం పంతులుగారు (వైస్‌ప్రెసిడెంటు) } శ్రీరా.ఆ.ధ
6. శ్రీ లక్కరాజు నిరంజనరావుపంతులుగారు (గౌరవ కార్యదర్శి) } వై.సంఘం.

వీరికిని ఆదినుండి చివరవరకు ఇంగ్లీషుకు సంబంధించిన విషయముల లోను, ఇతర విషయములలోను నాకు సలహా సహాయములు చేసినట్టి

7. శ్రీ ఉప్పలూరి కృష్ణమూర్తి పంతులు (శ్రీరామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాలసంఘ వైస్‌ప్రెసిడెంటు)గారికిని కృతజ్ఞతాభివందనములు.

నాకు ఈ పుస్తకము వ్రాయగలశక్తి కలుగుటకు కారణము శ్రీమహామహోపాధ్యాయ తి. వ. రామానుజస్వామిగారియొక్క శిష్యత్వమే. అందువల్ల శ్రీవారికి ప్రత్యేకముగ వందనశతము లర్పించుచున్నాడను

ఈ పుస్తకము వ్రాయుటలో నాకు తగుసహాయము చేసినట్టియు, పై వైద్యశాలయందు నా సహచరులైనట్టియు, శ్రీ ఆయుర్వేద విశారద పొక్కులూరి వెంకటావధాని ఎ.ఆర్.ఎ.సి., శ్రీ ఆయుర్వేదభిషక్ అండ్ వైద్యవిద్వాన్ ఖండవల్లి సీతారామాచార్యులు ఎ. ఆర్. ఎ. సి., శ్రీ ఆయుర్వేద విశారద అనుపిండి సుబ్బయ్యశాస్త్రి, శ్రీ ఆయుర్వేదభిషక్ నంబూరి శ్రీధరరావుగార్లకున్నూ అల్పకాలవ్యవధిలో గ్రంథముద్రణ పూర్తిచేసి యిచ్చిన విజయవాడ రామా ప్రెస్ వారికిన్నీ కృతజ్ఞుడను.

ఇట్లు,

మానికొండ, }
20-8-'50. }

సర్వజన శిష్యపరమాణువు,
రెంటచింతల కృష్ణమూర్తి.

# గ్రంధసంజ్ఞలు

## ఇందలి గ్రంథ సంకేతములు — వాని వివరణము

| | | |
|---|---|---|
| అ॥ భూ॥ | = | అనుభూతము |
| అ॥ హృ॥ | = | అష్టాంగహృదయము |
| ఆ॥ ఔ॥ ర॥ | = | ఆయుర్వేదౌషధరత్నాకరము |
| ఆ॥ క॥ ద్రు॥ | = | ఆయుర్వేద కల్పద్రుమము |
| ఆ॥ వి॥ | = | ఆయుర్వేదవిజ్ఞానము |
| ఆం॥ భై॥ ర॥ | = | ఆంధ్రభైషజ్యరత్నావళి |
| గ॥ ని॥ | = | గదనిగ్రహము |
| చ॥ చి॥ | = | చరకచికిత్సాస్థానము |
| బ॥ రా॥ | = | బసవరాజీయము |
| భ॥ ప్ర॥ | = | భస్మప్రకాశిక |
| భా॥ ప్ర॥ | = | భావప్రకాశిక |
| భై॥ ర॥ | = | భైషజ్యరత్నావళి |
| యో॥ తరం॥ | = | యోగతరంగిణి |
| యో॥ ర॥ | = | యోగరత్నాకరము |
| ర॥ త॥ | = | రసతరంగిణి |
| ర॥ ప్ర॥ | = | రసప్రదీపిక |
| ర॥ యో॥ ర॥ | = | రసయోగరత్నాకరము |
| ర॥ ర॥ స॥ | = | రసరత్నసముచ్చయము |
| ర॥ సా॥ సం॥ | = | రసేంద్రసారసంగ్రహము |
| వా॥ చి॥ స్థా॥ | = | వాగ్భటచికిత్సాస్థానము |
| వై॥ చిం॥ | = | వైద్యచింతామణి |
| వై॥ యో॥ ర॥ | = | వైద్యయోగరత్నావళి |
| శా॥ ధ॥ సం॥ | = | శార్ఙ్గధరసంహిత |
| స॥ చి॥ ర॥ | = | సర్వరోగచికిత్సారత్నము |
| స॥ యో॥ | = | సహస్రయోగము |

శ్రీ రామమోహన ఆయుర్వేద ఫార్మసీ ప్రధాన వైద్యులు,



సంపాదకులు :

ఆయుర్వేదభిషక్ అండ్ వైద్యవిద్వాన్,

రెంటచింతల కృష్ణమూర్తిగారు,

A. R. A. C.

శ్రీ రామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాల అండ్ ఫార్మసీయందు పనిచేయుచున్న వైద్యబృందము



కూర్చున్నవారు:- 1. రెంటచింతల కృష్ణమూర్తిగారు, 2. చక్రవర్తుల నరసింహాచార్యులుగారు, 3. ఖండవల్లి సీతారామాచార్యులుగారు, 4. అనుపిండి

3. పాతు_లూరి వెంకటావధానిగా

# పాఠకలోకమున కొక మనవి

కొంతకాలము క్రిందట నేను శ్రీరామమోహనాయుర్వేద ఫార్మసీలో ప్రధానవైద్యుడుగా నుండుట తటస్థించెను. ఆనాడు నాతో గలసి సహాయ వైద్యులుగా నున్నట్టియు, నీ "ఆయుర్వేదౌషధానుపానపథ్య మంజరి" సంపాదకులగునట్టియు, శ్రీ ఆయుర్వేదభిషక్, ఆయుర్వేదప్రవీణ, రెంటచింతల కృష్ణమూర్తిగారికిని నాకును సంతత సాంగత్యము కుదిరెను. నాకు దెలసినదినేను ఆయనకు దెలసినది ఆయన కలబోసుకొనేవార మప్పుడు. దానినిబట్టి నావద్ద శిష్యులై యుండినట్లు వారుపోద్ఘాతమున వ్రాసినది వారి బుద్ధిమత్త్వమును ప్రకటింపుచున్నది. "కృతోఽస్మిహి లోకోబుద్ధిమతా మాచార్య శ్శత్రురశ్చాబుద్ధిమతామ్" అని కదా చర కోక్తి ! ఇంతట నావృత్తాంతముతో స్థలము నాక్రమింపజేయక ప్రకృత మునకు వచ్చెదను.

ఈ పుస్తకమును వీరు 5 భాగములుగా విడదీసి 1 అనుపానములు 2 పథ్యాపథ్యములు, 3 రోగానుక్రమముగా నౌషధముల వివరములు, 4 ఇతరవిషయములు, 5 విషప్రతిక్రియలు అను విషయములను వివరిం చిరి. ఇది వ్రాయుటలో సంశయము కలగనట్లు చక్కగా వివరించి యున్నారు. మఱియు ననుపానావశ్యకతను గూర్చియు పథ్యావశ్యకతను గూర్చియు నుపోద్ఘాతమునందు చక్కగా జర్చించిరి. కావున నిట్టి విషయములను పెంచి స్థలమును చెరుప దలపెట్టను.

శ్రీరామమోహనాయుర్వేద ఫార్మసీవారు తయారుచేసి సిద్ధపఱచి నట్టియు, పలుచోట్లనుండి సంపాదించి నిలువచేసినట్టియు ఔషధములు భస్మాదులకును, కస్తూరిమొదలగువానికిని చక్కని అనుపానములను గ్రంథ స్థములు, అనుభవసిద్ధములునైన వానిని వివరించిరి. పథ్యాపథ్యములిందే చేర్చి వ్రాయుటచే వైద్యులకును రోగులకును మిక్కిలి సుఖావహము. ఆధునిక వైద్య సంప్రదాయానుసారము రోగిపరీక్షకనుకూలించు నుష్ణ మాపనము. నాడీస్పందమాపనము, రక్తప్రసరణపరీక్షణము ఉచ్ఛ్వాస నిశ్వాస పరిమాణము అను వివిధ విషయములెంతో చక్కగా వివరింప బడినవి. ఔషధప్రయోగములలోగల్గు విషదోషములు ప్రత్యేకవిషభ క్షణ జనితవికారములు శాంతించుప్రక్రియలును చక్కగావ్రాయబడెను.

ఈ యనుపానములు చాలాభాగము ఫార్మసీలోనే దొరకునవియై యుండుటచే రోగులకు సుకరమైయుండును. మరియు ప్రతి యనుపానమునకును ముందాయాయౌషధ ఫలశ్రుతి శ్లోకములుం వ్రాయుట మిక్కిలి యాకర్షణీయమైయున్నది.

ఈ పుస్తక మొక్కటియుండిన నావంటి యల్పజ్ఞులుకూడ వైద్యమును చక్కగా జేసికొనవచ్చును. ఇందుగూర్చి శ్రీ కృష్ణమూర్తిగారు చేసిన పరిశ్రమ కడు శ్లాఘనీయము. వీరి కిత్తోధికమైన యభివృద్ధులు కలుగవలెనని ధన్వంతరిని ప్రార్థించెదను.

ప్రజాహితైకపరులై, నిస్స్వార్థులై శ్రీ ధర్మవైద్యశాలసంఘము వారు చేయుచున్న సేవనుగూర్చి వేరుగా వ్రాయనక్కరలేదు. "జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెంబేలా !"

శ్రీరామతీర్థము
1-9-1950

ఇట్లు,
(సం.) తి. వ. రామానుజస్వామి.

"ఆయుర్వేదభిషక్", "ఆయుర్వేదప్రవీణ" పదలాంఛితులగు, శ్రీయుత రెంటచింతల కృష్ణమూర్తిగారిచే సంపాదింపబడి శ్రీ శ్రీ శ్రీరామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాల సంఘమువారిచే ప్రచురింపబడిన "ఆయుర్వేదౌషధ అనుపాన పథ్యమంజరి" అనెడి పుస్తకమ్మును నేను ది 29-8-50 తేదీని నా మిత్రులగు శ్రీమాన్ ఖండవల్లి సీతారామాచార్యులుగారి ప్రేమమూలమున చూడగలిగితిని. అందలి విషయములు అనగా రోగి సేవించ తగిన మందులకనుపానములు - అందుకు తగిన పథ్యములు - సేవింపరాని అపథ్యము - ఇతర విషయములు అనగా వైద్యమునకు సంబంధించిన వైజ్ఞానికాంశములు మొదలగునవి మిక్కిలి సమంజసముగా నున్నవి. వైద్యపరిచయము లేనివారికి గూడ ఈ గ్రంథము సుబోధముగా నున్నది. గాన నియ్యది చికిత్సకులకు మిక్కిలిగా సాయపడ గలదని నా నమ్మకము. ఇత్యలం.

విజయవాడ
3-9-1950

"వైద్యవల్లభ"
(సం.) రాణి వెంకటాచలపతి ప్రసాదచయనులు.

# వి ష య సూ చి క

# పథ్యాపథ్యములు

## ఇ త ర వి ష య ము లు

శ్రీ ధన్వంతరయే నమః

# వంటఖర్జూరిఔషధములు

## 1. అగ్నికుమార రసము

బ॥ రా. అజీర్ణ॥ ప్ర. 12 వ అధ్యా.

శ్లో॥ విషూచికారోచక సన్నిపాతే । దేయాద్విగుంజా వటికా స్త్వజీర్ణే
శ్రీపర్ణఖండేన యథాబలంచ । శీతంజలంచాను పిబేత్సరంత.

ద్రవ్యములు:—రసము, గంధకము, వెలిగారము, నాభి, గవ్వల భస్మము, శంఖభస్మము, మిరియాలచూర్ణము.

గుణము:—పాచనము, అగ్నివర్ధకము. ఆమ్లశమనము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు

ప్రయోగములు:—(బ॥ రా) తమలపాకులోనుంచి సేవించిన వెంటనే శీతోదకమును త్రాగిన విషూచి, అరుచి, అజీర్ణములు హరించును.

(అ. భూ.) శొంఠిరసముతోగాని, అజమోదార్కము (వాం వాటరు)తోగాని సేవించిన అజీర్ణము, అగ్నిమాంద్యము, కడుపుబ్బరము, పుల్లత్రేనుపులు, అజీర్ణశూలలను హరింపజేయును.

మిరియాలరసముతో సేవించిన పడిశము, ఒడలునొప్పులు మొదలగు బాధలు శమించును.

## 2. అజీర్ణ బలకాలానలరసము

బ॥ రా. అజీ॥ ప్ర. 12 వ అధ్యా.

శ్లో॥ రసోఽజీర్ణ బలకాలానల ఏషప్రకీర్తితః । అనేక కాలనష్టాగ్నేర్దీపనం పరమస్మృతః.

ద్రవ్యములు:—రసము, గంధకము, లోహభస్మము, తామ్ర భస్మము, తాళకము, నాభి, మైలతుత్థము, వంగభస్మము, వెలిగారము,

నేపాళములు, ద్విక్షారములు, పంచలవణములు, మిరియాల చూర్ణము మొదలగు ద్రవ్యములు కలవు. (మిరియాల చూర్ణము ఔషధ పరిమాణమునందు అర్ధ భాగముకలదు.)

గుణము:—దీపనము, పాచనము, రేచనము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు

ప్రయోగములు:— (బౄ రా.) దీనిని మంచినీరుతో సేవించిన చిరకాలముగా యుండు అగ్నిమాంద్యము, ఆనాహము, మలబద్ధము, ఆమ్లపిత్తము, శూల హరించును.

(అ. భూ.) ఏలక్కాయల రసముతో సేవించిన ఆమ్లపిత్తములు హరించును. అల్లపురసముతో సేవించిన, ఆమవాతము, శూల అజీర్ణము, మలబద్ధము హరించును.

త్రికటు కషాయముతో సేవించిన కాసశ్వాసలు, పడిశము, ఎనిమిది విధములైన ఉదరములు నివర్తించును.

సైంధవలవణము చేర్చిన మజ్జిగతో సేవించిన తృప్తిగా భుజింపబడిన అన్నమంతయు, అర్ధయామములోపల జీర్ణము గావింపబడి తిరిగి ఆకలి కలుగునట్లు చేయును.

## 3. ఆ నం ద భై ర వి

బౄ రా. జ్వౄ ప్ర. 1 అధ్యా.

శ్లో॥ ఆనందభైరవవటీ తువరీప్రమాణా । నానానుపాన సహితా సకలామయఘ్నీ.

ద్రవ్యములు:— ఇంగిలీకము, నాభి, వెలిగారము, పిప్పళ్లు, మిరియాలు.

గుణము:—గ్రాహి, జ్వరహరము, కఫపిత్తవికారహరం.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) పొంగించిన అల్లపురసముతో

సేవించిన ఆమవికారము, నోటనీరు, డోకులతో కూడిన జ్వరములు హరించును.

కొడిశపాలవిత్తులు, దాల్చినచెక్క వీని కల్కముతోగాని కుట జారిష్టముతోగాని సేవించిన, గ్రహణి, రక్తగ్రహణి నివర్తించును.

దీనియందు కొంచెము నల్లమందు చేర్చి పై అనుపానములతో సేవించిన అతిసారము, గ్రహణీవ్యాధులు తగ్గును.

మిరియాలరసముతో సేవించిన వాతజ్వరము, పడిశము, ఒడలు నొప్పులు తగ్గును.

దీనిని నిమ్మకాయ రసము, తేనె, నీరు వీనిలో దేనితోనైనా అరగదీసి నేత్రములయందు వేసుకొనిన శిరోబాధ, జలుబు, దోషగుణ ములు హరించును.

ఈ యౌషధముయొక్క మాత్రను పిప్పిపంటియొక్క తొఱ్ఱలో పెట్టిన ఒకవిధమైన ద్రవము బయలుదేరును. దానిని మ్రింగక ఉమ్మి వేయవలెను. ఇటులచేసిన పిప్పిపండ్లవలనకలుగు బాధలు శమించును.--

## 4. ఏకగుణ సిందూరము

వై॥ చిం. శుద్ధి॥ ప్రక.

శ్లో॥ అపహరతి రోగబృందం దృఢయతికాయం మహద్బలం కురుతే
శుక్రస్య శతానిచనూతో సిందూరాఖ్యోరసః పుంసాం.

ద్రవ్యములు:—రసము, గంధకము ఈ రెంటిని సమముగా కలిపి కజ్జలిచేసి వాలుకా యంత్రమున వంట చేయబడినది.

గుణము:—దీపనము, రసాయనము, బల్యము, వృష్యము, జ్వరఘ్నము, త్వచ్యము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని తమలపాకుల యందుంచి

సేవించిన చో మరణము, ముసలితనము, రోగ సమూహము వీనిని హరింప జేయుట యేగాక శరీరదార్ఢ్యము, బలము, శుక్రవృద్ధిని కలుగజేయును.

(అ. భూ.) దీనిలో అశ్వగంధాది చూర్ణమునుగాని, మహా ద్రాక్షాది చూర్ణమునుగాని కలిపి తేనెతో సేవించిన పిల్లలకు కలుగు ఉష్ణాధిక్యతలో జ్వరములను తగ్గించును. మరియు ఆర్చుకొని పోవుట, కురుపులు, దురదలను కూడా తగ్గించును.

దీనిని గుమ్మపాల (అనగా ఉష్ణధారలు) తో సేవించిన రక్త క్షీణము, శుక్రనష్టము, ఆర్చుకొని పోవుట, క్షీణించుటలను పోగొట్టి బలమును, పుష్టిని కలుగజేయును.

దీనికి సమభాగము, మిరియాలను ఒకరాత్రి మజ్జిగలో నానబెట్టి వాటిలో ఏకగుణ సిందూరమును కలిపి మెత్తగా నూరిన పిమ్మట గుంట గలగరాకు రసముతో బాగుగా మర్దించి గురిగింజలంతేసి మాత్రలు చేసి, సేవించిన జీర్ణజ్వరములు, దగ్గు, ఆర్చుకొని పోవుట, బలహీనము లను హరింపజేయును.

## 5. కాంతవల్లభరసము

బ॥ రా. క్షయప్రకరణం. 4 వ అధ్యా.

శ్లో॥ సేవితం మధునాయుక్తం । నిష్కార్ధేన సమన్వితమ్
పాండురోగక్షయం గుల్మ । గ్రహణీ రోగనాశనమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, కాంతము, లోహము, మాండూరము, వెలిగారము, మణిశిల, సిలాజితు.

గుణము:—రసాయనము, బల్యము, దీపనము, రక్తవృద్ధికరము, పాండుశోఫహరము, యకృత్ప్లీహోదరహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా) దీనిని నిత్యము ప్రాత స్సాయం కాలములయందు తేనెతో సేవింపుచుండిన పాండువు, క్షయ, గుల్మము,

యకృత్ప్లీహోదరములు, అగ్నిమాంద్యములనుహరింపజేసి, వీర్యవృద్ధిని, కాంతిని, బలమును గలుగజేయును.

(అ. భూ.) దీనికి రెట్టింపు కర్పూరశిలాజితునుగాను, తిప్పసత్తును గాని కలిపి వెన్నపూస పంచదారతో సేవించిన అధికసంభోగమువలన కలిగిన నరముల బలహీనత, శుక్రనష్టము తగ్గి శరీరమునకు బలమును, రక్తపుష్టిని కలుగచేయును.

దీనిలో త్రిఫలాచూర్ణముకలిపి గోమూత్రముతోగాని, లోహాసవముతోగాని సేవించిన పాండు, కామిలా, క్రిమిజ పాండువ్యాధులు నివర్తించును.

గోక్షురాదిచూర్ణము కలిపి పునర్నవారిష్టముతో నుపయోగించిన శోఫ, ఉదరవ్యాధులు హరించును.

గంగాధరచూర్ణమును కలిపి కుటజారిష్టముతో సేవించిన శోఫల యందు కలుగు అతిసారములు నివర్తించును.

దీనిలో జసద భస్మము, కాసీససిందూరములను కలిపి తేనెతో నుపయోగించిన పిల్లలకు కలుగు యకృత్ప్లీహ (లివర్ స్ప్లీన్) రోగములు హరించును.

## 6. కాలకూటరసము

బ॥ రా॥ సన్ని॥ ప్ర. 2వ అధ్యా.

శ్లో॥ గుంజామాత్రం వటీంకృత్వా, శృంగబేరంపిబేదను
అసాధ్యం సన్నిపాతంచ, సర్వజ్వరహరం పరం.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, మణిశిల, తామ్ర భస్మము, వెలిగారము, తాళకము, మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దోషపాచనము, సన్నిపాత జ్వరహరము, విషమ జ్వరహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిని అల్లపురసముతో సేవించిన అసాధ్య సన్నిపాతములు, సప్తవిధ దోషములు, సర్వ జ్వరములు హరించును. దీనిని సేవించునపుడు శీతోదక స్నానము, శ్రీగంధ లేపనము పెరుగన్నమును భుజించుట, ఖర్జూరాది ఫలభక్షణము మొదలగు శీతలోపచారములు చేయవలెను.

(అ. భూ.) దీనిని అమృతారిష్టముతో గాని, దశమూలారిష్టముతో గాని నుపయోగించిన త్రయోదశ సన్నిపాత జ్వరములు తగ్గును.

కిరాతారిష్టముతో గాని, పంచతిక్త రసాయనముతో గాని నుపయోగించిన దోషజ్వరములు, వాతకఫజన్య జ్వరములు, విషమ (Malaria) జ్వరములు తగ్గును.

దీనిని చనుపాలతో కలిపి 3 గంటల కొకపర్యాయము యిచ్చుచుండిన సూతికావాతములు, సన్నిపాత జ్వరములయందు కలుగు కరపాద శీతలమును తగ్గించి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును.

N B ఇందు నాభి ఎక్కువభాగము చేరియున్నది కనుక దోషోద్రేకము ననుసరించి మోతాదును నిర్ణయించి జాగ్రత్తగా వాడవలయును.

## 7. క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసము (కస్తూరి కలిసినది)

(ఏకోత్తరవృద్ధి లక్ష్మీవిలాసరసము)

ఆ॥ ఔ॥ ర. ప్రథమగుచ్ఛము

శ్లో॥ రాజరోగం నిహన్త్యాశుక్షయం పాణ్డుం వినాశయేత్
ద్వన్ద్వజంమూర్ఛరోగంచ శ్వాసంకాసంచకామలామ్.

ద్రవ్యములు:—స్వర్ణం, రజతం, తామ్రం, కాంతం, లోహం, మాండూరం, అభ్రకం, వంగం, నాగం, ముత్యం, పగడం, వీట్లభస్మములు, హింగుళోత్థరస సిందూరము. (భస్మములు ఒకదానికంటె ఒకటి క్రమ క్రమముగా ఒకభాగముచొప్పున ఎక్కువ చేర్చబడియున్నవి.)

గుణము:—బల్యము, వృష్యము, రక్తవృద్ధికరము, కఫహరము, క్షయహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర) దీనిని పంచదార, నెయ్యి, తేనె, వీట్లలో దేనిలోనైనా కలిపి సేవించినయెడల రాజయక్ష్మ, క్షీణించుట, పాండురోగము, శ్వాస, కాస, కామిర్లు మొదలగు వ్యాధులను హరింపచేసి వీర్యవృద్ధిని, అగ్నిదీప్తిని, బలమును కలిగించును. (అ॥ భూ)

దీనిలో సితోపలాదిచూర్ణమును కలిపి వెన్నపూసతో సేవించి ద్రాక్షారిష్టమునుగాని, వాసారిష్టమునుగాని త్రాగిన ఘోరమైన క్షయలు, గుండెదడ, ఉరఃక్షతము, శుక్రనష్టము, దౌర్బల్యములను నివర్తింపచేసి ఊపిరితిత్తులకు బలమును కలుగచేయును.

దీనిని చ్యవనప్రాశలేహ్యమునందు కలిపి సేవించిన శ్వాసకోశములకు బలముకలుగచేసి, కఫమును హరింపచేసి క్షయలు, శ్వాసకాసములు, ఉరఃక్షతములను తగ్గించి, శరీరమునకు పుష్టి, స్నిగ్ధత్వమును, బలమును కలుగచేయును.

చిరకాల క్షయలను నివర్తింపచేయుటకు ముఖ్యమైన ఔషధము.

దీనిలో సోమకల్పచూర్ణము, తాళకభస్మములను కలిపి కనకాసవముతో సేవించిన తమకశ్వాసలు హరించును.

N B ఈ ఔషధము కుంకుమపువ్వు, కస్తూరితో భావనమర్దనలు చేయబడినది.

## క్రమవృద్ధిలక్ష్మీవిలాసరసము (కస్తూరిలేనిది)

(ఏకోత్తరవృద్ధి లక్ష్మీవిలాసరసము)

ఆ॥ ఔ॥ ర. (ప్రథమగుచ్ఛము)

దీని వివరములన్నియు క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసము (కస్తూరి కలిసినది) కు వ్రాయబడినవిగనే గ్రహించవలెను.

దేశ సాత్మ్యముల ననుసరించి కొందరికి కస్తూరికలుపుటవలన

శరీరమునకు ఉపకరించకపోవుటవలన దీనిలో కస్తూరి భావనమాత్రము తగ్గించడమైనది. యిది ఉష్ణతత్వముగలవారికి వెనుక వ్రాయబడిన అనుపానములతో నుపయోగించిన ఆయా వ్యాధులయందు బాగుగా పని జేయును.

## 8. కాలాగ్నిరుద్రరసము

బ॥ రా. (వా॥ ప్ర.) 6 వ అధ్యా.

శ్లో॥ అశీతిర్వాతజాన్ రోగాన్ । గుల్మంచ గ్రహణీ గదాన్.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, అజామోదము, త్రిఫలములు, ద్విక్షారములు, త్రికటుకములు, విషముష్టి మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, స్రోతశ్శోధనము, వాతశమనము, గ్రాహి.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిలో మిరియాల చూర్ణమును కలిపి నేతితో సేవించిన అగ్నిమాంద్యము, కుక్షివాతము మొదలగు ఎనుబది వాతములు, గుల్మము, గ్రహణివ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిని అశ్వగంధారిష్టముతో గాని, దశమూలారిష్టముతోగాని సేవించిన స్రోతస్సులను శుభ్రపరచి నరములకు పుష్టినిచ్చి వాతరోగములను నివర్తించును.

కుటజారిష్టముతో నుపయోగించిన గ్రహణి, అతిసారములు నివర్తించును.

N B. ఈ ఔషధ పరిమాణమునందు అర్థభాగము విషముష్టికలదు.

## 9. క్రిమిముద్గర రసము

వై॥ చిం. (క్రిమి॥ ప్ర.)

శ్లో॥ ... ... ... ... నిష్కప్రమాణం మధునావలీఢం
పిబేత్కషాయం ఘనజంతదార్వ్యం రసోప్రయుక్తః క్రిమిముద్గరాఖ్యః.

ద్రవ్యములు:—రసము, గంధకము, అజామోదము, వాయువిడంగములు, విషముష్టి, మోదుగవిత్తులు.

గుణము:—దీపనము, పాచనము, క్రిమిహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని తేనెతో సేవించి వెంటనే తుంగ ముస్తల కషాయమును పుచ్చుకొనిన మలమునందుండు క్రిము (నులిపురుగు)లు నశించి ఆకలి వృద్ధియగును.

(అ. భూ.) దీనిని శొంఠిరసముతో సేవించిన అగ్నిదీప్తి (ఆకలి)ని కలుగచేయును.

నల్లజీలకఱ్ఱ, మోదుగమాడలు వీట్లకషాయముతో సేవించిన క్రిములు హరించును.

అభయారిష్టముతో సేవించిన ప్రేగులయందుండు క్రిము (ఏలిక పాము)లు చచ్చి కడుపునొప్పి తగ్గును.

## 10. గ్రహణీవజ్రకవాట రసము

బృ॥ రా. [గ్రహణీప్ర] 10 వ అధ్యాయం.

శ్లో॥ .. .
. .. . మాషైకం మధునాలిహేత్
వహ్నిం శుంఠీవిడంబిల్వం । లవణంచూర్ణయేత్సమమ్
పిబేదుష్ణాంబునాచాను । వాతజాం గ్రహణీం జయేత్.

ద్రవ్యములు:—రసభస్మము, అభ్రకభస్మము, గంధకము, యవక్షారము, వెలిగారము మొదలగు ద్రవ్యములుకలవు.

గుణము:—దీపనము, పాచనము, గ్రాహి, గ్రహణ్యతిసారహరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(బృ॥ రా) దీనిని తేనెతో సేవించి వెంటనే చిత్రమూలము, శొంఠి, వాయువిడంగములు మారేడు బెరడు, సైంధ

వలవణము అనుపానిని సమభాగములుగ గ్రహించి, ఉష్ణోదకముతో నూరిన కల్కమును త్రాగిన వాతగ్రహణి నశించును.

(అ. భూ.) దీనిని తేనెతోగాని, మజ్జిగతోగాని సేవించిన గ్రహణి, అతిసారములు నివర్తించును.

దీనిలో దాడిమాష్టకచూర్ణమును కలిపి కుటజారిష్టమునుగాని, కర్పూరాద్యరిష్టమునుగాని సేవించిన దీర్ఘకాలాశ్రితగ్రహణి, ప్రవాహిక వ్యాధులు, అతిసారములు హరించును.

## 11. గంధక రసాయనము

బృ॥ రా. [కుష్ఠ॥ ప్ర.] 13 వ అధ్యా.

శ్లో॥ ధాతుక్షయం మేహగణాగ్ని మాంద్యం శూలం తథాకోష్ఠగతాంశ్చరోగాన్।
కుష్ఠాన్యథాష్టాదశ భేదవంతి నివారయత్యేవచ రాజరోగమ్.

ద్రవ్యములు:—గంధకము, పంచదార.

గుణము:—రక్తశుద్ధికరము, కుష్ఠహరము, త్వచ్యము, వ్రణరోపణము, బల్యము.

ప్రమాణము:—1/16 తులము మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—(బ. రా.) దీనిని చాతుర్జాతకములు, తిప్పతీగె, కరక్కాయ వీనిలో యేఒక్క కషాయముతో సేవించినను ధాతుక్షయము, సర్వమేహములు, అగ్నిమాంద్యము, సర్వకుష్ఠువులు హరించును.

(అ. భూ.) దీనిని నేతితో కలిపి సేవించి శారిబాద్యారిష్టమును త్రాగినయెడల దురదలు, గజ్జి, తామర, మచ్చలు, మూగతీట, విసర్పి మొదలగు రక్త చర్మగత రోగములు నివర్తించును.

దీనిలో అశ్వగంధాదిచూర్ణమును కలిపి నేతితో సేవించుచూ ఖదిరారిష్టమును త్రాగిన సర్వకుష్ఠములు, శ్విత్రము, మేహవ్రణము

లను నివర్తింపజేసి రక్తగత క్రిములను చంపును, మరియు రసపట్లను నివర్తింపచేయును.

N B ఈ ఔషధమును సేవించుటకుముందు వమన, రేచనములను చేయవలయును. మరియు ఈ ఔషధమును సేవించునప్పుడు జాంగల మాంసమును, మేక మాంసమును తినవలెను.

## 12. గోమూత్రశిలాజితు

శ్లో॥ నూనం సజ్వరపాండు శోఫశమనం మేహాగ్ని మాంద్యాపహం.

గుణము:—రసాయనము, సకల ప్రమేహహారము, దీపనము నేత్ర్యము, అస్థి సంధానకరము.

ప్రమాణము:— 1 మొదలు 2 చిన్నముల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని వసంత కుసుమాకరము నందు చేర్చిగాని, ప్రత్యేకముగా గాని, త్రిఫలాకషాయముతో గాని, సేవించిన మధుమేహము, ప్రమేహ పిటికలు, శుక్రమేహము, లాలామేహము, పిష్టమేహము, క్షయలను తగ్గించి వీర్యవృద్ధిని కలుగచేయును.

దీనిని ప్రత్యేకముగా ఆవుపాలతో సేవించిన సుఖజాడ్యముల వలన మూత్రద్వారమునందు కలుగు పుండ్లను మాన్పును.

తారకేశ్వర రసమునందు కలిపి కొండపిండి వేళ్ళ రసముతో సేవించిన మూత్ర కృచ్ఛ్రము, మూత్రాఘాతము, పాండుశోఫలను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిని ప్రతినిత్యము రాత్రివేళ శనగలు నానవేసి ఉదయమున వడపోసిన నీళ్ళతో సేవించిన అమిత వీర్యవృద్ధిని కలిగించి షండత్వమును పోగొట్టును.

దీనిని ఆవునేతిలోవేసి కాచి లోపలకు సేవించి దీనినే పైన రాసి కట్టు కట్టుచుండిన ఎముకలు విరిగిన నొప్పులు, దెబ్బలు తగ్గి, విరిగిన ఎముకలను తిరిగి కలుసుకొనునట్లు చేయును.

## 13. గుడూచీసత్వము

(తిప్పసత్తు అనిగూడా పిలుతురు)

ఆం॥ వై॥ ర.

ద్రవ్యము:—ఈ ఔషధము ముదిరిన తిప్పతీగె వేళ్ళనుండి తీయుసత్వము.

గుణము:—జ్వరహారము, ఉష్ణశమనము, పిత్తహారము, వృష్యము, ప్రమేహహారము, ప్రదరరోగహారము, శుష్క-కాసహారము.

ప్రమాణము:—2 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—దీనిని పంచదార, వెన్న, లేక నెయ్యి మొదలగు అనుపానములతో సేవించిన తాపము, జీర్ణజ్వరము, మధుమేహము, అతిమూత్రము, శుక్లనష్టము, నోటిపూత, దగ్గు, పిత్తవ్యాధులు, ప్రదరరోగములు హరించును.

(అ. భూ.) దీనిని స్వర్ణమాలినీవసంతరసము, షడ్గుణసిందూరము మొదలగు జ్వరహర, రసాయనక రౌషధములయందు కలిపి తేనెతో సేవించిన పురాణజ్వరములు, పొడిదగ్గు, శుక్లనష్టము, క్షయ, ప్రదర రోగములను తగ్గించును.

దీనిని వసంతకుసుమాకరము, తారకేశ్వరరసము మొదలగు ప్రమేహ హరౌషధములయందు కలిపి సేవించిన సమస్త ప్రమేహ వ్యాధులు హరించును.

దీనిని ఉష్ణశమన, పిత్తహరౌషధములయందు అనుపానముగా చేర్చుకొని సేవించిన పై వ్యాధులయందు బాగుగా పనిచేయును.

## 14. చతుర్ముఖరసము

వై॥ ర॥ (వాత॥ ప్ర.)

శ్లో॥ యేతద్రసాయనవరం త్రిఫలామదుయోజితం
తద్యథాగ్ని బలం ఖాదేత్ వలీపలితనాశనమ్
క్షయమేకాదశవిధం, పాండురోగం ప్రమేహకం.

ద్రవ్యములు:—రసము, గంధకము, లోహభస్మము, అభ్రక భస్మము, స్వర్ణభస్మము.

గుణము:—రసాయనము, దీపనము, వాతహరము, వలీపలిత నాశనం, కఫహరం.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(భై. ర.) దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి తేనెతో సేవించిన శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, క్షయ, పాండు, ప్రమేహరోగము మొదలగు వ్యాధులను హరింపచేసి వెంట్రుకలను నల్లనిరంగుతో బాగుగా పెరుగునట్లు చేయును.

(అ. భూ.) దీనిలో ప్రవాళభస్మమును కలిపి తేనెతో సేవించిన కాసశ్వాసలు, క్షయలు తగ్గును.

దీనిని శారిబాద్యారిష్టముతో గాని ఖదిరారిష్టముతో గాని సేవించిన కుష్టువ్యాధులు, విసర్పి, మేహవ్రణములు విద్రధిహరించును. మరియు వాతవ్యాధులయందు కూడా బాగుగా పనిచేయును.

## 15. జోగినీరసము

వై॥ యో॥ ర. (అనుబంధములోయున్నది)

ద్రవ్యములు:—రసము, నాభి, గంధకము, వెలిగారము, తాళకము, త్రికటుకములు, త్రిఫలములు, నేపాళములు గలవు.

గుణము —భేదనము, రేచనము, పాచనము, జ్వరహరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రలవరకు (మాత్రలు చిన్న గురిగింజలవలె నుండును.)

ప్రయోగములు:—దీనిని ఉదయమున అల్లపురసముతో సేవించిన సుఖవిరేచనములను కలుగజేసి మలబద్ధమువలన వచ్చు జ్వరములను హరింపజేసి ఆకలిని కలుగజేయును.

దీనిని శొంఠి, మిరియాలరసముతో సేవించిన ఒడలు నొప్పులు పైత్యవికారములు, జ్వరములు హరించును.

N B. ఈ ఔషధముయొక్క మోతాదులో సుమారు $\frac{1}{2}$ (అర్ధ) భాగము నేపాళేముకలదు కనుక చిన్నపిల్లలకు (అనగా 3 సంవత్సరముల లోపువారికి) $\frac{1}{2}$ మాత్రను, 3 సంత్సరముల వయస్సుమించినవారికి 1 మాత్రను, పెద్దవారలకు 2 మాత్రలను వాడవలెను.

దీనిని గర్భిణీస్త్రీలు, సంవత్సరములోపు వయస్సుగల చిన్నపిల్లలకు నుపయోగించ కూడదు. (అనగా అన్నమతినని పిల్లలకు)

## 16. తరుణార్కము

బ॥ రా. (జ్వ॥ ప్ర.) 1 వ అధ్యా.

శ్లో॥ వటుకాన్ సర్షమాత్రేణ హ్యానుపానవిశేషతః
తరుణార్కరసోఖ్యాతః ॥ సర్వజ్వర నివారణః.

ద్రవ్యములు:—గంధకము, వెలిగారము, అభ్రకభస్మము, నాభి, ఉమ్మెత్తవిత్తులు, గరళం (పాముపిషం) వంగభస్మం, రక్తచందనం, ఇంగిలీకం.

గుణము:—సన్నిపాత జ్వరహరము, కఫహరము, శీతహరము, వాతహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు

ప్రయోగములు:—(అ. భూ.) తమలపాకు రసముతో సేవించిన జ్వరములు తగ్గును. కంఠగత శ్లేష్మములయందు తీవ్రముగా పనిచేయును.

చిత్రమూల కషాయముతో సేవించిన సన్నిపాత జ్వరము, వాత ములను హరింపచేయును. మరియు సన్నిపాత జ్వరములయందు కలుగు కరపాద శీతలమును, పోగొట్టి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును.

N B నోటియందు పుండ్లు గల రోగులకు గరళము కలిసిన ఈ ఔషధము నుపయోగించ కూడదు.

## 17. తామ్ర మైనము

భస్మప్రకాశిక (కృష్ణపండితీయము)

ద్రవ్యములు:—తామ్రము, గంధకము.

గుణము:—దీపనము, పాచనము, శూలహరము, రక్తదోష హరము, త్వచ్యము.

ప్రమాణము:—2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని ద్రాక్షారిష్టముతో సేవించిన అగ్నిమాంద్యమును పోగొట్టి మంచి ఆకలి కలుగచేయును.

దీనిలో శంఖభస్మము లేక వరాటభస్మమునుగాని కలిపి అజమోదార్కముతో నుపయోగించిన, అజీర్ణము, శూలవ్యాధులను హరింపచేసి, జీర్ణశక్తిని కలుగచేయును.

శారిబాద్యారిష్టముతోగాని, ఖదిరారిష్టముతోగాని సేవించిన రక్తగత రోగములు, చర్మగతరోగములు (అనగా కుష్టు, శ్విత్రము, విసర్పి, విద్రధి, దురద, గజ్జి, తామర, మచ్చలు మొదలగునవి) తగ్గును.

## 18. తారకేశ్వరరసము

బ॥ రా. (మేహ ప్ర.) 9 వ అధ్యా.

శ్లో॥ మాషమేకం లిహేత్ క్షౌద్రైః । బహుమూత్రాపనుత్తయే

ద్రవ్యములు:—రససిందూరము, వంగభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము.

గుణము:—దీపనము, రసాయనము, ప్రమేహరోగహరము,

ప్రమాణము:—½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ రా.) దీనిని మేడిపండ్ల చూర్ణమునందు కలిపి తేనెతో సేవించిన, బహుమూత్రము, మధుమేహము, శుక్రమేహము మొదలగు ప్రమేహరోగములు హరించును.

(అ. భూ.) దీనిలో గోమూత్ర శిలాజిత్తును కలిపి మాత్రలను కట్టి వాటిని త్రిఫలా కషాయముతో సేవించిన ఇరువది ప్రమేహములు, మలబద్ధము హరించి బలమును కలుగచేయును.

ఇది వసంతకుసుమాకరమువలె పనిచేయుటవలన దీనిని పేదవారి పాలిటి వసంతకుసుమాకరమని చెప్పవచ్చును.

N B ఈ యోగౌషధ సేవనకాలమున పెసలు, ఉసిరికపప్పు (త్రైఫలామలకము) వేసి తయారు చేసిన యూషము (కట్టు) మజ్జిగ నుపయోగించుట పథ్యకరము.

## 19. తాళక సిందూరము (రసమాణిక్యము)

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ సంపూజ్య దేవదేవేశం కుష్ఠరోగాద్విముచ్యతే
స్ఫుటితం గలితం కుష్ఠం వాతరక్తం భగన్దరమ్.

ద్రవ్యములు:—తాళకము మాత్రమే.

గుణము:—కుష్ఠహరము, కాసశ్వాసహరము, కఫహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు.—(ఆ॥ ఔ॥ ర) దీనిని నెయ్యితోగాని, తేనెతో గాని సేవించిన సమస్త కుష్ఠువ్యాధులు, వాతరక్తము, భగందరము, నాడీవ్రణములు హరించును.

(అ. భూ.) దీనిని పై అనుపానములతో సేవించి ఖదిరారిష్ట మును త్రాగిన పైన వ్రాయబడిన వ్యాధులయందు అమోఘముగా పనిచేయును.

దీనిని ప్రవాళభస్మము శృంగభస్మములను కలిపి వెన్న పూసతో సేవించిన శ్వాసకాసలు, మెఘరింజి, ఉబ్బసములయందు కలుగు ఆయాసమును నిముషములమీద తగ్గించి సుఖమును కలుగ చేయును.

## 20. త్రైలోక్య చింతామణి

వై॥ రం (షష్ఠ॥ ప్ర.)

శ్లో॥ వాతవ్యాధిక్షయం వాజ్జ్వరమపి చ ప్రమేహాంశ్చ శూలాన్ ప్రవాహాన్
స్పష్టం త్రైలోక్య కాసక్షయ కఫజం దోషం గలరోగాన్ మహా.

ద్రవ్యములు:—రసము, గంధకము, అభ్రకము, స్వర్ణము, రజితము, మాణిక్యము, వజ్రము, స్వర్ణమాక్షికము, పగడము, లోహము, ముత్యము, శంఖము వీటి భస్మములును, తాళకము,

మణిశిల, రసభస్మము, వైక్రాంతభస్మము, నాభి మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—కఫవాతహరము, క్షయహరము, హృద్యము, కాసశ్వాసహరము, రేచనము, శీతహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చి.) దీనిని ఉదయము సేవించిన వాతవ్యాధి, ఆమవాతము, జ్వరము, ఉదరము, శ్వాస, శూల, క్రిమి, రక్తవాతము, రక్తపిత్తము, ధాతుక్షయము, దగ్గు, క్షయ, కఫరోగము, ఉరఃక్షతము, అజీర్ణము, తమకశ్వాస, మొదలగు రోగములను హరింప జేయును.

(అ. భూ.) దీనిని ఆకుజెముడాకుల రసము తేనెతో సేవించిన కంఠగతమగు కఫము, ఆయాసములను హరింపజేసి హృదయమునకు బలమును కలుగజేయును.

తమలపాకు రసముతో సేవించిన దారుణ సన్నిపాత జ్వరములు కరపాద శీతలము, క్షయ, దగ్గు, ఆయాసములు హరించును.

దశమూలారిష్టముతో సేవించిన ఆమవాతము, పంగువాతము, ఆఢ్యవాతము మొదలగు వాతరోగములను హరింపజేసి విరేచనము కలుగజేయును.

దీనిని వాకుడుపండ్ల రసముతో సేవించిన క్షయ, ఉరఃక్షతము, రక్తపిత్తము, దగ్గు, ఆయాసము మొదలగు కఫసంబంధమైన వ్యాధులను హరింపజేయును.

దీనితో సమానముగ గోరోజనము, పావుదారు, రొయ్యిపీత, జున్ను, కస్తూరిని గ్రహించి మునగచెక్క రసముతో నూరి పెసరగింజంత మాత్రలు కట్టి నుపయోగించిన సూతికా వాతములు, సన్నిపాత జ్వరములు, పై వ్యాధులయందు కలుగు కరపాద శీతలములు, కంఠగతమగు శ్లేష్మములను హరింపజేసి శరీరమునకు ఉష్ణమును హృదయమునకు బలమును కలుగజేయును.

ఆ సన్న మరణకాలమందు దీని నుపయోగించిన హృదయమునకు బలము కలుగజేసి ప్రాణమును కాపాడును.

## 21. దేవకుసుమ రసాయనము

వై॥ యో॥ ర.

శ్లో॥ .. .. కుంకుమైర్యుతం ఖాదన్ హరతి
ఫిరంగ వ్యాధింసోపద్రవం సపదిరచయతి రమణీశతకం.

ద్రవ్యములు —లవంగములు, రసకర్పూరము, చందనము. కస్తూరి, కుంకుమపువ్వు, గంధకం.

గుణము:—స్రోతశ్శోధకము, రక్తదోషహారము, సవాసమేహ హారము, త్వచ్యము.

ప్రమాణము:—1 మొదలు 3 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని శారిబాద్యారిష్టముతో పాడిన సవాసమేహమువలన కలుగు కొరుకుడు, భగందరము, కీళ్ళ నొప్పులు, కీళ్ళవాపులు, వాతరక్తములు హరించును.

ఖదిరారిష్టముతో నుపయోగించిన కుష్టములు, విసర్పి, కురుపులు, పోడలు తగ్గును.

## • 22. నవగ్రహి సిందూరము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ సర్వరోగేషు దాతవ్య శ్చానుపానవిశేషతః.

ద్రవ్యములు.—గౌరీపాషాణము, ఇంగిలీకము, గంధకము, రసము, తాళకద్వయము, మైలతుత్థము, మణిశిల, కఫరి.

గుణము:—స్రోతశ్శోధనము, కఫహరము, సన్నిపాతజ్వరహరము, సూతికావాతహరము, రక్తగతక్రిమిహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) తులసిఆకురసమునందు తేనె చేర్చి అందు ఈ ఔషధమును కలిపి యిచ్చిన కంఠమందు శ్లేష్మ

మెదురోకొనుట, శ్వాసకాసలు, కాళ్ళుచేతులు చల్లబడుట, చెమటలు పట్టుట వీనిని తగ్గించి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును.

సదాపాకు మిరియాల కషాయముతోగాని దశమూలారిష్టముతోగాని నుపయోగించిన సన్నిపాత జ్వరములు సూతికావాతములు హరించును.

శారిబాద్యారిష్టముతో నుపయోగించిన రక్తజ క్రిములను చంపి, కుష్టము, విసర్పి, విద్రధి భగందరములకు తగ్గించును.

మధుస్నుహిరసాయనముతో సేవించిన సవామేహ (ఫిరంగ) రోగములు హరించును.

దీనిలో ప్రవాళభస్మము, సోమకల్పచూర్ణములను కలిపి వెన్న పూసతో సేవించిన తమకశ్వాస (ఉబ్బసము)లు తగ్గును.

## 23. నిత్యానంద రసము

భై॥ ర. (శ్లీపద॥ ప్ర.)

శ్లో॥ నిత్యానంద రసఖ్యాయం, మహాశ్లీపదనాశనః
రక్తజేపిత్త జేచాపిశ్లీపదేయోజయేదముం.

ద్రవ్యములు:—రసము, గంధకము, తామ్రము, కంచు, వంగము శంఖము, లోహము వీట్ల భస్మములు. తాళకము, మైలతుత్థము, పంచ లవణములు, త్రికటుకములు, త్రిఫలములు, తెగడ. మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:— బల్యము, శ్లీపద, గండమాల, అర్బుద, క్రిమిరోగహరము.

ప్రమాణము:—2 మొదలు 8 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని చల్లని నీటితో సేవించిన శ్లీపదము, గండమాల, అర్బుదము, వాతరక్తము, అంత్రవృద్ధి, గుద రోగము, క్రిమిరోగములను హరింపచేయును.

(అ. భూ.) దీనిని కిరాతారిష్టముతోగాని, త్రిఫలా కషాయముతోగాని సేవించిన, శ్లీపదము, గండమాల, అర్బుద, అండవృద్ధులను హరింపచేయుచూ వానితోకూడిన జ్వరములను తగ్గించును.

మహారాస్నాదిక్వాథముతో సేవించిన, శ్లీపదజ్వరము (Filaria - feavers) లు, వ్రణములు, క్రిమిరోగములు, రక్తదోషములు నివర్తించును.

గోమూత్రముతోగాని, పునర్నవారిష్టముతోగాని సేవించిన మేదోరోగములు హరించును.

బోదకాలున (Elephantiasis)కు యిదియే దివ్యౌషధము.

## 24. పంచలోహ రసాయనము

ర॥ యో॥ ర. [4వ అధ్యా.]

శ్లో॥ చణమాత్రవటీః కృత్వా నవనీతేన సేవయేత్
ప్రాతిరుత్థాయ విధినా సర్వమేహకులాంతకః.

ద్రవ్యములు:—అభ్రకభస్మము, కాంతభస్మము, లోహభస్మము, నాగభస్మము, వంగభస్మము.

గుణము:—రక్తవృద్ధి కరము, రసాయనము, ప్రమేహహరము, పాండు, శోఫరోగ హరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ యో॥ ర.) దీనిని వెన్నతో సేవించిన సర్వమేహములు హరించును.

(అ॥ భూ.) దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి నేతితో సేవించిన సమస్తప్రమేహ వ్యాధులు హరించును.

దీనిలో గోక్షురాది చూర్ణమును కలిపి పునర్నవారిష్టముతో సేవించిన పాండు, శోఫవ్యాధులను పోగొట్టి రక్తమును వృద్ధిచేయును.

N B ఈ యౌషధ సేవనకాలమున పరియన్నము, పొట్లకాయ, చిత్రికూర, చక్రవర్తికూర, పొన్నగంటికూర, పెసరకట్టు, అరటికాయ అనువానిని సేవించుట పథ్యము.

## 25. ప్లీహాంతకరసము

అ॥ ఔ॥ ర.

శ్లో॥ అష్టోదరాణి పాణ్డుత్వమానాహం విషమజ్వరం.

ద్రవ్యములు:—తామ్రము, రజితము, అభ్రకము, లోహము, ముత్యము. శంఖము పిష్టిభస్మములు, రసము, గంధకము నేపాళములు, తెగడ మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, పాచనము, రేచనము, శూలహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిని మంచినీటితో సేవించిన ఉదర వ్యాధులు, పాండువు ఆనాహము, విషమజ్వరము మొదలగు వ్యాధులను హరింపచేయును.

(అ. భూ.) దీనిని ఉదయ సాయంత్రములయందు రోహితకారిష్టముతో సేవించిన ఉదరరోగములు, అజీర్ణము, ఆమ్లపిత్తము, యకృత్ప్లీహరోగములను నివర్తింపచేసి విరేచనమును కలుగచేయును.

అజమోదార్కముతో నుపయోగించిన అజీర్ణము, ఆనాహము, శూలలను హరింపచేసి విరేచనమును కలుగచేయును.

## 26. పైత్యాంతకము

అనుభూతము

ద్రవ్యములు:—ఇంగిలీకము, శొంఠి, జీలకఱ్ఱ, ఉసిరికపప్పు, సైంధవలవణము, రససిందూరము.

గుణము:—రుచ్యము, దీపనము, పిత్తహరము, ఆమపాచనము.

ప్రమాణము:— 2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని జీలకఱ్ఱ రసముతో సేవించిన వాంతి, ఎక్కిళ్ళు, అరుచి, గుండెదడ హరించును.

ధనియాలరసముతో సేవించిన కడుపులో మంట, తలతిరుగుట, దద్దుర్లు పార్శ్వపునొప్పులు హరించును.

పులిమజ్జిగతో సేవించిన అజీర్ణము, అగ్నిమాంద్యములను తగ్గించి జీర్ణశక్తిని కలుగచేయును.

## 27. ప్రతాప లంకేశ్వరరసము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ ప్రసూతివాతే నిలదన్తబాధే సార్ద్రా(?)ప్యసా వల్లమముష్య దద్యాత్.

ద్రవ్యములు:—రసము, గంధకము, అభ్రకము, లోహము, శంఖము, పీట్లభస్మములు, పిప్పళ్లు, నాభి మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వాతశ్లేష్మహరము, సన్నిపాత జ్వరహరము, గ్రాహి, సూతికావాతహరము.

ప్రమాణము:—2 మొదలు 4 గ్రైనులవరకు

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిని అల్లపురసముతో వల్ల ప్రమాణముగ సేవించిన యెడల సూతికావాతము, వాతముచేపుట్టిన దంతములతీపు నశించును.

దీనిని తిప్పతీగె రసముతోగాని, అల్లపురసముతోగాని, త్రిఫలా కషాయముతోగాని సేవించిన వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, అర్శస్సులు తగ్గును.

శొంఠిరసముతో సేవించిన సన్నిపాతజ్వరము, కఠినజ్వరములు నివర్తించును.

(అ. భూ.) సదాపాకు, మిరియాలకషాయముతో సేవించిన సన్నిపాతజ్వరములు, సూతికావాతములు తగ్గును.

దీనిలో తాళీసాది చూర్ణమును కలిపి పిప్పల్యాసవముతో సేవించిన శ్వాసనకజ్వరము (Pneumonia) తగ్గును. దీనిని చనుపాలతో నుపయోగించిన చంటిపిల్లలకు కలుగు దగ్గు, పడిశము, జ్వరములుతగ్గును.

## 28. పూర్ణచంద్రోదయము

బ॥ రా. (క్షయ, ప్ర.) 4 వ అధ్యాయము.

శ్లో॥ వలీపలిత నాశన స్తనుభృతాం వయ స్తంభన
స్సమ స్తగదఖండనః ప్రచురరోగ పంచాననః
గృహేపి గృహభూపతిర్భవతి యస్యచంద్రోదయ
స్సపంచ శరదర్పితోమృగ దృశాంభవేద్వల్లభః.

ద్రవ్యములు:—స్వర్ణము, రసము, గంధకము.

గుణము:—రసాయనము, వాజీకరణము, విషహరము, ప్రమేహహరము, క్షయహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) ఈ ఔషధమునకు సమముగా పచ్చకర్పూరము, జాజకాయ, చలవ మిరియములు, లవంగములు, పదహారవ భాగము కస్తూరినిచేర్చి మినపగింజలంత మాత్రలను కట్టి వాటిని తమలపాకులో జుట్టి సేవించిన తరువాత చిక్కని పాలయందు చక్కెరచేర్చి త్రాగిన వీర్యవృద్ధి కలిగి, స్త్రీలగర్వమును హరించునంతటి శక్తిని కలుగచేయును. మరియు ముదిమిని పోగొట్టి వయస్సును నిలబెట్టును క్షయరోగమును హరింపజేయును.

(అ. భూ.) దీనిలో పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, జాతీఫలాది చూర్ణములను కలిపి సేవించి పాలుత్రాగినయెడల ముసలితనమును పోగొట్టి, వయస్తంభనమును కలుగచేయును.

దీనిలో త్రికటుచూర్ణము, తిప్పసత్తును కలిపి తేనెతో సేవించిన సమస్త జ్వరములు తగ్గును.

త్రిఫలాచూర్ణమును కలిపి నేతితో సేవించిన, స్థావరజంగమ విషములు, పెట్టుమందులు, నివర్తించును.

దీనిని మేడిచెక్క కషాయముతో సేవించిన ప్రమేహవ్యాధులు తగ్గును.

దీనిలో ముత్యభస్మము, పగడభస్మము, సితోఫలాదిచూర్ణములను కలిపి వెన్నపూసతో సేవించిన క్షయవ్యాధులు నివర్తించును.

N. B ఈ యౌషధ సేవనకాలమున, నెయ్యి, పాలు, మృదుకరమాంసములు, పిూగడ. పిండివంటలు మొదలగు తనకిష్టమగు పదార్థములను సేవించవలెను.

## 29. పంచామృతపర్పటి

భై॥ ర. (గ్రహణీ, అధ్యా.)

శ్లో॥ నానావర్ణ గ్రహణ్యామరుచి, సముదయేదుష్టదుర్నామకాడా
చర్ద్యాం దీర్ఘాతిసారే జ్వరభవకలితే రక్తపిత్తేక్షయేచ.

ద్రవ్యములు:—గంధకము, రసము, అభ్రకము, తామ్రము, లోహము, వీట్ల భస్మములు.

గుణము:—గ్రాహి, దీపనము, పాచనము, గ్రహణ్యాతి సారహరము.

ప్రమాణము:— 1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(భై. ర.) దీనిని ప్రతినిత్యము తేనెతో గాని, నేతితో గాని, 1 గురిగింజఎత్తు చొప్పున వృద్ధిచేయుచూ, తగ్గించుచూ 4 గురిగింజలఎత్తుకు మించకుండా 7 దినములు సేవించవలయును. అనగా మొదటిరోజున 1 గురిగింజఎత్తు, 2 వ రోజున 2 గురిగింజలఎత్తు ఈ విధముగా 4 గురిగింజలఎత్తు మోతాదు అగువరకు సేవించి పిమ్మట ఒక గురిగింజఎత్తు చొప్పున ప్రతిరోజు తగ్గించుచూ 1 గురిగింజఎత్తు మోతాదు వచ్చువరకు సేవించవలెను.)

(గ్రంథమునందు 2 గురిగింజలఎత్తు మొదలు 8 లేక 9 గురిగింజల ఎత్తువరకు మోతాదు చెప్పబడి యున్నప్పటికి, ఈ కాలసత్వములను ఒట్టి వృద్ధి హ్రాస్వములను 1 గురిగింజ ప్రమాణమే తీసుకొనబడినది.)

ఇట్లు సేవించిన గ్రహణి, అరుచి, అతిసారము, గ్రహణ్యాతిసారములవలన కలిగిన జ్వరము, రక్తపిత్తము, క్షయ అనువానిని తగ్గించును.

(అ. భూ.) దీనిలో దాడిమాష్టక చూర్ణమును కలిపి కుటజారిష్టముతో సేవించిన, గ్రహణి, అతిసారము, రక్తగ్రహణి తగ్గును.

దీనిలో త్రికటుచూర్ణమును కలిపి తేనెతో సేవించిన జఠరాగ్నిని వృద్ధిపరచి ఆహారమును బాగుగా జీర్ణమగునట్లు చేయును.

దీనిలో సితోపలాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన ఆమ్లపిత్తము, అజీర్ణము నివర్తించును.

N. B దీనిని 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు హెచ్చుతగ్గులు లేకుండా, కాలపరిమితి లేకుండా వ్యాధినివారించువరకు సేవించు నాచారము కలదు.

## 30. బాలచంద్రోదయం

అనుభూతము

ద్రవ్యములు:—ఇంగిలీకము, ఇంద్రవారుణి (చేదుపుచ్చ)

గుణము:—దీపనము, యకృత్ప్లీహరోగహరము, క్రిమిహరము, రక్తవృద్ధికరము.

ప్రమాణము:—2 మొదలు 3 గ్రైనుల వరకు.

ప్రయోగములు:—(అ॥ భూ.) దీనిలో జసదభస్మము, వరాట భస్మము, కాసీససిందూరములను కలిపి తేనెలో సేవించిన యకృత్ప్లీహోదరము (Liver and spleen Enlargements)లను తగ్గించును. ఇది పిల్లలకుకలుగు లివర్, స్ప్లీన్ వ్యాధులయందు బాగుగా పనిచేయును.

దీనిలో వాయువిడంగములు, మోదుగమాడల చూర్ణమునుకలిపి సేవించిన మలమునందు పడుక్రిములు హరించును.

దీనిలో కాంతభస్మమునుగాని లోహభస్మమునుగానికలిపి తేనెతో సేవించిన యకృత్ప్లీహరోగములవలన కలిగిన పాండుకామిలావ్యాధులను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

ఈ ఔషధము పిల్లలకు కలుగు లివర్ స్ప్లీన్ వ్యాధులయందుగూ అందుకలుగు ఉపద్రవములయందును పైనవ్రాయబడిన అనుపానములతో వాడిన బాగుగాపనిచేయును.

## 31. భేదిజ్వరాంకుశము.

బ॥ రా. జ్వర॥ ప్ర. 1 వ అధ్యా.

శ్లో॥ .................. జ్వరే జీర్ణే ప్రయోజయేత్
సర్వజ్వరహరం శీఘ్రం నామ్నా భేదిజ్వరాంకుశమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, వెలిగారము, మిరియాలు, నేపాళములు.

గుణము:—భేదనము, రేచనము, కఫహరము, వాతహరము, జ్వరహరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిని అల్లపురసముతోగాని వేడి నీళ్లతోగాని సేవించిన శుభ్రముగా విరేచనము కలుగజేసి వాతమును, ఆమమును హరింపచేయును.

దీనినే పై అనుపానముతో జ్వరపక్వకాలమందొసగిన సర్వజ్వరములు శీఘ్రముగా హరించును.

(అ. భూ.) దీనిని అమృతారిష్టముతోగాని, కిరాతారిష్టముతోగాని సేవించిన ఆమజ్వరములు తగ్గును.

N. B ఈ ఔషధపరిమాణమునందు 3 వ వంతు శుద్ధిచేసిన నేపాళముయున్నది. అయినను, దీనిని భుజించిన ఆహారము జీర్ణమయినపిమ్మటను, లేక ఉదయముననూ, వేసుకొనవలెను. లేనియెడల వికారముకలిగించవచ్చును. ఒకవేళ వమనము అయినను కావచ్చును అదిమంచిదే అని రోగికి చెప్పవలెను దీనిని గర్భిణీస్త్రీలు పసిపిల్లలు వాడకూడదు.

## 32. మహాజ్వరాంకుశము

బ॥ రా. (జ్వ॥ ప్ర.) 1 వ అధ్యా.

(జ్వరాంకుశము అని యున్నది)

శ్లో॥ ఇదం జ్వరాంకుశం నామ్నా సర్వజ్వరవినాశనమ్
ఐకాహికం ద్వ్యాహికంచ, త్ర్యాహికంవాచతుర్థకమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, ఉమ్మెత్తవిత్తులు, త్రికటుకములు.

గుణము:—జ్వరహరము, వాతహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిని అల్లపురసముతో సేవించిన వాతజ్వరము హరించును. దీనిని పై అనుపానముతో నలుబది దినములు సేవించిన ఐకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక జ్వరములు (ఇవి యున్నియు విషమ (Malaria) జ్వరములయొక్క భేదములు) త్రిదోషజ్వరము మొదలగు సర్వజ్వరములు హరించును.

(అ. భూ.) దీనిని పంచతిక్తపానకముతో సేవించిన త్రిదోష, ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహాతుర్థిక (చలిజ్వరములు) వాతజ్వరములు హరించును.

దశమూలారిష్టములో కస్తూరిని కలిపి దానితో ఈ ఔషధము నుపయోగించిన సన్నిపాత జ్వరములయందు కలుగు పిచ్చిమాటలు, లేచిపోవుట (Delirium) తగ్గును.

## 33. మహాతరుణార్కము

బ॥ రా. (సన్ని॥ ప్ర.) 2 వ అధ్యా.

శ్లో॥ సర్వరోగవినశ్యంతిహ్యనుపానవిశేషతః
మహాతరుణార్కనామాయం, బాలదోషప్రశాంతికృత్.

ద్రవ్యములు:—అభ్రకము, తామ్రము, ముత్యము, లోహము, స్వర్ణము వీట్ల భస్మములు, గరళము, ఉమ్మెత్తువిత్తులు, కస్తూరి, మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—హృదయోత్తేజకము, కఫవాతహరము, సన్నిపాత జ్వరహరము, శీతహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని తమలపాకు రసముతో నుపయోగించిన కఫమెదుర్కొనుట, గురక, కాళ్ళుచేతులు చల్లబడుట, చెమటలు తగ్గి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును.

చనుపాలతో సేవించిన సన్నిపాత జ్వరములయందు కలుగు మగత, నాడి నీరసించుట తగ్గి హృదయమునకు బలము కలుగచేయును.

మిరియాలు, సదాపాకు, మంచిజీలకఱ్ఱ, జిట్టవరగోగు వీని కల్కముతో గాని దశమూలారిష్టముతో గాని నుపయోగించిన సన్నిపాత జ్వరములయందు కలుగు పిచ్చిమాటలు, మత్తు, లేచిపోవుట తగ్గును.

## 34. మహామేహాంతకరసము

(మహా మేహాంతకరసము)

ఆ॥ కౌ॥ ర.

శ్లో॥ సేవితో మధుమేహంచ, నానామేహం నివారయేత్

... ... ... ... ... ... ... ... ...

— — — — — — — — —

మేహాంతకరసోనామ, సర్వమేహకులాన్తకః.

ద్రవ్యములు:—స్వర్ణము, తామ్రము, లోహము, ఇనుము, సీసము, పగడము, ముత్యము, రజతము, కాంతము, అభ్రకము, వంగము, వీట్లభస్మములు, గోమూత్రశిలాజిత్తు, కస్తూరి, రసము, గంధకము, శంఖ భస్మము, రససిందూరం.

గుణము:—ప్రమేహహరము, అశ్మరీఘ్నము, నిద్రాప్రదము, బృహణము.

ప్రమాణము:—2 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో రెట్టింపు నేరేడు విత్తులు చూర్ణమునుకలిపి మ్రానిపసుపుకషాయముతో సేవించిన మధుమేహము వసామేహము, ఇక్షుమేహము, మొదలగు సర్వమేహములు హరించును.

దీనిలో గోక్షురాదిచూర్ణమునుకలిపి కొండపిండివేళ్ల రసముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరులు తగ్గును.

దీనికి సమము తిప్పసత్తు, మహాద్రాక్షాదిచూర్ణములను కలిపి సేవించిన కాళ్లుచేతులు మంటలు, ఇంద్రియనష్టము, స్త్రీలకు కలుగు ప్రదరవ్యాధులు తగ్గును.

దీనిలో పచ్చకర్పూరము, కుంకుమపువ్వులనుచేర్చి మాత్రలుగా కట్టి సేవించిన శరీరమునకు బాగుగా బలముకలుగచేయును.

దీనిని వసంతకుసుమాకరమునకు ప్రతినిధిగా వాడవచ్చును.

## 35. మహావాత విధ్వంసి రసము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ హన్తి వాతాన్సూతికాదీన్సన్నిపాతాం స్త్రయోదశ
కణ్ఠరోగాన్నాశయేచ్చ సర్వరోగ వినాశకః
భాషితశ్చాశ్వినేయాభ్యాం వాతవిధ్వంసినామకః.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, రజతము, అభ్రకము తామ్రము, ముత్యము, వరాటము, శంఖము, వీట్లయొక్క భస్మములు, తాళకము, మణిశిల మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వాతహరము, సన్నిపాత జ్వరహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) ఈ ఔషధమునకు సమముగా చిత్రమూలము, మిరియాల చూర్ణములను కలిపి దశమూలారిష్టముతో సేవించిన గృధ్రసీవాతము, అపబాహుకవాతము, శుష్కవాతము మొదలగు వాతరోగములు హరించును.

దీనిని చిత్రమూల కషాయముతో సేవించిన సన్నిపాతజ్వరములు వానిలో కలుగు ఉపద్రవములు హరించును.

దీనిని అశోకారిష్టముతోగాని, జీరకాద్యరిష్టముతోగాని సేవించిన బాలింతలకు ఋతువు సరిగా కానందున వచ్చు కడుపునొప్పిని తగ్గించి ఋతువును జారీచేయును.

N B ఈ ఔషధముయొక్క మోతాదులో సగభాగము నాభి కలిసియున్నది.

## 36. మహాసన్నిపాతభైరవి

వై॥ చిం. (సన్ని॥ ప్ర)

శ్లో॥ తత్క్షణేన నిహన్త్యాద్యైః రక్తోత్థంహ్యాతిభీషణం
ప్రసిద్ధస్సన్నిపాతాద్య భైరవోరస ఉత్తమః.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, అభ్రకము, సీసము వీట్లభస్మములు, వెలిగారము, నెమలిపిత్తము, చేపపిత్తము, దున్నపోతు పిత్తము.

గుణము:—సన్నిపాత జ్వరహరము, వాతహరము, కఫహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిని పిప్పళ్ళ కషాయముతో సేవించిన వెంటనే మిక్కిలి భయంకరమగు రక్తోష్ఠ సన్నిపాతమును హరింపచేయును.

(అ. భూ.) దీనిని దశమూలారిష్టముతో సేవించిన సూతికా వాతములు, వాతజ్వరములు తగ్గును.

తిప్పతీగె కషాయముతో గాని పంచతిక్త కషాయముతో గాని సేవించిన సన్నిపాతజ్వరము, విషమజ్వరములు హరించును.

## 37. మేహవంగరాజీయము

(వంగేశ్వరః అనియున్నది)

యో॥ ర. (ప్రమే॥ ప్ర.)

శ్లో॥ క్షీరాన్నంయోజయే త్పథ్య మమ్లలవణ వర్జితం
రసో వంగేశ్వరో నామ, సర్వమేహానివృత్తయే॥

ద్రవ్యములు:—రసము, గంధకము, వంగము.

గుణము:—శీతము, శోణితస్థాపనము, బల్యము, ప్రమేహహరము

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(యో॥ ర.) దీనిలో పిప్పలిచూర్ణమునుకలిపి తేనెతో సేవించిన సమస్త ప్రమేహములు తగ్గును.

(అ. భూ.) దీనిలో కర్పూరశిలాజితు గైరికభస్మములనుకలిపి పంచదార వెన్న పూసతో సేవించిన ఇంద్రియనష్టము, అతిశీఘ్రస్ఖలనము, కాళ్లుచేతులు మంటలు, నిస్సత్తువ, సవామేహరోగము (మూత్రమునందు మంట, గనేరియా మొదలగునవి) తగ్గి శరీరమునకు బలముకలుగచేయును.

దీనిలో శాల్మలీచూర్ణమునుగాని, లాక్షాచూర్ణమునుగానికలిపి నెయ్యి, పంచదారతో సేవించి బబ్బులారిష్టమును త్రాగినయెడల స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములు తగ్గును.

ఈ ఔషధమును సేవించునపుడు ఉప్పు, పులుసు, వీనిని వర్జించి పాలతో అన్నము భుజించుచుండవలయును.

## 38. మృత్యుంజయ రసము

బృ॥ రా. (జ్వర॥ ప్ర.) 1 వ అధ్యా.

శ్లో॥ అయం మృత్యుంజయో నామ రసస్సర్వజ్వరాపహః
అనుపానప్రభేదేన నిహంతి సకలాన్గదాన్.

ద్రవ్యములు:—నాభి, మిరియాలు, పిప్పళ్ళు మోడి, వెలిగారము, గంధకము, ఇంగిలీకము.

గుణము:—జ్వరఘ్నము, దీపనము, స్వేదలము, శావకము.

ప్రమాణము:—½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు. (పెసరగింజ లంతమాత్రలు)

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిని తేనెతో సేవించిన సమస్త జ్వరములు హరించును.

పెరుగుమీది తేటతో సేవించిన వాతజ్వరము తగ్గును. అల్లపు రసముతో సేవించిన దారుణమైన సన్నిపాతజ్వరములు హరించును.

నిమ్మపండ్ల రసముతో సేవించిన అజీర్ణజ్వరముతగ్గును. జీలకఱ్ఱరసము నందు బెల్లమును చేర్చి దీనితో సేవించిన విషమజ్వరములు హరించును.

పంచదారకలిపిన కొబ్బరినీళ్ళతో నుపయోగించిన తాపజ్వరములు, జ్వరమునందుకలుగు తాపము తగ్గును.

(అ. భూ.) దీనిని అమృతారిష్టముతో సేవించిన వాతజ్వరము తగ్గును, దశమూలారిష్టముతో సేవించిన దారుణ సన్నిపాతజ్వరములు తగ్గును. పంచతిక్తపానకముతో సేవించిన విషమజ్వరములను తగ్గించి చెమటను పట్టించును.

N B యౌవనమునకుకలిగిన జీర్ణజ్వరమునందును, ప్రబలమైన జ్వరమునందును 4 మాత్రలు సేవించవలెను. అతిక్షీణులు, వృద్ధులు, బాలురు మిక్కిలి తక్కువ మాత్రను వారి వారి బలానుసారముగా నుపయోగింపవలెను.

## 39. మహాకనక సుందర రసము

వై॥ చిం॥ (క్షయ॥ ప్ర.)

శ్లో॥ మహాకనక సిందూరః రాజయక్ష్మహరః పరః
పాండురోగం శ్వాసకాసం కామిలాగ్రహణీ గదాన్.

ద్రవ్యములు:—రసము, గంధకము, కర్పూరి, స్వర్ణము, సీసము స్వర్ణమాక్షికము, అభ్రకము, కాంతము, ప్రవాళము, ముత్యము వంగము, తాళకము వీట్ల భస్మములు కలవు.

గుణము:—రసాయనము, దీపనము, బల్యము, క్షయహరము, కాసశ్వాసలు, పాండుశోఫలు, గ్రహణి, కామిలా, గుల్మము, మేహము, వీనిని హరించును.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో సితోపలాది చూర్ణమును కలిపి చ్యవనప్రాశతో సేవించిన క్షయవ్యాధులు తగ్గును.

దీనిలో గోక్షురాదిచూర్ణమును కలిపి తేనెతో సేవించి పునర్న వారిష్టమును త్రాగిన క్షయలయందు కలుగు పాండు, శోఫ, కామిలా వ్యాధులు తగ్గును.

తిప్పసత్తు, శృంగభస్మములను చేర్చి వెన్నపూసతో సేవించి వాసారిష్ట మును త్రాగిన క్షయవ్యాధులయందు కలుగు రక్తపిత్తములు తగ్గును.

యష్టిమధుక కషాయముతో సేవించిన క్షయలయందు కలుగు స్వరభంగము ఎక్కిళ్ళు తగ్గును.

దీనిలో అశ్వగంధాది చూర్ణమును చేర్చి మేకపాలు, మేకవెన్నతో గాని, ఆవుపాలు ఆవువెన్నతోగాని సేవించిన క్షయలయందు కలుగు ఓజోక్షయమును పోగొట్టి ధాతువులకు తగిన బలమును కలిగించును.

ద్రాక్షారిష్టముతో సేవించిన ఉరఃక్షతము, క్షయలు, క్షయల యందు కలుగు అగ్నిమాంద్యమును పోగొట్టి ఆకలిని కలుగచేయును.

N B ఈ ఔషధములో తులము నకు అరతులము స్వర్ణభస్మము కలదు. ఈ ఔషధము క్షయవ్యాధులయందు అమృతము వంటిది.

## 40. మహాగంధకపర్పటి

(మహాగంధకము)

భై॥ ర. (గ్రహణి అధ్యా)

శ్లో॥ దుర్వారం గ్రహణీరోగం జయత్యేవ ప్రవాహికాం
సూతికాంచ జయేదేత దపి వైద్యవివర్జితాం॥
... ... ... ... ...
బాలానాంగదయుక్తానాం, స్త్రీణాంచాపి విశేషతః
మహాగంధక మేతద్ధి సర్వవ్యాధి నిషూదనం॥

ద్రవ్యములు:—రసము, గంధకము, జాజికాయ, జాపత్రి లవంగములు, వేపయిగుళ్లు.

గుణము:—గ్రాహి, దీపనము, పాచనము, సూతికారోగహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గురిగింజలఎత్తువరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని తేనెతో సేవించిన గ్రహణి, ప్రవాహిక, సూతికారోగములు, అతిసారము, సర్వోపద్రవములతో కూడిన బాలరోగములు, స్త్రీల సమస్త రోగములు హరించును.

ఇది వ్యాధిపీడితులగు బాలురకును, స్త్రీలకును శ్రేష్ఠమైన ఔషధము

(అ. భూ.) దీనిలో దాడిమాష్టకచూర్ణమునుగాని, కర్పూరాది చూర్ణమునుగాని కలిపి తేనెతో నుపయోగించిన, గ్రహణి, ప్రవాహిక, అతిసారములు నివర్తించును.

దీనిలో శంఖభస్మము లేక వరాటభస్మమునుకలిపి తేనెతో సేవించిన ప్రేగులయందుండు పుండును (Sprew) మాన్పి, జిగటవిరేచనములను, నీళ్లవిరేచనములను తగ్గించి ఆకలికలుగచేయును.

ఈ ఔషధమునకు, కుటజారిష్టము అనుపానముగా యివ్వవచ్చును

## 41. మహావంగేశ్వర రసము

(మహావంగేశ్వరః)

యో॥ ర. (ప్రమేహ ప్ర.)

శ్లో॥ ఏషవంగేశ్వరోనామ ప్రమేహాన్వింశతిం జయేత్
మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాణ్డు రోగంమహాశ్మరీమ్
రసాయనమిదంశ్రేష్టం నాగార్జునవినిర్మితమ్.

ద్రవ్యములు:—వంగము, కాంతము, అభ్రకము వీట్ల భస్మములు తంగేడుపువ్వు.

గుణము:—ప్రమేహరోగహరము, సోమరోగహరము, అశ్మరీ ప్రదరరోగహరము, మూత్రకృచ్ఛ్ర, పాండురోగహరము.

ప్రమాణము:—2 మొదలు 6 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(యో॥ ర.) దీనిని తేనెతో సేవించిన ఇరువది మేహములు, మూత్రకృచ్ఛ్రము, సోమరోగము, పాండురోగము, అశ్మరీరోగములు హరించును.

(అ. భూ.) దీనిని మేడిచెక్కస్వరసముతో సేవించిన ప్రమేహ వ్యాధులను, అందుకలుగుదప్పిక (తృష్ణా) అరికాళ్ళు, అరిచేతుల మంటలు సోమరోగము హరించును.

దీనిలో గోక్షురాదిచూర్ణము, కర్పూర శిలాజితుభస్మము లను కలిపి చందనాసవముతోగాని, ఉసీరాసవముతోగాని సేవించిన మూత్ర కృచ్ఛ్రము, అశ్మరీరోగములు తగ్గును.

దీనిని పల్లెతేగలస్వరసముతో సేవించిన స్త్రీలకు కలుగు శ్వేతరక్త ప్రదరములు, శరీరతాపము తగ్గును.

## 42, మహారాజమృగాంక రసము

వై॥ చి॥ (క్షయ॥ ప్ర.)

శ్లో॥ ... ... ... క్షయాగ్ని మాంద్య గ్రహణీకదేషు
సాజ్యోమణాభిః మధుపిప్పలీభిః వల్లస్యదేయోవతితోధికస్తు
పథ్యం హితం శీతలమే వయోజ్యం త్యాజ్యం సదాపిత్తకరం విదాహి.

ద్రవ్యములు:—రసము, గంధకము, స్వర్ణభస్మము, ముత్యభస్మము, వెలిగారము.

గుణము:—రసాయనము, దీపనము, క్షయరోగహరము, కఫహరము, గ్రాహి.

ప్రమాణము:— 2 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిలో మిరియాల చూర్ణముగాని పిప్పళ్ళచూర్ణముగాని కలిపి తేనె, నెయ్యి వీట్లలో దేనితోనైన సేవించిన క్షయరోగములు, అగ్నిమాంద్యము, గ్రహణీ అతిసారములు తగ్గును.

(అ. భూ.) దీనిలో సితోపలాది చూర్ణము, తిప్పసత్తును కలిపి వెన్నపూసతో సేవించి వాసారిష్టమును త్రాగిన రక్తపిత్తము, క్షయల యందు కలుగు రక్తపిత్తము తగ్గి ధాతువులకు బలమును కలుగచేయును.

దీనిని చ్యవనప్రాశ లేహ్యమునందు కలిపి సేవించిన ఊపిరితిత్తులకు గుండెకు చక్కని బలమును కలుగచేయును.

N B ఈ యౌషధమును సేవించునప్పుడు శీతలోపచారము లు చేయవలెను. మరియు పిత్తమును వృద్ధిచేయు ద్రవ్యములను విదాహికర ద్రవ్యములను సేవించకూడదు.

## 43. రక్తమాహేశ్వర రసము

బ॥ రా. [రక్తపిత్త॥ ప్ర.] 7 వ అధ్యా.

శ్లో॥ వల్లప్రమాణః ంచై వశర్కరామృత శర్కరైః
భక్షయేత్ప్రాతమిశ్రంతు రక్తపిత్తహరంపరమ్
సర్వపిత్తహరోన్నృణాం రక్తమాహేశ్వరోరసః.

ద్రవ్యములు:—రసము, గంధకము, రససిందూరము, స్వర్ణము, కాంతము, అభ్రకము, తామ్రము, వంగము, నాగము, రజతము, లోహము వీట్ల భస్మములు కలిసియున్నవి.

ఈ ఔషధముయొక్క మోతాదులో సుమారు అర్ధభాగము అభ్రక భస్మముకలదు.

గుణము:—పిత్తహరము, రక్తపిత్తహరము, శోణితస్థాపనము, బల్యము, శీతము.

ప్రమాణము:—1 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిలో పంచదార, తిప్పసత్తులను కలిపి ఆవునెయ్యితో సేవించిన రక్తపిత్తము, సమస్తపైత్యరోగములు, రక్తప్రదరములు తగ్గును.

(అ. భూ.) దీనిలో లాక్షాచూర్ణము శృంగభస్మములను కలిపి వెన్నపూస పంచదారతో సేవించి వాసారిష్టమును త్రాగిన క్షయ వ్యాధులయందు కలుగు రక్తష్ఠీవనము, ఊర్ధ్వగత రక్తపిత్తములు, అధోగత రక్తపిత్తములు, రక్తప్రదరములు నివర్తించును.

దీనిలో మహాద్రాక్షాదిచూర్ణమును కలిపి ఆవు నేతితోగాని, ద్రాక్షారిష్టముతోగాని సేవించిన పిత్తప్రధానమైన వ్యాధులనన్నిటిని తగ్గించి బలమును కలుగచేయును.

## 44. రజితచంద్రోదయము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ శుక్లస్రావం తథాకాసం దౌర్బల్యం శ్వాసమేవచ
పాండుం జీర్ణజ్వరం హన్తి మన్దాగ్నిం క్షయనాశకః

ద్రవ్యములు:—రజితము, రసము, గంధకము.

గుణము:—రసాయనము, వాజీకరణము, దీపనము, ప్రమేహహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు,

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, జాజికాయలు, జాపత్రి, దురదగొండివిత్తులు వీట్లచూర్ణములను ఔషధమునకు సమముగాకలిపి అశ్వగంధారిష్టముతో సేవించిన శుక్రనష్టమును హరింపచేసి వీర్యవృద్ధిని కలుగచేయును.

దీనిని పెన్నేరుచూర్ణమునందుగాని, అశ్వగంధాదిచూర్ణమునందుగాని కలిపి పాలతోసేవించిననూ లేక అశ్వగంధాది లేహ్యమునందుకలిపి సేవించిననూ శుక్రనష్టమువలనకలిగిన క్షయ, బలహీనత, నపుంసకత్వములను పోగొట్టి బలమును కలుగచేయును.

దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి మేకచెక్క కషాయముతో సేవించిన ప్రమేహవ్యాధులు తగ్గును.

దీనిలో కర్పూరశిలాజితుభస్మము, మహాద్రాక్షాదిచూర్ణములను కలిపి వెన్నపూసతో సేవించుచూ ద్రాక్షారిష్టమునుత్రాగిన పిత్తప్రకోప

ములను, నోటిపూతను, నిశ్శక్తినితగ్గించి కృశించినవారలకుపుష్టినికలుగ చేయును.

## 45. రజతలోహ రసాయనము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ పాణ్డుం శోఫంచహృద్రోగం కామలాం కుమ్భకామలాం
పక్షాఘాతార్ధితౌహన్తి వాతవ్యాధివినాశకమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, రజితము, లోహము.

గుణము:—దీపనము, శోణితవర్ధనము, వాతహరము, పాండు శోఫ, హృద్రోగములను హరింపచేయును.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భా.) దీనిలో గోక్షురాది చూర్ణము సురాష్ట్రార కాసీసములను కలిపి తేనెతో సేవించి పునర్నవారిష్టముకు త్రాగిన నంజువ్యాధులయందు, ఉదర వ్యాధులయందు కలుగు వాపులను, ఆయాసమును వెంటనే తగ్గించును. (గోమూత్రముతో నైననూ వాడవచ్చును.)

దీనిలో తిప్పసత్తు, కాసీసము, వరాటభస్మములను కలిపి లోహాసవముతో సేవించిన కామిలా, పాండు, శోఫలను మరియు క్రిమిజ పాండువులను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

తాళిసాదిచూర్ణము, ప్రవాళభస్మములను కలిపి కనకాసవముతో సేవించిన నంజువ్యాధులయందు కలుగు శ్వాసకాసలు తగ్గును.

దీనికి సమము షడ్గుణము చేర్చి తేనెతో సేవించిన తిమ్మెరలు (మేహానంజు) కీళ్ళయందు నొప్పులు, పక్షవాతము తగ్గును.

## 46. రసభూపతి

బ॥ భా. (శోఫ. ప్ర.) 5 వ అధ్యా.

శ్లో॥ ఆర్ద్రికస్యానుపానేన సర్వశోఫం నిహంతిచ
రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోయంరసభూపతిః.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, లోహభస్మము, తామ్ర భస్మము.

గుణము:—దీపనము, శోణితవర్ధనము, శోఫహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిని అల్లపురసముతో సేవించిన సర్వశోఫ (నంజు)లను తగ్గించును.

(అ. భూ.) దీనిలో తాళీసాదిచూర్ణమును కలిపి లోహాసవముతో సేవించిన క్రిమిజపాండుశోఫలను, శ్వాసకాసలను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

తులసిఆకు రసము, తమలపాకు రసము, ఆకుజెముడాకు రసములలో దేనిలోనైననూ తేనెనుచేర్చి దానితో సేవించిన ఉబ్బసము, ఆయాసము, దగ్గు, తగ్గును.

మరియు చిన్నపిల్లలకు పై అనుపానములతోగాని, చనుపాలతోగాని ఉపయోగించిన దగ్గు, పడిశము, ఆయాసము, డొక్కలెగరవేయుట, జ్వరములను హరింపచేయును.

## 47. రసరాజరసము

భై॥ ర. (వాత ప్ర)

శ్లో॥ పక్షాఘాతార్దితే వాతేసోర్ధ్వాకే పాపహానకే
అంగభంగే, తథాకుబ్జే ధనుస్తంభే తదైవచ
... ... ... ... ...
... ... ... ... ... ...
మనోవిభ్రమకంపేచ ఆధ్మానేనేత్ర వైకృతే.

ద్రవ్యములు:—ఇంగిలీకము, అభ్రకము, స్వర్ణము, రజితము, లోహము, వంగము వీట్లభస్మములు, లవంగ, పెన్నేరు, జాపత్రి, శతావరి వీట్లచూర్ణములు.

గుణము:—వాతహరము, బల్యము, మేధ్యము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజలఎత్తు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని పాలతోగాని పంచదార నీళ్లతోగాని సేవించిన పక్షవాతము, ఆర్దితవాతము, ఉద్గారము, అపతానకవాతము, కుబ్జవాతము, ధనుర్వాతము, మనోవిభ్రమము, కంపము, కడుపుబ్బరము మొదలగు వ్యాధులను హరింపచేసి బలముకలుగజేయును.

(అ. భూ.) దీనిలో అశ్వగంధాదిచూర్ణము, శృంగభస్మములను కలిపి తేనెతో సేవించి అశ్వగంధారిష్టమును త్రాగినయెడల రూక్ష, త్వముల వలన కలుగు సమస్త వాతవ్యాధులను హరింపచేసి బలమును కలుగచేయును.

దీనిలో సర్పగంధచూర్ణమును కలిపి వెన్నపూస పంచదారతో సేవించి సారస్వతఘృతమునుగాని, సారస్వతారిష్టమునుగాని త్రాగిన హృదయమునకు బలముకలుగచేసి గుండెదడ, భయము, మనోవిభ్రమము (హిస్టీరియా) మూర్ఛ, అపస్మారములను తగ్గించును.

దీనిని పైఅనుపానములతో సేవించి కల్యాణఘృతమును సేవించిన స్త్రీలకు రజోదోషమువలనవచ్చు హిస్టీరియా, మూర్ఛ, అపస్మారములు తగ్గును.

## 48. రసరాట్

అ॥ ఔ॥ ర.

చ॥ ... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...
వరకఫజాతుఁడన్ ప్రబలవాయువులన్ దెగటార్చు వేగమే.

ద్రవ్యములు:—ఇంగిలీకము, రసము, రసకర్పూరము, రససిందూరము, గంధకము, లోహము.

గుణము:—వాతహరము, కఫహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:— (అ. భూ.) దీనిని తమలపాకు రసముతోగాని చనుపాలతోగాని, చిన్నపిల్లలకుపయోగించిన, పడిశము, జ్వరము, దగ్గు, ఒగర్పు తగ్గించి విరేచనమును కలుగచేయును.

తేనెతో సేవించిన అజీర్ణ వాతములు, కడుపుబ్బరము తగ్గును.

దీనిలో తాళీసాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన జలుబు దగ్గు, ఆయాసము, జ్వరము తగ్గును.

## 49. రసపర్పటి

భై॥ ర. (గ్రహణీ॥ అధ్యా.)

శ్లో॥ ఏవమియంక్రియమాణాభవతి శ్రేయస్కరీనియతమ్
అర్శోరోగంగ్రహణీం సామాం శూలాతిసారౌచ
కామలపాండువ్యాధిం ప్లీహానంచాతిదారుణంహంతి.

ద్రవ్యములు:— రసము, గంధకము.

గుణము:— గ్రాహి, దీపనము, పాచనము.

ప్రమాణము:— 2 మొదలు 10 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:— (భై॥ ర.) ఈ ఔషధమునకు సమము జీలకఱ్ఱచూర్ణము, 4 వ వంతు వేంగించిన ఇంగువచూర్ణములను కలిపి మంచినీరు అనుపానముతో సేవించిన, అర్శోరోగము, గ్రహణి, ఆమశూల అతిసారము, కామిల, పాండు, ప్లీహవ్యాధులు హరించును.

(ఈ పర్పటిని మొదటిదినము రెండుగురిగింజల పరిమితిని ప్రారంభించి దినమునకొక గురిగింజ పరిమాణముచొప్పున హెచ్చించుచూ పదిగింజలవరకు సేవింపవలయును. పదిగింజల పరిమితియైనపిమ్మట దినమునకొక గింజ పరిమితిచొప్పున తగ్గించుచు రెండుగింజల పరిమితివరకు సేవింపవలయును. మిగతాదినములయందు 2 గురిగింజల పరిమితినే సేవింపవలయును. (ఇట్లే ఔషధమును 21 దినములే సేవించవలయును. ఆపైన పనికిరాదు.)

(అ. భూ.) ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజలఎత్తు వరకు.

ప్రయోగములు:— దీనిలో జాతీఫలాదిచూర్ణమునుగాని, దాడిమాష్టకచూర్ణమునుగాని కలిపి కుటజారిష్టముతో సేవించిన గ్రహణ్యాతి

సారములు, వీటివల్ల కలుగు కామల, పాండు, ప్లీహవ్యాధులు తగ్గును మరియు ఆకలిని వృద్ధిచేయును.

N B దీనిని 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు హెచ్చు తగ్గులు లేకుండా, కాలపరిమితిలేకుండా వ్యాధి నివారించువరకు సేవించు నాచారము కలదు.

## 50. రజత నవనీతవటి

భస్మప్రకాశిక (కృష్ణపండితీయం)

ద్రవ్యములు:— రసము, వెండి, జాజికాయలు, జాపత్రి, లవంగములు, నల్లమందు, అక్కలకఱ్ఱ, దాల్చినచెక్క.

గుణము:— రసాయనము, ఉపసర్గఘ్నము, బల్యము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు (మాత్ర బఠానీ గింజంత యుండును.)

ప్రయోగములు:— (భ॥ ప్ర.) దీనిని నేతిలోముంచి సేవించిన, శుక్రనష్టము, శ్వేతరక్తప్రదరములు, సెగవ్యాధులు, మేహసంబంధమైన కీళ్ళనొప్పులు, బలహీనత, అతిమూత్రము, గ్రహణి వ్యాధులు తగ్గును.

(అ. భూ.) దీనిని పంచదార చేర్చిన ఆవుపాలతో సేవించిన శుక్రనష్టము, కీళ్ళనొప్పులు, కాళ్ళులాగుట, బలహీనత తగ్గును.

శారిబాద్యారిష్టముతో నుపయోగించిన ఔపసర్గిక (అనగా గనేరియా, కొరుకుడు, మొదలగునవి) రోగములు హరించును.

అశ్వగంధారిష్టముతో సేవించిన సుఖవ్యాధులవలన కలిగిన చచ్చువాతములు యితర వాతవ్యాధులు తగ్గును.

N B ఈ ఔషధము యొక్క తులము పరిమాణమునందు 1/32 వ. భాగము నల్లమందు కలిసియున్నది.

## 51. లఘుక్రవ్యాద రసము

(క్రవ్యాద రసము)

బ॥ రా॥ (అజీర్ణ॥ ప్ర.) 12 వ అధ్యా.

శ్లో॥ గుల్మప్లీహ వినాశనం గ్రహణికావిధ్వంసనం స్రంసనమ్
వాతిగ్రంధి మహోదరాపహరణం క్రవ్యాదనామారసః.

ద్రవ్యములు:—రసము, గంధకము, తామ్రభస్మము, లోహభస్మము, వెలిగారము, బిడాలవణము, మిరియాలు.

గుణము:—దీపనము, పాచనము, పిత్తహరము, గ్రాహి.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిని భోజనానంతరము గాని, ఉదయ సాయంకాలములయందు గాని, సైంధవలవణము కలిపిన పుల్లని మజ్జిగతో సేవించిన మిక్కుటముగా భుజంచినందున కలుగు ఆయాసమును తగ్గించును (అనగా ఆహారమును తొందరగా జీర్ణింపచేయును.) మరియు అగ్నిమాంద్యము, గ్రహణీ అతిసారములు, శూల, గుల్మము, ప్లీహము, ఉదరవ్యాధులు తగ్గును.

(అ. భూ.) దీనిని వాముసరసముతో గాని, అజమోదార్కముతో గాని సేవించిన కడుపుబ్బరము, శూల, అరుచి, మొదలగు అజీర్ణదోషములు తగ్గును.

ద్రాక్షారిష్టముతో నుపయోగించిన పుల్లని త్రేనుపులు, గుండెలలో మంటను తగ్గించి జీర్ణశక్తిని, బలమును కలుగచేయును.

## 52. లఘుబాల సూర్యోదయము

(బాలసూర్యోదయము)

బృ॥ రా. (అసృగ్॥ ప్ర.) 16 వ అధ్యా.

శ్లో॥ నారీణాం యోనిదోషం బహువిధప్రదరాం మూత్రకృచ్ఛ్రంచసర్వమ్
నామ్నాయం బాలసూర్యోదయ మఖిలగదహారోఖ్యాపితోయం మునీంద్రైః॥

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, తామ్రభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, ఇంగువ, మిరియాలు.

గుణము:—గ్రాహి, దీపనము, ప్రదరరోగహరము, శోణితవర్ధనము.

ప్రమాణము:—2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనితో జాజికాయచూర్ణమును చేర్చి ఆవునేతితో గాని, మేడికాయల రసముతో గాని, లవంగములు, జీల

కజ్జీరసముతోగాని సేవించిన జ్వరము, ప్రమేహము, ఉపదంశాదిలింగ రోగములు, యోనిదోషము, ప్రదరము మొదలగు కుసుమరోగములు, సర్వమూత్రకృచ్ఛ్రములు హరించును. దీనిలో తామర యగరుల (కేసరములు) చూర్ణమును కలిపి ఆవువెన్న పంచదారతో సేవించిన కుసుమ రోగములు హరించును.

(అ. భూ.) దీనిలో యష్టిచూర్ణమును కలిపి నెయ్యి పంచదారతో సేవించి బబ్బులారిష్టమును త్రాగినయెడల, శ్వేతరక్తప్రదరములను రక్తపిత్తమును హరింపచేసి బలమును కలుగజేయును.

దీనిలో శాల్మలీచూర్ణము, గైరికభస్మము, గుగ్గులుచూర్ణములను కలిపి ఆవువెన్న, పంచదారతో సేవించిన స్త్రీలకు కలుగు కుసుమ వ్యాధులను హరింపచేసి ఋతువును సక్రమముగా వెడలునట్లు చేయును॥

దీనిలో కాసీససిందూరము, త్రికటుచూర్ణములను కలిపి రోహతకారిష్టముతో సేవించిన కామిలా, పాండు, యకృత్ప్లీహరోగములు హరించును.

## 53. లఘుమాలినీ వసంతరసము

(మాలినీ వసంతరసము)

బ॥ రా. (జ్వర॥ ప్ర.) 1వ అధ్యా.

శ్లో॥ ... ... ... మాలినీ ప్రాగ్వసంతమ్
జీర్ణజ్వరేధాతుగతే తిసారే రక్తాన్వితే రక్తగవిట్స్వరూపే.

ద్రవ్యములు:—కఫరి, మిరియాలు.

గుణము:—జ్వరహరము, పురాణ జ్వరహరము.

ప్రమాణము:— 2 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిని జీలకఱ్ఱ, పిప్పళ్ళు వీట్ల ఉపరసములతో సేవించిన జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము జ్వరాతిసారము, అస్థిగత, మాంసగతజ్వరములు హరించును.

(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి అమృతారిష్టముతో సేవించిన పురాణజ్వరములు, అస్థిగత జ్వరములు తగ్గును.

దీనిని పంచతిక్త రసాయనముతో గాని, కిరాతారిష్టముతో గాని నుపయోగించిన విషమ జ్వరములు, పిత్తజ్వరములు హరించును.

## 54. లక్ష్మీవిలాస రసము

ర॥ యో॥ ర. ౩ వ అధ్యా.

తే॥ గీ॥ సేవజేయగఁ గలయు లక్ష్మీవిలాస । మనిల కఫపిత్తరాజ యక్ష్మాదిశోఫ
పాండుకామిల గుల్మార్శపవన సతత । సంతతాదిజ్వరంబుల శాంతిబరచు.

ద్రవ్యములు:—రజతభస్మము, కాంతభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, హేమమాక్షికభస్మము, ఇంగిలీకము, రసము, గంధకము

గుణము:—హృద్యము, బల్యము, క్షయహరము, శోణితవర్ధకము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో మహాద్రాక్షాదిచూర్ణ మును కలిపి తేనెతో సేవించిన రక్తమును వృద్ధిచేసి గుండెదడ, నీరస మును తగ్గించును.

దీనిలో సితోపలాదిచూర్ణము, ప్రవాళభస్మములను కలిపి వెన్న పూసతో సేవించి ద్రాక్షారిష్టమును త్రాగుచుండిన, క్షయలు, ఉరః క్షతములు, జ్వరములు తగ్గును.

దీనిని లోహాసవముతో సేవించిన పాండు, కామిలావ్యాధులను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

## 55. లఘుమేహాంతక రసము

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ ప్రమేహాన్వింశతిం హన్త్యాత్కామలాపిత్తనాశకమ్.

ద్రవ్యములు:—అభ్రకభస్మము, వంగభస్మము, రసము, గంధ కము, ఏలకులు, శిలాజితు.

గుణము:—శీతము, ప్రమేహహరము, పిత్తహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో చందనాది చూర్ణమును

కలిపి చందనాసవముతో సేవించిన అత్యధికోష్ణమునుతగ్గించి, మూత్రము నందు కలుగు మంట, మూత్రాఘాతములను తగ్గించును.

దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి నేరేడుగింజల కషాయముతో సేవించిన సమస్త ప్రమేహవ్యాధులు హరించును.

దీనిలో శాల్మలీచూర్ణమును కలిపి బబ్బులారిష్టముతో నుపయోగించిన పిత్తోద్రేకమువలన కలుగు శ్వేత, రక్తప్రదరములు తగ్గును.

## 56. లఘులక్ష్మీవిలాస రసము

(లక్ష్మీవిలాసము)

ఆ॥ ఔ॥ ర.

ద్రవ్యములు:—ఇంగిలీకము.

గుణము:—జ్వరహరము, శ్లేష్మహరము, వాతహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ. ఔ. ర.) దీనిని తమలపాకు రసముతో సేవించిన సూతికావాతములు, సమస్త వాతవ్యాధులు, జ్వరములు, చంటిపిల్లలకు కలుగు శ్లేష్మవ్యాధులు హరింపజేయును.

(అ. భూ.) దీనిని దుంపరాష్ట్రిగసమునందు తేనెచేర్చి దానితో సేవించిన కఫప్రకోపములయందు అమోఘముగా పనిచేయును.

చిత్రమూల కషాయముతోగాని, దశమూలారిష్టముతోగాని నుపయోగించిన వాతరోగములు, సూతికావాతములు హరించును.

దీనిలో కర్పూర శిలాజితుభస్మము, అశ్వగంధాదిచూర్ణములను కలిపి శారిబాద్యరిష్టముతో సేవించిన నోటిపూత తగ్గును. మరియు ఉష్ణాధిక్యతను తగ్గించును.

## 57. లోకనాథ రసము

బ॥ రా॥ (క్షయ॥ ప్ర.) 4 వ అధ్యా.

శ్లో॥ క్షయంక్షయకృశం వ్యాధీన్ వాతపిత్తకఫోద్భవాన్
కాసశ్వాసప్రతిశ్యాయ శోఫపాండు గదాదికాన్

... ... ... ... ...

... ... ... ... ...

లోకనాధ రసోనామశంభు నాపరికీర్తితః.

ద్రవ్యములు:—గవ్వ భస్మము, మాండూర భస్మము, లోహ భస్మము, రసము, గంధకము, మిరియాలచూర్ణము.

గుణము:—దీపనము, రక్తవర్ధకము, బల్యము, క్షయహరము,

ప్రమాణము:—2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా॥) దీనిని తేనెతో ప్రతిదినమున సేవింపుచుండిన, క్షయరోగము, క్షయమువలన జనించిన శరీరకృశత్వము త్రిదోషముల వలన జనించిన శ్వాసకాసలు, పీనసము, శోఫ, పాండు మొదలగు రోగములు హరించును.

(అ. భూ.) దీనిలో తాళీసాదిచూర్ణము, ప్రవాళ భస్మములను కలిపి తేనెతో సేవించి మేకపాలను త్రాగుచుండిన క్షయ, కృశత్వము, కాసశ్వాసలు, పీనసము హరించును.

దీనిలో గోక్షురాది చూర్ణమును కలిపి పునర్నవారిష్టముతో నుపయోగించిన శోఫ, పాండు, ఉదరరోగములను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి అమృతారిష్టముతో సేవించిన అస్థిగత జ్వరములు, పురాణ జ్వరములు, యకృత్ప్లీహోదరములు (లివర్ స్ప్లీన్ వ్యాధులు) తగ్గును.

జ్వరముచే పీడించి విడువబడినవారు దీనిని తేనెతో సేవించిన రక్తవృద్ధి కలిగి బలమును, ఆకలిని కలుగచేయును.

## 58. లోహ రసాయనము

ర॥ యో॥ ర. 6 వ అధ్యా.

గీ॥ యుక్తి యుక్తానుపానము లొనరగూర్చి। సేవనొనరింపరోగముల్ చెప్పకేగు
బలము తేజంబునాయువుల్ బహుళమగును। అండవృద్ధియునశియించు ఖండితముగ.

ద్రవ్యములు:—రసము, గంధకము, లోహభస్మము.

గుణము:—దీపనము, రసాయనము, రక్తవర్థకము, వాతహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో కుబేరాక్ష (గచ్చపప్పు) చూర్ణమును కలిపి తేనెతో సేవించిన అండవాతములు, అండవృద్ధులు, హరించి శరీరమునకు బలము కలుగజేయును.

దీనిలో గోక్షురాదిచూర్ణమును కలిపి పునర్నవారిష్టముతో నుప యోగించిన పాండు శోఫవ్యాధులను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

## 59. లఘు సిందూరభూషణము

(సిందూరభూషణరసము)

ర॥ యో॥ ర. 1 వ అధ్యా.

శ్లో॥ వంధ్యాపిపుత్రజననీ బాలవృద్ధాస్తుగర్భిణీ
తత్తద్రోగానుపానేవహితసాధ్యం విధీయతే
సిందూర భూషణోనామ హితసాధ్యం విధీయతే.

ద్రవ్యములు:—అభ్రకభస్మము, గంధకము, వెలిగారము, రస సిందూరము.

గుణము:—రసాయనము, బల్యము, పిత్తహరము, ఉష్ణశమ నము, గర్భపోషకము.

ప్రమాణము—1 మొదలు 2 గురిగింజలఎత్తువరకు.

ప్రయోగములు:— (ర॥ యో॥ ర.) దీనిని తేనెతో సేవించిన వీర్య వృద్ధి, దేహపుష్టి, కాంతిని కలిగించును. మరియు గర్భవతులకు బలము కలుగచేయును.

(అ. భూ.) దీనిలో చందనాదిచూర్ణము, కర్పూరశిలాజితు భస్మ ములను కలిపి వెన్నపూస, పంచదారతో సేవించిన అత్యుష్ణము, వీర్య నష్టము, శ్వేతరక్తప్రదరములు హరించి బలము కలుగచేయును.

దీనిలో మహాద్రాక్షాదిచూర్ణము, శృంగభస్మములను కలిపి తేనె తో సేవించి ద్రాక్షారిష్టమును త్రాగిన గర్భవతులకు కలుగు వికారములను

(అనగా గుండెలలోదడ, అన్నము జీర్ణముకాకుండుట, ఆయాసము, పొత్తి కడుపునరములు బిగించుట, మూత్రబంధము మొదలగువానిని) హరింప చేసి, గర్భవతులకు బలము కలుగజేయును.

## 60. లఘుసూర్యావర్తి

ఆ॥ ఔ॥ ర.

శ్లో॥ సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్తగదాపహః
ఛర్దిహిక్కాహరశ్చైవ, గ్రహణీ దోషకం జయేత్
... ... ... ... ... .. ... ...
సూర్యావర్తిరసోనామ హ్యశ్వినీదేవనిర్మితః.

ద్రవ్యములు:—అభ్రకభస్మము, హేమమాక్షికభస్మము, పమిడి వత్తిగింజల పప్పు, కాకిదొండగింజల పప్పు, తిప్పసత్తు, వెలిగారము, ముత్యభస్మము, లవంగాల చూర్ణము, ఇంగిలీకము.

గుణము:—రసాయనము, దీపనము, పిత్తహరము, గర్భిణీ వికారహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగమ్ములు:—(అ. భూ.) దీనిని పొంగించిన అల్లపురసములో తేనెను కలిపి దానితోగాని, మాదీఫలరసాయనముతో గాని సేవించిన సమస్త పైత్యవ్యాధులు, పిత్తజ్వరములు, పిత్తవికారములు (అనగా గుండెలలో మంట, వాంతులు, ఎక్కిళ్ళు, తలతిరుగుట, నిదుర పట్టకుండుట మొదలగునవి) హరించును.

ద్రాక్షపండ్లు, మంచిజీలకఱ్ఱ, అడ్డసరపాకు, వీట్ల కషాయముతో సేవించిన దగ్గు, జ్వరము, దాహము తగ్గును.

దీనిలో మహాద్రాక్షాదిచూర్ణము, శృంగభస్మములను కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన అగ్నిమాంద్యము, తలనొప్పి, అత్యుష్ణములను తగ్గించి హృదయమునకు బలము కలుగచేయును.

ఈ అనుపానముతోనే గర్భిణీస్త్రీలు సేవించిన గర్భిణులకు కలుగు వికారములు తగ్గి, గర్భిణులకు, గర్భస్థశిశువుకు బలము కలుగచేయును.

ఈ ఔషధమును గర్భిణులకు ఏ వికారము కలిగిననూ అనుపాన భేదములతో వాడుకొనవచ్చును.

## 61. లోహపర్పటి

భై॥ ర. గ్రహణీ॥ అధ్యా.

శ్లో॥ సూతికాంచజ్వరంచైవ గ్రహణీమతిదుస్తరాన్
ఆమశూలాతిసారాంశ్చ పాండురోగ సకామలామ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, లోహము.

గుణము:—గ్రాహి, వాతహరము, రక్తవృద్ధికరము, గ్రహణ్యాతిసారహరము.

ప్రమాణము:—1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(భై. ర.) దీనిని ప్రతినిత్యము చల్లనినీళ్ళతో గాని, ధనియాల కషాయముతోగాని, జీలకఱ్ఱ కషాయముతోగాని 1 గురిగింజఎత్తు చొప్పున వృద్ధిచేయుచూ, తగ్గించుచూ 4 గురిగింజల ఎత్తుకు మించకుండా 7 రోజులు సేవించవలెను. (అనగా మొదటిరోజున ఒక గురిగింజఎత్తు, 2 వ రోజున 2 గురిగింజలఎత్తు ఈ విధముగా 4 గురిగింజలఎత్తు మోతాదుయగువరకు సేవించి పిమ్మట ఒక గురిగింజఎత్తు చొప్పున ప్రతిరోజు తగ్గించుచూ 1 గురిగింజఎత్తు మోతాదు వచ్చువరకు సేవించవలెను.) ఏడు దినములు సేవించునప్పటికి ఆరోగ్యము కలుగకున్న మిగతాదినములయందు (అనగా ఆరోగ్యము కలుగువరకు) కాలపరిస్థితులనుబట్టి పైనవ్రాసిన విధముగా హెచ్చు తగ్గులులేకుండా 1 మొదలు 4 గురిగింజలఎత్తువరకుపయోగించవచ్చును.

ఇట్లు పై అనుపానములతో సేవించిన సూతికారోగములు, సూతికా జ్వరములు అసాధ్యగ్రహణీవ్యాధులు, ఆమశూల, అతిసారము, గ్రహణ్యాతిసారముల వలన కలుగు పాండు, కామిలావ్యాధులు, ప్లీహము,

అగ్నిమాంద్యము, ఆమవాతము, ఉదావర్తము, కుష్ఠువ్యాధులు. పెట్టు మందు (గరము) వలన గలుగు వికారమును హరింపజేసి ఆకలిని వృద్ధి జేయును.

ప్రమాణము:—(అ. భూ.) 1 మొదలు 2 గురిగింజలఎత్తువరకు.

ప్రయోగములు:— దీనిలో దాడిమాష్టకచూర్ణమును కలిపి కుటజారిష్టముతోగాని, కర్పూరాద్యరిష్టముతోగాని సేవించిన అసాధ్య గ్రహణీవ్యాధులు, అతిసారములు హరించును.

దీనిని ధనియాలు, జీలకఱ్ఱ కషాయముతోగాని జీరకాద్యరిష్టము తోగాని నుపయోగించిన సూతికలకు కలుగు గ్రహణ్యాతిసారములు, సూతికావాతములు, సూతికాజ్వరములు, ధనుర్వాతము హరించును.

దీనిలో కాసీససిందూరము, వరాటభస్మములను కలిపి లోహాసవ ముతో సేవించిన గ్రహణ్యాతిసారములవలన కలిగిన పాండు, కామిల, అజీర్ణము, ప్లీహావ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిజేయును.

(భై॥ ర.) దీనిని సేవించునప్పుడు రక్తశాల్యన్నమును భుజింప వలెను. మరియు ఎండ, గాలిలో తిరుగుట, చింత, మైధునము, విదాహి కరశాకములను సేవించుట వర్జించవలెను.

## 62. లోహసప్వీరము

వై॥ యో॥ ర॥

ద్రవ్యములు:—లోహము, సప్వీరము.

గుణము:—జ్వరహరము, వాతహరము, రక్తవర్ధకము, ఫిరంగజహరము

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ యో॥ ర॥) దీనిని తేనెతో సేవించిన పక్షవాతము చచ్చువాతము, చలిజ్వరములు, సవామేహముచేత కాళ్లు చేతులు చచ్చుపడుట, ఆమవాతము, శోఫరోగము మున్నగువానిని శమింపచేయును.

(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి గంటుభారంగి కషాయముతో గాని, పంచతిక్త పానకముతో గాని సేవించిన చలిజ్వరములు, పురాణ జ్వరములను తగ్గించి రక్తమును వృద్ధిచేయును. మరియు చలిజ్వరమువలన కలుగు ఆమవాతము కూడ తగ్గును.

దీనిలో తాళిసాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన శోఫ, పాండు వ్యాధులను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో అశ్వగంధాది చూర్ణమును కలిపి అశ్వగంధారిష్టముతో సేవించిన వాతవ్యాధులు, సవామేహమువలన కలుగు కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు కాళ్ళుచేతులు చచ్చుపడుట తగ్గును.

N. B దీనిని గర్భిణీస్త్రీలకు వాడకూడదు. దీనియందుగల సవీర్వ భాగము కంటుయందు నశించి సవీర్వరమునందు గల మంచిగుణము మాత్రమే లోహమునందు వ్యాపించి యుండును.

## 63. వసంతకుసుమాకరము

వై॥ చిం. ప్రమేహ॥ ప్ర.

శ్లో॥ వలీపలితహృన్మేధ్యః కామదస్సుఖదస్సదా
మేహఘ్నః పుష్టిదశ్శ్రేష్ఠః పరం వృష్యోరసాయనః

ద్రవ్యములు:—స్వర్ణభస్మము, రజతభస్మము, వంగభస్మము, నాగభస్మము, కాంతభస్మము, రససిందూరము. అభ్రకభస్మము, ప్రవాళభస్మము, ముత్యభస్మము.

గుణము:—రసాయనము, వాజీకరణము, ప్రమేహహరము, క్షయహరము, రక్తపిత్తహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిని తేనెతోగాని నెయ్యి పంచదారతోగాని సేవించిన ముదిమి, మేహము, క్షయ, మూత్రాఘాతము, అశ్మరి అను రోగములను హరింపజేయుటయే గాక కామ సుఖము, పుష్టి, వీర్యవృద్ధిని కలుగచేయును.

దీనిలో చందన చూర్ణమును కలిపి పంచదారతో సేవించిన ఆమ్ల పిత్తాది రోగములు హరించును.

(అ. బా.) దీనిలో జాజికాయ, జాపత్రి, లవంగములు, పిప్పళ్ళు, దురదగొండివిత్తులు, గొబ్బివిత్తుల చూర్ణములను కలిపి పంచదారతో సేవించి ఆవుపాలు త్రాగిన ముసలితనమును పోగొట్టి యౌవ్వనమును కలుగచేయును.

దీనిలో పచ్చకర్పూరము, కుంకుమపువ్వులను చేర్చి మాత్రలుగా చేసి తంగేడు పంచకకషాయముతో సేవించిన ప్రమేహ వ్యాధులు నివర్తించును.

దీనిలో నేరేడుగింజల చూర్ణము, గోమూత్రశిలాజితులను సమభాగములుగా కలిపి మాత్రలుచేసి త్రిఫలాకషాయముతో సేవించిన మధుమేహము, సోమరోగము, మలబద్ధము మొదలగునవి తగ్గగలవు.

దీనిని వాసారిష్టముతోగాని, ద్రాక్షారిష్టముతోగాని సేవించిన క్షయ, ఉరఃక్షతము, శుక్రనష్టము, శ్వాసకాసలు హరించును.

దీనిలో లాక్షాచూర్ణమును కలిపి ఉసీరాసవముతో సేవించిన, రక్తపిత్తములు, శ్వేతరక్తప్రదరములు తగ్గును.

శారిబాద్యరిష్టముతో గాని, ఖదిరారిష్టముతో గాని సేవించిన ప్రమేహ వ్రణములు తగ్గును.

దీనిని వృద్ధాప్యమునందు సేవించిన వయస్సును స్తంభింప చేసి బలము, పుష్టి, ఉత్సాహమును కలుగచేయును.

## 64. వంటబాల సూర్యోదయము

ఆ॥ బో॥ ర. [అనుబద్ధ గుచ్ఛము]

శ్లో॥ బాలసూర్యోదయాభశ్చ, సర్వజ్వర కులాన్తకః.

ద్రవ్యములు:—గంధకము, రసము, తాళకము, మణిశిల, వెలిగారము, ఇంగిలీకము.

గుణము:—జ్వరహరము, కాసశ్వాసహరము, శోణితవర్ధనము.

ప్రమాణము:— ½ మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి అమృతారిష్టముతో సేవించిన విషమ జ్వరములు, జీర్ణజ్వరములు హరించును.

దీనిలో ప్రవాళభస్మము, సితోపలాది చూర్ణములను కలిపిన కనకాసవముతో సేవించిన కాసశ్వాసలు, తమకశ్వాసలు, కఫరోగములు తగ్గును.

కాంతభస్మము, మహాద్రాక్షాదిచూర్ణములను చేర్చి తేనెతో సేవించిన కామిలా పాండువ్యాధులను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో శాల్మలీచూర్ణము, వంగభస్మముః ను కలిపి పేరిన నెయ్యి పంచదారలతో సేవించి బియ్యము కడిగిన నీళ్ళుత్రాగిన శ్వేతరక్త ప్రదరములు తగ్గగలవు.

## 65. వంట సువర్ణసూర్యావర్తి

ఆ॥ ఔ॥ ర. (తృతీయగుచ్ఛము)

శ్లో॥ సర్వపైత్యంచ తాపంచ సర్వజ్వరనివారకః । సర్వవాతోపశమక స్సర్వమేహ వినాశకః

ద్రవ్యములు:—స్వర్ణభస్మము, రజతభస్మము, వంగభస్మము, పచ్చకర్పూరము, వైక్రాంతభస్మము, ముత్యాభస్మముః, ప్రవాళభస్మము, నాగభస్మము, కాసీససిందూరము, తిప్పసత్తు, వెలిగారము, సత్తుభస్మము, అభ్రకభస్మము, రససిందూరము, ఇంగిలీకము.

గుణము:—పిత్తహరము, బల్యము, హృద్యము, మేధ్యము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని మాదీఫల రసాయనముతోగాని జీలకఱ్ఱరసమునందు తేనెనుచేర్చి దానితోగాని సేవించిన కాళ్లు చేతులు మంటలు, గుండెదడ, పార్శ్వపునొప్పి, కడుపులోమంట, తల తిరుగుట మొదలైన పిత్త వికారములను హరింపచేయును.

దీనిలో శృంగభస్మమును కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన

గుండెదడ, గుండెనొప్పి, నీరసములను తగ్గించి హృదయమునకు బలము కలుగచేయును.

ఈ విధముగానే గర్భిణీ స్త్రీల కుపయోగించిన గర్భ వికారము లన్నియు తగ్గును.

దీనిలో మహాద్రాక్షాదిచూర్ణమును కలిపి సారస్వతారిష్టముతో గాని, అశ్వగంధారిష్టముతో గాని సేవించిన శుక్రమేహము, బుద్ధిమాంద్యము, అపస్మారము, మూర్ఛలను హరింపచేసి చిత్తస్థైర్యమును కలుగ చేయును.

దీనిలో వరాటభస్మమునుగాని, శంఖభస్మమునుగాని కలిపి ద్రాక్ష పండ్ల రసముతో సేవించిన అజీర్ణములను, అజీర్ణములవలన కలుగు శిరో బాధలను హరింపజేయును.

## 66. వజ్రాయుధ రసము

అనుభూతయోగము

ద్రవ్యములు:—రసము, గంధకము, ఇంగిలీకము తాళకము, రస కర్పూరము, కర్పూరసిలాజితు, సౌవీరము, రససిందూరము, మృద్దారు చిన్ని, రేవల్‌చిన్ని.

గుణము:—వాతహరము, ఫిరంగరోగహరము, రక్తశోధకము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని రాస్నాది కషాయముతో సేవించిన కీళ్ళవాతము, పక్షవాతము, ఆమవాతము మొదలగు వాతవ్యాధులు హరించును.

దీనిని మధుస్నుహీ రసాయనముతో సేవించిన ఉపదంశము (కొరుకుడు) ఫిరంగరోగము (సవామేహరోగము)లు హరించును.

దీనిని శారిబాద్యరిష్టముతో గాని, ఖదిరారిష్టముతో గాని సేవించిన రక్త చర్మగత వ్యాధులను హరింపచేసి రక్తమును శుభ్రపరచును.

## 67. వా త గ జాం కు శ ము

బ॥ రా. (వాత॥ ప్ర.) 6 వ అధ్యా.

శ్లో॥ గుంజామాత్రం వటీంఖాదేదశీతి ర్వాతనాశనమ్
వాతగజాం కుశ్లోనామ్నా హ్యూరు స్తంభం నిహంతిచ.

ద్రవ్యములు:—రసము, గంధకము, విషముష్టి, త్రికటుకములు, త్రిఫలములు.

గుణము:—దీపనము, వాతహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ॥ రా.) దీనిలో మిరియాల చూర్ణమును కలిపి నేతితో సేవించిన ఊరు స్తంభవాతము, మొదలగు ఎనుబది వాతములు హరించును.

(అ. భూ.) అల్లపురసమునందు తేనె చేర్చి దానితో సేవించిన, నరముల బలహీనత, పార్శ్వశూల, అగ్నిమాంద్యములను హరింపచేసి ఆకలి కలుగచేయును.

దీనిని అశ్వగంధారిష్టముతో గాని, రాస్నాది కషాయముతోగాని సేవించిన, ఒడలు తిరుగుట, తిమిరవాతము, పక్షవాతము మొదలగు వాతవ్యాధులను హరింపజేయును.

గోరువెచ్చని ఆవుపాలతో సేవించిన అతిమూత్రము తగ్గును.

## 68. వా త రా క్ష స ము

వై॥ చిం. (వాత॥ ప్ర.)

శ్లో॥ వాతరాక్షసనామాయం వాతరోగే ప్రయోజయేత్.

ద్రవ్యములు:—రసభస్మము, గంధకము, కాంతభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము.

గుణము:—వాతహరము, వాతరక్తహరము, స్రోతశ్శోధనము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజలఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో జున్ను, గోరోజనము,

పావుదారు, రొయ్యిపీత కస్తూరిని సమానభాగములుగ చేర్చి చిత్రమూల రసములో మర్దించి మాత్రలుచేసి వానిని జీలకఱ్ఱ, మిరియాల రసముతో నుపయోగించిన వాతవ్యాధులు, సన్నిపాతజ్వరములు, వాతజ్వరములు తగ్గును.

దీనిని తిప్పతీగె, శొంఠికషాయముతో సేవించిన వాతరక్తములు, ఆమవాతములు తగ్గును.

దీనిని దశమూలారిష్టముతో నుపయోగించిన విరేచనముచేసి సన్నిపాతజ్వరములయందును, వాతవ్యాధులయందును కలుగు వాతో ద్రేకమును హరింపచేయును.

## 69. వా త వి ధ్వం సి

(వాతవిధ్వంసకరసము)

బ॥ రా. (వాత॥ ప్ర.) 6 వ అధ్యా.

శ్లో॥ ... ... ... వాతవిధ్వంసకోయం రసశ్చ
సమీరేచశూలే తథాశ్లేష్మరోగే గ్రహణ్యాం తథాసన్నిపాతేచ.

ద్రవ్యములు:—రసము, గంధకము, సీసభస్మము, వంగభస్మము లోహభస్మము, తామ్రభస్మము, అభ్రకభస్మము, నాభి, త్రికటుకములు, వెలిగారము.

గుణము:—వాతహరము, కఫహరము, సన్నిపాతజ్వరహరము, గ్రాహి.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో పిప్పలి చూర్ణమును కలిపి దశమూలారిష్టముతో సేవించిన సూతికావాతము, మూకవాతము అపస్మారము మొదలగు వాతవ్యాధులను హరింపచేయును.

దీనిలో ప్రవాళభస్మమును చేర్చిగాని చేర్చకగాని తమలపాకు రసముతో సేవించిన శ్వాసకాసములు, గొంతులో గుర గుర యనుట మొదలగు కఫవ్యాధులను తగ్గించును.

దీనిలో కస్తూరి యితర చేదుకట్లను చేర్చి చిత్రమూల రసముతో

మాత్రలు చేసి వాటిని అమృతారిష్టముతో నుపయోగించిన, సన్నిపాత జ్వరములు తగ్గును.

దీనిలో నల్లమందును నాల్గవవంతు చేర్చి మాత్రలు కట్టి కుట జారిష్టముతోగాని, మజ్జిగతోగాని సేవించిన గ్రహణీ అతిసారములు నివర్తించగలవు.

N B ఈ ఔషధము యొక్క పరిమాణమునందు నాభి భాగము సుమారు 1/3 వ వంతు యున్నది.

## 70. వాతాగ్నికుమారము

వై॥ యో॥ ర.

ద్రవ్యములు:—రసము, గంధకము, తాళకము.

గుణము:—వాతహరము, కఫహరము, తమకశ్వాసహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనులవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో త్రికటుచూర్ణమునుకలిపి తేనెతో సేవించిన ఆమజ్వరములు, వాతజ్వరములు హరించును.

దీనిలో ప్రవాళభస్మమును చేర్చి వాకుడుకాయల రసముతో గాని, ఆకుజెముడాకుల రసముతోగాని సేవించిన దగ్గు, పడిశము, ఒగర్పు మొదలగు శ్లేష్మవ్యాధులు తగ్గును.

దీనిలో సోమకల్పచూర్ణము, శృంగభస్మములను కలిపి వెన్న పూసతో సేవించిన తమకశ్వాస (ఉబ్బసము)ల యందు కలుగు ఒగర్పు ఆయాసములను వెంటనే తగ్గించి సుఖమును కలుగచేయును.

## 71. వైష్ణవీ రసము

బ॥ రా. (జ్వర॥ ప్ర.) 1 వ అధ్యా.

శ్లో॥ ... ... ... ... జ్వరాపహః

ద్వంద్వజ్వరం సన్నిపాతం పురాణం విషమజ్వరమ్

నాశయేదఖిలాన్ రోగాన్నామ్నాయం వైష్ణవీరసః.

ద్రవ్యములు:—ఇంగిలీకము, నాభి, త్రికటుకములు, కటుకరోహిణి.

గుణము:—జ్వరహరము, దీపనము, పాచనము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిని అల్లపు రసముతో సేవించిన జ్వరములు, ద్వంద్వజ్వరములు, సన్నిపాతజ్వరములు, పురాణజ్వరములు, విషమజ్వరములు తగ్గును. విరేచనమును జేయును.

(అ. భూ.) దీనిని అమృతారిష్టముతో సేవించిన సన్నిపాతజ్వరములు, పురాణజ్వరములు నివర్తించును.

తులసిఆకు రసముతో నుపయోగించిన చంటిపిల్లలకు కలుగు జ్వరము, పడిశములను హరింపచేయును.

## 72. వాత కు రా ర ము

(వాత కురారరసము)

ఆ॥ ఔ॥ ర. [ప్రథమ గుచ్ఛము]

శ్లో॥ .. .. . వాతరోగేషు యోజయేత్
అనుపాన విశేషేణ సర్వశ్లేష్మగదేషుచ.

ద్రవ్యములు:— ఇంగిలీకము, మణిశిల, గంధకము రసము.

గుణము:—వాతహరము, శ్లేష్మహరము, కాసశ్వాసహరము.

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని చిత్రమూల కషాయముతో గాని, దశమూలారిష్టముతోగాని సేవించిన సమస్త వాతవ్యాధులను హరింపచేయును.

దీనిని తమలపాకు రసము, తేనెతో నుపయోగించిన శ్లేష్మప్రకోపములు, శ్వాసకాసలు తగ్గగలవు.

సదాపాకు కషాయముతో సేవించిన సన్నిపాత జ్వరములయందు కలుగు వాతోపద్రవములను హరించును.

## 73. శీతాంశు రసము

బృ॥ రా. [సన్ని॥ ప్ర.] 2 వ అధ్యా.

శ్లో॥ శీతజ్వరం సన్నిపాతం కామిలా పంచగుల్మకే
సర్వం శ్వాసంచకాసంచ హ్యుదరే పూర్వరోగజిత్.

ద్రవ్యములు:—మణిశిల, తాళకము, త్రికటుకములు.

గుణము:—జ్వరహరము, సన్నిపాత జ్వరహరము, పిత్తహరము, విషహరము, త్వచ్యము, అపస్మారహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిలో కరక్కాయ చూర్ణమును కలిపి తేనెతోగాని, అల్లపురసముతోగాని సేవించిన శీతజ్వరములు, సన్నిపాత జ్వరములు, కామిల, గుల్మములు, శ్వాసకాసలు, ఉదరరోగములు, వాతరోగములు, పిత్తరోగములు, స్థావర, జంగమ విషదోషములు, హరించును.

దీనిని పైఅనుపానముతో సేవించుచూ, వేపాకురసమునందు అరగ తీసి లేపనము చేసిన గజచర్మము, విసర్పి, మండలకుష్టము, శరీరమున పొట్టువలె చర్మము వూడెడు రోగము హరించును. దంతములకు రాసిన యెడల దంతరోగములు తగ్గును.

దీనిని వావిలాకు రసమునందు అరగతీసి నస్యము చేసిన, అపస్మారము శిరోరోగములు హరించును.

దీనిని నిమ్మకాయరసముతో అరగతీసి ఆవగింజంత నేత్రముల యందు వేసిన నేత్రరోగములు, దోషగుణములు నివర్తించును.

(అ. భూ.) దీనిని తేనెకలిపిన అల్లపురసముతో సేవించిన అజీర్ణ జ్వరములు, పైత్త్యజ్వరములు, జిహ్వాదోషములు హరించును.

దీనిని చిత్రమూలము, శొంఠి, మిరియాలు, సదాపాకు వీని కషాయముతోగాని, అమృతారిష్టముతోగాని సేవించిన సన్నిపాత జ్వరములు తగ్గును. మరియు పడిశము, ఒడలు నొప్పులు, మొదలగునవి కూడా తగ్గును.

దీనికి సమము సూర్యావర్తిని చేర్చి తేనెతోగాని, జంబీరాది రసాయనముతో గాని సేవించిన పిత్తవికారములు, గుండెలలో మంట, అరుచి, వమనము హరించును.

దీనిలో సితోపలాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన శ్వాసకాసలు, పడిశము తగ్గును.

## 74. శూలకుఠారము

(శూలకుఠార రసము)

వై॥ చిం. (శూల॥ ప్ర)

శ్లో॥ సర్వశూలకుఠారోయం విష్ణుచక్రమివాసురాన్.

ద్రవ్యములు:—వెలిగారము, రసము, గంధకము, త్రిఫలములు, త్రికటుకములు, తాళకము, నాభి, తామ్రభస్మము, నేపాళము.

గుణము:—శూలహరము, రేచనము, పాచనము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిలో మిరియాలచూర్ణమును కలిపి అల్లపురసముతో సేవించిన సర్వశూలలు హరించును.

(అ. భూ.) దీనిని అజామోదార్కము (వాంవాటరు)తో సేవించిన సమస్తశూలలు హరించును.

శొంఠి, కరక్కాయ, వాము, వీని కషాయముతో సేవించిన శూలవ్యాధియందు విరేచనము కలుగచేసి కడుపుబ్బరమును, శూలను పోగొట్టి జఠరదీప్తి (ఆకలి)ని కలుగచేయును.

## 75. శ్వాసకుఠారము

వై॥ చిం. (శ్వాస॥ ప్ర.)

శ్లో॥ రసశ్వాసకుఠారోయం । సర్వశ్వాస నివారణమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, వెలిగారము, మణిశిల, మిరియాలు, త్రికటుకములు.

గుణము:—దీపనము, పాచనము, శ్వాసకాసరోగములను హరించును.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని వాకుడుపండ్ల రసముతో గాని, వాసారిష్టముతోగాని సేవించిన శ్వాసకాసలు, తమకశ్వాసలు (ఉబ్బసము) హరించును.

దీనిని ఉమ్మెత్తాకురసముతోగాని కనకాసవముతోగాని సేవించిన ఉబ్బసమునందు కలుగు పిల్లికూతలు, ఆయాసము, దగ్గు తగ్గును.

తేనె కలిపిన తమలపాకు రసముతోగాని తేనె కలిపిన తులసిఆకు రసముతో గాని సేవించిన స్రోతస్సులను చుట్టుకొనియుండు కఫమును తగ్గించి శ్వాస పీల్చుటకు వీలుగాయుండునట్లు చేయును.

## 76. శీతభంజనరసము

వై॥ యో॥ ర.

శ్లో॥ శర్కరస్యానుపానేన దేయం శీతజ్వరం హరేత్
హరప్రకటితః పూర్వం నామ్నాయం శీతభంజనః.

ద్రవ్యములు:— మైలతుత్థము, పాలతుత్థము, మిరియాలు, రసము, ఉల్లిపాషాణము, శొంఠి. (రొయ్యపీత మర్దన ద్రవ్యము)

గుణము:—విషమ జ్వరహరము, వాతహరము, కఫహరము.

ప్రమాణము:— $\frac{1}{2}$ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ యో॥ ర.) దీనిని పంచదార నీళ్ళతో సేవించిన శీతజ్వరములు, ఆహ్నికజ్వరములు, మలేరియాజ్వరములుతగ్గును.

(అ. భూ.) దీనిని కిరాతారిష్టముతో గాని పంచతిక్త రసాయన ముతోగాని సేవించిన విషమజ్వరములు (అనగా సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చాతుర్థిక జ్వరములు) హరించును.

వాకుడుపండ్ల రసముతో సేవించిన శ్లేష్మప్రకోపములు హరించును.

N B ఈ ఔషధమును పండ్లతో నమలక మ్రింగి అనుపానమును తీసుకొనవలెను. ఇందు ఉల్లిపాషాణము, మైలతుత్థములు గలవు.

## 77. షడ్గుణ సిందూరము

క. యో. ర (8 వ అధ్యా.)

శ్లో॥ యక్ష్మమేకాదశవిధం పాండురోగస్తుపంచమమ్
.. ... ... ... ... ...
షండత్వంవీర్యనష్టంచ లింగదోషాన్యనేకశః
ఏతాన్ రోగాన్నాశయతి షడ్గుణోగంధకోరసః.

ద్రవ్యములు:—రసము, గంధకము.

గుణము:—దీపనము, రసాయనము, జ్వరహరము, క్షయహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి తేనెతో సేవించిన జీర్ణజ్వరములు, బలహీనతవలన కలిగెడి జ్వరములు తగ్గును.

దీనిని అప్పుడుపితికిన ఆవుపాల (గుమ్మపాలు)లో కలిపి సేవించిన శరీర శుష్కము (ఎండిపోవుట) రక్తహీనతను, శుక్రనష్టమును, పోగొట్టి బలమును వీర్యవృద్ధిని కలుగచేయును.

దీనిలో ముత్యాభస్మము, సితోపలాదిచూర్ణములను కలిపి వాసారిష్టముతో సేవించిన క్షయలు, శ్వాసకాసలు హరించును.

దీనిలో అశ్వగంధాదిచూర్ణమును కలిపి శారిబాద్యరిష్టముతోగాని, మధుస్నుహీ రసాయనముతోగాని సేవించిన రక్తదోషములు, లింగదోషములు హరించును.

## 78. సి ద్ధ మ క ర ధ్వ జ ము

రసతరంగిణి [పాదరస సంస్కారాధ్యాయం] 6 వ అధ్యా.

శ్లో॥ క్షయ క్షయ కరః పరం ప్రబలకాస కాలానలః
ప్రమేహ కులఖండనః ప్రవితతాం త్రశోషాంతకః
సమస్త గదభంజనః ప్రమిద కామినీ రంజనః
సదైవమకరధ్వజో విజయతే రసాధీశ్వరః.

ద్రవ్యములు:—స్వర్ణము, రసము, గంధకము మూడుసార్లువండబడినది.

గుణము:—రసాయనము, వాజీకరణము, బల్యము, క్షయ హరము, విషహారము, రక్తదోషహరము, వాతహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ త॥) దీనిలో పచ్చకర్పూరము, కుంకుమ పువ్వులను చేర్చి మాత్రలు కట్టి వాటిని ఆవుపాలతో సేవించిన క్షయ, క్షయలవలన క్షీణించుట, కాసశ్వాసలు, సమస్త ప్రమేహములు, ధాతుక్షయము (కృశించుట) మొదలగు రోగములను హరింపజేయును. మరియు ముదిమిని (ముసలితనమును) పోగొట్టి వీర్యవృద్ధిని కలుగజేసి సంభోగేచ్ఛను యవ్వనమును కలుగజేయును.

(అ. భూ.) ఈ ఔషధమునకు సమముగా లవంగములు, ఏలకులు దాల్చినచెక్క, పిప్పల్యావాల (అనగా పిప్పళ్ళమీద గింజలవలె యుండునవి)ను చేర్చి పన్నీరుతోగాని, పగడపూల రసముతో గాని మర్దించి మాత్రకు వచ్చు సమయమున ఔషధమునకు 4 వ పాలు పచ్చ కర్పూరము వేసి నూరి పెసరగింజలవలె మాత్రలు జేసి వాటిని వెన్న పంచదారతో గాని, పాలు పంచదారతోగాని సేవించిన వీర్యవృద్ధిని కలుగజేసి సంభోగేచ్ఛను కలుగజేయును. మరియు ముదిమిని పోగొట్టి యవ్వనమును కలుగజేయును.

దీనిలో ముత్యభస్మము, సితోపలాదిచూర్ణములను కలిపి అడ్డ సరపాకు రసముతోగాని, వాసారిష్టముతోగాని సేవించిన క్షయవ్యాధులు, ధాతుక్షయము, కాసశ్వాసలు హరించును.

త్రిఫలాచూర్ణమును కలిపి తేనెతో సేవించిన స్థావర, జంగమ, కృత్రిమ విషములయొక్క వికారములు హరించును.

దీనిలో అశ్వగంధాదిచూర్ణమును కలిపి ఖదిరారిష్టముతో సేవించిన రక్తగతరోగములు, చర్మగతరోగములు తగ్గును.

దీనికిరెట్టింపు పెన్నేరుచూర్ణమును కలిపి అశ్వగంధారిష్టముతో సేవించిన ధాతు క్షీణతవలన వచ్చు సమస్త వాతరోగములుహరించును.

[illegible]లో [illegible] మహాద్రాక్షాది చూర్ణములను కలిపి ద్రాక్షారిష్టము [illegible], [illegible]రిష్టము [illegible]గాని సేవించిన గుండెదడ, గుండెనొప్పి మొదల[illegible] హృద్రోగములు తగ్గును.

N. B. ఈ [illegible] 3 తు. [illegible] 1 తు. (అనగా 1/3 భాగము) బంగారము [illegible] వంటలు పూర్తిఅయిన పిమ్మట, కుప్పె యొక్క అడు[illegible] స్వర్ణమును, పైభాగమందుండు సిందూరమును [illegible]. ఇది రసౌషధములయందు మిక్కిలిప్రసిద్ధిచెందినది.

## 80. సర్వవ్యాధిహరణరసము

(వ్యాధిహరణరసము)

[illegible] (ఉపదంశ ప్ర.) 14 వ అధ్యా.

శ్లో॥ [illegible] పుంస్త్వం వాజీకరణముత్తమమ్
అపుత్రః పుత్రమాప్నోతి జీవేచ్చ శరదాంశతమ్.

ద్రవ్యములు:—రసము, రసకర్పూరము, గంధకము.

గుణము.—రసాయనము, వాజీకరణము, ఉపదంశహరము, రక్తదోషహరము, శుక్రదోషహరము, కఫవాతహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు.—(బ రా) దీనిని తమలపాకులోనుంచి సేవించిన షండత్వము, ముసలితనము, ఉపదంశము, (కొరుకుడు) వీనినిహరింప చేసి పుంసత్వమును, వీర్యవృద్ధిని కలుగచేయును.

(అ. భూ.) దీనిలో అశ్వగంధాదిచూర్ణమును కలిపి శారిబాద్యరిష్టముతో సేవించిన ఉపదంశము (కొరుకుడు) లింగదోషములు, సవాయి రోగములు హరించును.

దీనిని సుగంధాదిలేహ్యమునందు కలిపి సేవించిన సమస్త చర్మరోగములు తగ్గును.

దీనిని అమృతభల్లాతకీ లేహ్యమునందు కలిపి సేవించిన సమస్త

రక్తదోషములు, (అనగా కుష్టము, శ్విత్రము, విసర్పి, భగందరము మొదలగునవి) తగ్గగలవు.

దీనిని మధుస్నుహీ రసాయనమునందు కలిపి సేవించిన ఆమవాతములు, కీళ్ళనొప్పులు, రక్తదోషములు హరించును.

అశ్వగంధాదిలేహ్యమునందు కలిపి సేవించిన శుక్రమునందుండు దోషములను పోగొట్టి పుత్రసంతానము కలుగచేయును. మరియు షండత్వమును పోగొట్టును.

## 80. సమగరళ తరుణార్కము

బృ॥ రా. (సన్నిపా॥ ప్ర.) 2వ అధ్యా.

శ్లో॥ దాతవ్యం సన్నిపాతార్తే, తతశ్శైత్య ముపాచరేత్
తరుణార్కరసోనామ, మృత్యుంజయతి నిశ్చయః.

ద్రవ్యములు:—తాళకము, ఇంగిలీకము, నాభి, గరళము.

గుణము:—హృదయోత్తేజకము, సన్నిపాత జ్వరహరము, వాతశ్లేష్మహరము, శీతహరము.

ప్రమాణము.— ½ మొదలు 1 మాత్రవరకు. (మాత్ర ప్రమాణము పెసరగింజంత)

ప్రయోగములు:—(బృ॥ రా.) దీనిని కొబ్బరికాయ నీళ్ళతో సేవించిన సకలమయిన సన్నిపాత జ్వరములయందు హృదయమునకు బలమును కలుగచేసి సన్నిపాత జ్వరములను హరింపచేయును.

దీనిని సేవించునప్పుడు శైత్యోపచారములు చేయుచుండవలెను.

(అ. భూ.) దీనిని తమలపాకు రసముతోగాని తులసియాకు రసముతోగాని సేవించిన, వాతజ్వరములు, కఫజ్వరములు, సన్నిపాత జ్వరములు, సన్నిపాతజ్వరములయందు కలుగు ఉపద్రవములు హరించును

తేనెకలిపిన ఆకుజెముడాకు రసముతో సేవించిన కంఠగతశ్లేష్మము కరపాద శీతలములను తగ్గించి శరీరమునకు వేడిని కలుగచేయును.

ఈ ఔషధము సేవించునప్పుడు అవసరమును బట్టి చనుపాలు, తేనెను యిచ్చుచూ శీతలోపచారములను చేయవలెను.

N. B నోటియందు పుండ్లు కలవారు అంగిట్టియందు వేసుకొని మ్రింగవలెను.

## 81. సన్నిపాత భైరవ రసము

వై॥ చిం॥ అతిసార. ప్ర॥

శ్లో॥ త్రిదోషజాతిసారంచ కఫపాండుమరోచకమ్
కుక్షిశూల ముదావర్తం సన్నిపాతం నికృంతయేత్.

ద్రవ్యములు:— తాళకము, గంధకము, రసము, నాభి, మణిశిల వెలిగారము, ఇంగిలీకము.

గుణము:— జ్వరహరము, సన్నిపాతజ్వరహరము, గ్రాహి, పాచనము, వాతహరము.

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని జీలకఱ్ఱరసముతో సేవించిన వాతజ్వరములు, సామాన్యజ్వరములు, ఒడలు నొప్పులు, పడిశముతగ్గును.

దీనిని అల్లపురసముతో సేవించిన ఆమదోషములను ఆమజ్వరములను హరింపజేసి ఆకలిని వృద్ధిచేయును.

త్రికటు కషాయముతోగాని, దశమూలారిష్టముతోగాని సేవించిన సన్నిపాత జ్వరములు, సూతికా జ్వరములు హరించును.

దీనికి నాల్గవవంతు నల్లమందు చేర్చి మాత్రలు చేసి వాటిని దాల్చినచెక్క, గసగసాలరసముతోగాని, కర్పూరాద్యరిష్టముతోగాని సేవించిన సన్నిపాతములయందు కలుగు అతిసారము, గ్రహణీ వ్యాధులు హరించును.

దీనిని నిమ్మకాయ రసముతోగాని, కాకరాకు రసముతోగాని అరగతీసి పెసరబద్దంత నేత్రములయందు వేసిన సన్నిపాతములయందు కలుగు మగత, తలవిసురుడు, మొదలైన దోషములు తగ్గగలవు.

## 82. సింహప్రతీపాలనరసము

బృ॥ రా. (జ్వ॥ ప్ర.) 1 వ అధ్యా.

శ్లో॥ సర్వంకాంతి మనేకదోషశమనం సింహప్రతీపాలనమ్.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, గరళము. (సమాన భాగములు)

గుణము:—సన్నిపాతజ్వరహరము, శీతహరము, వాతహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:— (అ. భూ.) దీనిని తులసియాకురసముతో గాని, దశమూలారిష్టముతోగాని సేవించిన శీతజ్వరములు, సన్నిపాత జ్వరములను హరింపచేయును. మరియు సన్నిపాత జ్వరములయందు కలుగు హృదయ దౌర్బల్యము, కరపాద శీతలములను తగ్గించి శరీరమునకు ఉష్ణమును కలుగజేయును.

చనుపాలతో నుపయోగించిన చిన్నపిల్లలకు కలుగు వాతవ్యాధులు, (అనగా చంటిబిడ్డగుణము మొదలగునవి) సన్నిపాత జ్వరములయందు కలుగు వాత వికారములు హరించును.

N B ఈ ఔషధమును సేవించు నప్పుడు తైలాభ్యంగము, శీతలోపచారములు చేయవలెను. ఈ యౌషధమును పండ్లతో నమలకనే మింగవలెను. ఈ యౌషధమును కురుపులకుగాని, గాయములకుగాని తగలనివ్వరాదు. తగిలిన విషవికారములు కలుగును.

## 83. సువర్ణకాంతవల్లభరసము

ఆ॥ ఔ. ర. (ప్రథమగుచ్ఛము)

శ్లో॥ పాణ్డురోగంక్షయం గుల్మం గ్రహణీరోగకంతథా
కాసంశ్వాసంజ్వరంఛర్దిం ప్లీహోదర మరోచకం.

ద్రవ్యములు:—స్వర్ణము, వెండి, శిలాజితు, మణిశిల, వెలిగారము, మాండూరము, లోహము, కాంతము, రసము, గంధకము.

గుణము:—జ్వరహరము, శోణితవర్ధనము, క్షయహరము, యకృత్ప్లీహోదరహరము, పాండు, శోఫశమనము.

ప్రమాణము:—2 మొదలు 3 గురిగింజల యెత్తువరకు.

ప్రయోగములు —(ఆ॥ పొ॥ ర.) దీనిని తేనెతో సేవించిన యెడల పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణి, జ్వరము, శ్వాస కాసలు, ప్లీహోదరములు హరించును.

(అ. భూ.) దీనిని ద్రాక్షపండ్ల రసముతోగాని, ద్రాక్షారిష్టముతోగాని సేవించిన రక్తహీనతవలన వచ్చు జ్వరములను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో తాళిసాదిచూర్ణము, ప్రవాళభస్మములను కలిపి తేనెతో సేవించిన క్షయ, శ్వాసకాసలు హరించును.

దీనిలో జసదభస్మము, కాసీససిందూరములను కలిపి తేనెతో సేవించిన పిల్లలకు కలుగు యకృత్ప్లీహవ్యాధులయందు అమోఘముగా పనిచేయును.

దీనినే రోహితకారిష్టముతో సేవించిన పెద్దలకు కలుగు యకృత్ప్లీహోదరములు, గుల్మములు తగ్గగలవు.

దీనిలో గోక్షురాదిచూర్ణము, సురాక్షార కాసీసములను కలిపి పునర్నవారిష్టముతో నుపయోగించిన పాండు, శోఫ, కామిలా వ్యాధులను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో కర్పూర శిలాజితుభస్మమును చేర్చి పటికబెల్లపు చూర్ణముతో సేవించిన అధిక సంభోగమువలన కలిగిన నరముల బలహీనత, శుక్రనష్టమును తగ్గించి బలమును కలుగచేయును.

## 84. సువర్ణ క్రవ్యాది

(క్రవ్యాది రసము)

వై॥ చి॥ (అజీర్ణ॥ ప్ర.)

శ్లో॥ అత్యర్థగురుమాంసాని గురు భోజ్యాన్యనేకశః
భక్షిత్వాకంఠపర్యంతం చతుర్వల్ల మిదం రసం
పట్వామ్ల తక్రసహితం పిబే త్తదను పానతః

క్షిప్రం వహ్నేర్యథేష్టం జాయతే దీపనం పరం
రసః క్రవ్యాదనామాయం ప్రోక్తఆశ్వ భైరవైః.

ద్రవ్యములు:—కాంతము, స్వర్ణము, తామ్రము, లోహము, రజితము, శంఖము వీనిభస్మములు, రసము, గంధకము, వెలిగారము, పంచలవణములు, మిరియాలు గలవు.

(ఈ యౌషధమునందు మిరియాలు ఎక్కువభాగముగా యున్నది.)

గుణము:—దీపనము, పాచనము, ఆమ్లపిత్తహరము, యకృత్ప్లీహ వికార హరము.

ప్రమాణము:— 1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని భోజనము చేసినపిమ్మట సైంధవలవణము కలిపిన పుల్లనిమజ్జిగతో సేవించిన గురువగు మాంస భక్ష్యములతో గూడిన ఆహారమును కంఠపర్యంతము భుజించిననూ వెంటనే ఆహారమును జీర్ణముచేసి తిరిగి ఆకలిని కలుగజేయును. (అనగా జీర్ణశక్తిని వృద్ధిచేయును)

(అ. భూ.) దీనిని మిరియాలు, పిప్పళ్ళ చూర్ణములను కలిపిన ద్రాక్షపండ్లరసముతో గాని, ద్రాక్షారిష్టముతోగాని సేవించిన ఆమ్ల పిత్తము, (పుల్లని త్రేనుపులు, గుండెలలో మంట మొదలగునవి) అజీర్ణములు హరించును.

దీనిని రోహితకారిష్టముతో సేవించిన ఉదరవ్యాధులు, యకృత్ప్లీహ వ్యాధులు హరించును.

అజమోదార్కముతోగాని, కర్పూరాద్యరిష్టముతో గాని సేవించిన నీళ్ళవిరేచనములు, అజీర్ణవిరేచనములు, తగ్గును.

ఈ ఔషధము అజీర్ణవ్యాధులయందు సంజీవివంటిది. దీనిని భోజనాత్పూర్వపరములయందు కూడా సేవించవచ్చును.

## 85. సువర్ణభూపతి

ఆ॥ ఔ॥ ర. (ప్రథమగుచ్ఛము)

శ్లో॥ క్షయంత్రిదోషజంహన్తి సన్నిపాతాంస్త్రయోదశ
ఆమవాతం ధనుర్వాతం శృంఖలావాతమేవచ.

ద్రవ్యములు:—రసము, గంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, కాంతభస్మము, సువర్ణభస్మము, వెండిభస్మము, నాభి.

గుణము:—క్షయహరము, సన్నిపాతజ్వరహరము, వాతహరము శోణితవర్ధనము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిలో పిప్పళ్ళచూర్ణమును కలిపి అల్లపురసముతో సేవించిన త్రిదోషక్షయలు, సన్నిపాతజ్వరములు, ఆమవాతము, ధనుర్వాతము, ఆఢ్యవాతము, పంగువాతము మొదలగు వాతవ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిని కటుకరోహిణిరసముతోగాని, అమృతారిష్టము తోగాని సేవించిన అష్టవిధ జ్వరములు, త్రయోదశ సన్నిపాతములు హరించును.

దీనిని త్రిఫలాకషాయముతోగాని, లోహాసవముతోగాని సేవించిన పాండు, కామిలావ్యాధులు తగ్గును.

రోహితకారిష్టముతో సేవించిన యకృత్ప్లీహవ్యాధులు తగ్గగలవు.

## 86. సువర్ణమాలినీ వసంతరసము

ఆ॥ ఔ॥ ర. (ప్రథమగుచ్ఛము)

శ్లో॥ జీర్ణజ్వరేధాతుగతేతిసారే రక్తాన్వితే రక్తభవేవికారే
ఘోరవ్యథే పిత్తభవేచదోషే వల్లద్వయం దుగ్ధయుతంచపథ్యమ్.

ద్రవ్యములు:—సువర్ణభస్మము, ముత్యభస్మము, ఇంగిలీకము, మిరియాలు, కఫరి.

గుణము:—ధాతుగతజ్వరహరము, జీర్ణజ్వరహరము, క్షయహరము, పిత్తహరము, బల్యము, గర్భపోషకము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిలో పిప్పళ్లచూర్ణమును కలిపి తేనెతో సేవించిన జీర్ణజ్వరము, ధాతుగతజ్వరములు, అతిసారము, పిత్తోద్రేకమైన బాధలు హరించును. మరియు ప్రదరవ్యాధులు, రక్తార్శస్సులు, విషమజ్వరములు, నేత్రవ్యాధులు హరించును.

దీనిని తెక్కలి పుష్పరసముతో గర్భిణీస్త్రీల కుపయోగించిన గర్భవికారములను తగ్గించి బలము కలుగచేయును.

(అ. భూ.) దీనికి సమముగా తిప్పసత్తును చేర్చి అమృతారిష్టముతో సేవించిన జీర్ణజ్వరములు, ధాతుగతజ్వరములు హరించును.

దీనికి సమముగా తవాక్షీరి, పిప్పళ్లు, యాలక్కాయలచూర్ణములను కలిపిగాని లేక సితోపలాది చూర్ణమునుగాని కలిపి చ్యవనప్రాశలేహ్యముతో సేవించిన క్షయలు, శుక్రనష్టము హరించును.

దీనిలో మహాద్రాక్షాది చూర్ణమును కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన బలహీనత, శుక్రనష్టము, అగ్నిమాంద్యములను పోగొట్టి బలమును కలుగచేయును.

## 87. సువర్ణవాతరాక్షసము

ఆ॥ ఔ॥ ర. [ప్రథమ గుచ్ఛము]

శ్లో॥ ఊరుంజానుకటీంసన్ధిం మూత్రపిణ్డాగతంచలమ్
అశీతివాతజాన్రోగాన్నాశయే న్నాత్రసంశయః
వాతరాక్షసనామాయం సువర్ణపదపూర్వకః.

ద్రవ్యములు:—సువర్ణము, సీసము, వంగము, లోహము, తామ్రము, కాంతము, రజతము, హేమమాక్షికము, వరాటము, శంఖము, అభ్రకము, వీట్లయొక్క భస్మములు, రసభస్మము, గంధకము, నాభి,

సేవాళములు, కస్తూరి, సైంధవలవణము, వెలిగారము, ఇంగిలీకము, తాళకము, మణిశిల యివి అన్నియు సమభాగములు.

గుణము:—వాతహరము, కఫహరము, శీతహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ। ఔ। ర.) దీనిని తేనెతో సేవించిన స్నాయువాతము, సూతికావాతము, కంపవాతము, పక్షవాతము, తొడలు సంధులు, కటిప్రదేశము, మూత్రపిండములయందు కలుగు వాతములు హరించును.

(అ. భూ.) దీనిని అశ్వగంధారిష్టముతో సేవించిన ధాతుక్షీణత వలన కలుగు కృశత్వము, వాతవ్యాధులు హరించును.

దీనికి సమభాగముగా కస్తూరి, గోరోజనము, పావుదారు మొదలగు చేదుకట్లను చేర్చి చిత్రమూల రసముతో మర్దించి పెసలువలె మాత్రలుచేసి వుపయోగించిన, సన్నిపాతజ్వరములు, మగత, శీతలము, యివి తగ్గి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును.

దీనిని చనుపాలతో నుపయోగించిన, శ్లేష్మప్రకోపము, అజీర్ణము, డొక్కలెగరవేయుట, బాలపాపచిన్నెలు (చంటిబిడ్డగుణము) హరించును.

## 88. సువర్ణసిందూరభూషణం

ఆ. ఔ. ర. (ప్రథమ గుచ్ఛము)

శ్లో॥ చత్వారింశత్త్రైత్తికాంశ్చప్రమేహానపిదుస్తరాన్
ప్రయోజ్యం సర్వరోగేషు గర్భిణీనాంవిశేషతః
సిందూరభూషణం నామ సువర్ణపదపూజితమ్.

ద్రవ్యములు:—సువర్ణభస్మము, ముత్యభస్మము, పగడభస్మము, అభ్రకభస్మము, గంధకము, వెలిగారము, రససిందూరము.

గుణము:—క్షయహరము, పిత్తహరము, బల్యము, గర్భిణీవికార హరము.

ప్రమాణము:—2 మొదలు 4 గ్రెయినుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో చాతుర్జాతకచూర్ణమును గాని, సితోపలాదిచూర్ణమునుగాని కలిపి తేనెతోగాని, వాసారిష్టముతో గాని, నుపయోగించిన, క్షయ, రక్తపిత్తము, పొడిదగ్గు హరించును.

దీనిలో తిప్పసత్తును చేర్చి యష్టిమధుక కషాయముతో సేవించిన కాళ్ళుచేతులు మంటలు, నోటిపూత, ఇంద్రియనష్టము, శ్వేతరక్తప్రదర ములు హరించును.

దీనిలో వేయించిన జీలకఱ్ఱ చూర్ణమునుగాని, మహాద్రాక్షాది చూర్ణమునుగాని కలిపి నిమ్మకాయరసము తేనెతోగాని, జంబీరాది రసాయనముతోగాని సేవించిన పైత్యవికారములు (అనగా తలతిరుగుట, కడుపులోమంట, త్రేనుపులు మొదలగునవి) తగ్గగలవు.

గర్భిణీ స్త్రీలు దీనిపైన వ్రాయబడిన అనుపానముతో సేవించి ద్రాక్షారిష్టమును త్రాగిన గుండెదడ, బలహీనము, వాంతులు, వేవిళ్ళు, తాపము, వీనిని తగ్గించి మంచిబలమును కలుగచేయును. మరియు గర్భస్థ శిశువునకుకూడా బలము కలుగజేయును.

## 89. సువర్ణ సూర్యావర్తి

(సూర్యావర్తి రసమనియున్నది.)

ర|| యో|| ర. 4 వ అధ్యా.

శ్లో|| యోజయేదనుపానేన, పైత్యరోగోపశాంతయే
సూర్యావర్తి రసోనామ, అశ్వినీదేవనిర్మితమ్.

ద్రవ్యములు:—స్వర్ణభస్మము, కస్తూరి, వెలిగారము, ఇంగిలీకము నాగకేస రములు, లవంగములు, శొంఠి, పమిడిపత్తిగింజలపప్పు, ఏలకులు, తిప్పసత్తు.

గుణము:—పిత్తహరము, హృద్యము, బల్యము, మేధ్యము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని తేనె కలిపిన అల్లపురసము తోగాని, మాదీఫలరసాయనముతోగాని సేవించిన అరోచకము. వాంతి, ఎక్కిళ్ళు, తలతిరుగుట, మొదలగు పైత్యవికారములు తగ్గును.

దీనిలో వేయించిన జీలకఱ్ఱచూర్ణమునుగాని, మహాద్రాక్షాది చూర్ణమునుగాని కలిపి ద్రాక్షపండ్ల రసముతోగాని ద్రాక్షారిష్టముతో గాని సేవించిన హృదయమునకు బలము కలుగచేసి గుండెదడ, నీరసము, కాళ్ళు చేతులు లాగుట, శుక్రనష్టము, నోటిపూత, అజీర్ణము వీనిని హరింపజేయును.

దీనిలో సరస్వతియాకుచూర్ణమును కలిపి తేనెతో సేవించి సారస్వతఘృతమును త్రాగిన అపస్మారము, మూర్ఛ, పిత్తవికారములు తగ్గును.

ఇది వాతకఫ తత్వములుగలవారికి ఎక్కువ ఉపయోగకారిగా యుండును.

## 90. సూతశేఖరరసము

యో॥ ర॥ (ఆమ్లపిత్త॥ ప్ర॥)

శ్లో॥ ... ... . పిత్తఘ్నో వాన్తి శూలామయాపహః
పంచగుల్మాన్పంచకాసా న్గ్రహణ్యామయ నాశనః
త్రిదోషోత్థాతి సారఘ్న శ్వాసమన్దాగ్ని నాశనః.

ద్రవ్యములు:—స్వర్ణము, తామ్రము, శంఖము వీట్ల భస్మములు, వెలిగారము, నాభి, త్రికటుకములు, ఉమ్మెత్తగింజలు, రసము, గంధకము చాతుర్జాతకములు, మారేడుగుజ్జు, కచోరాలు యివియన్నియు సమ భాగములు.

గుణము:—దీపనము, పాచనము, ఆమ్లశమనము, గ్రాహి.

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(యో. ర.) దీనిని చూర్ణించి దీనికి రెట్టింపు ఎత్తుగల తేనె, నెయ్యిలో కలిపి సేవించినయెడల ఆమ్లపిత్తము, వాంతి, శూల, పంచగుల్మములు, పంచకాసలు, గ్రహణ్యాతిసారములు, అగ్నిమాంద్యము మొదలగు వ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిలో దాడిమాష్టక చూర్ణమును కలిపి కుటజారిష్టముతో సేవించిన గ్రహణ్యాతి సారములు తగ్గును.

దీనిలో తాళిసాదిచూర్ణము, ప్రవాళ భస్మములను కలిపి తేనెతో సేవించిన ఆమ్లపిత్త ప్రధానముగా యుండు కాసశ్వాసలు, క్షయలు హరించును.

దీనిని ద్రాక్షారిష్టముతో సేవించిన పైత్యవికారమును తగ్గించి ఆకలిని కలుగచేయును.

## 91. సూతికాభరణరసము

ఆ॥ ఔ॥ ర.

భావయేత్సూచికాగ్రేణభక్షయే త్సూతికాగదే
ప్లీహాగుల్మోదరం పైత్యం గ్రహణీమతిసారకమ్
ధనుర్వాతం కంపవాతం హిక్కా_బధిరమూకతాః

ద్రవ్యములు:—అభ్రకము, స్వర్ణము, వైక్రాంతము, లోహము, తామ్రము, రజతము, సీసము, వంగము వీట్ల భస్మములు, నాభి, రసము, గంధకము, యివియన్నియు సమభాగములు. మరియు యిది చేప, అడవి పంది, తాబేలు, దున్నపోతు, నెమలి, త్రాచుపాము, కోడి, మేక, ఏనుగు, ఉడుము, గుజ్జము, పావురము, మొసలి వీట్ల పిత్తములతో భావనమర్దనలు చేయబడినది.

గుణము:—వాతహరము, కఫహరము, శీతహరము, సూతికా రోగహరము, హృద్యము, గర్భాశయశోధనము, సన్నిపాతజ్వరహరము.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిని సూదికొనకువచ్చినంత ఉపయోగించిన సూతికావ్యాధులు, ప్లీహవ్యాధులు, గుల్మము, ఉదర వ్యాధులు, పైత్యవ్యాధులు, గ్రహణ్యాతిసారములు, ధనుర్వాతము, కంప వాతము, ఎక్కిళ్ళు, చెముడు, మూగత్వము మొదలగు వ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిని సదాపాకు, త్రికటుకముల కషాయముతో సేవించిన సూతికావాతములు, సూతికాజ్వరములు, ఈ వ్యాధులయందు కలుగు కరపాదశీతలమును హరింపచేసి శరీరమునకు వేడిని కలుగజేయును.

దీనిని వాకుడువేళ్ళ రసముతో సేవించిన శ్వాసకాసములు, కంఠ గతశ్లేష్మము, ఆసన్నకాలమందు కంఠమునందేర్పడు కఫమును హరింపచేయును.

దీనిని జీరకాద్యరిష్టముతోగాని, అశోకారిష్టముతోగాని సేవించిన ప్రసవించినస్త్రీలకు రజస్సు (మైల) సరిగా ప్రవర్తింపకుండుటవలన కలుగు శూల, జ్వరము, శరీరమంతయు పోట్లను తగ్గించి రజస్సును జారీ చేయును. మరియు హృదయమునకు బలమును కలుగజేయును.

దీనికి సమానము, జున్ను, గోరోజనము, పావుదారు, రొయ్యిపీత, కస్తూరిని చేర్చి తమలపాకురసముతో మర్దించి మినపగింజలవలె మాత్రలు చేసి వానిని దశమూలారిష్టముతో నుపయోగించిన, సన్నిపాతజ్వరములు, కంఠగతశ్లేష్మములు, కరపాదశీతలములను హరింపచేసి శరీరమునకు ఉష్ణమును కలుగచేయును. మరియు సమస్త వాతరోగములయందును వాడవచ్చును.

N. B (ఆ। ఔ॥ ర.) దీనిని సేవించునప్పుడు ఇచ్ఛాపథ్యమును చేయవలెను. దీని సేవనచే తాపముకలిగినయెడల కొబ్బరికాయనీటిని, పెరుగుఅన్నమును సేవించవలెను. ఎక్కిళ్ళు కలిగినయెడల చల్లనినీటిని, చెరకురసమును త్రాగవలెను.

## 92. స్వచ్ఛంద భైరవి రసము

(స్వచ్ఛంద భైరవము)

బ॥ రా॥ (జ్వర॥ ప్ర.) 1వ. అధ్యా.

శ్లో॥ శీతజ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే
పీనసే చ ప్రతిశ్యాయే జ్వరేజీర్ణేతథైవచ.

ద్రవ్యములు:—రసము, నాభి, గంధకము, జాజికాయ, పిప్పళ్ళు.
గుణము:—దీపనము, పాచనము, జ్వరహారము, శ్లేష్మహారము.
ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(బ|| రా.) దీనిని తమలపాకు రసముతోగాని, అల్లపు రసముతోగాని, తుమ్మిపూల రసముతోగాని సేవించిన శీతజ్వరములు, సన్నిపాతములు, విషూచులు, విషమజ్వరములు, పీనసము, జీర్ణజ్వరములు హరించును.

(అ. భూ.) దీనిని వాముమాడ్చిన కషాయముతో చిన్నమోతాదుగా నుపయోగించిన పసిపిల్లలకు కలుగు కడుపుబ్బరము, అజీర్ణ విరేచనములు, నీళ్ళవిరేచనములు తగ్గును.

దీనిని కళింగరాష్ట్రిము, మిరియాలు, జీలకఱ్ఱ వీని రసముతో నుపయోగించిన శ్లేష్మప్రకోపము చిన్నపిల్లలకు కలుగు జలుబు, దగ్గు, ఒగర్పు, జ్వరము హరించును.

దీనిని చంటిబిడ్డలకు చనుపాలతో కలిపి వుపయోగించ వచ్చును.

## 93. స్వర్ణ వంగము

(దీనిని హేమసుందర రసము అని కూడా వ్యవహరింతురు)

ఆ|| ఔ|| ర. ప్రథమగుచ్ఛము.

శ్లో|| మూత్రకృచ్ఛ్రిం శుక్లమేహం ద్వివిధాప్రదరాంతథా
నాశయే త్విత్త్రరోగాం శ్చదాహం వైపాణి పాదయోః.

ద్రవ్యములు:—రసము, గంధకము, వంగము, నవాసాగరము.

గుణము:—రసాయనము, ఔపసర్గిక మేహహారము, వ్రణరోపణము, శామకము, ఉష్ణశమనము, పిత్తహారము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగిజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో లవంగములు, జీలకఱ్ఱ చూర్ణములను సమానముగ చేర్చి దానిని పంచదార నేతితోగాని, పంచదార వెన్నతోగాని సేవించిన సమస్త ప్రమేహములు, ధాతునష్టము, హరించి శరీరమునకు బలము కలుగచ్చేయును.

దీనిలో కర్పూర శిలాజితు భస్మము, చందనాది చూర్ణములను కలిపి చందనాసవముతోగాని, బియ్యపు కడుగుతోగాని సేవించిన గనే

రియా వ్యాధులయందు కలుగు చురుకు, మంట, పోట్లు మొదలగు బాధ లను హరింపచేయును.

దీనిలో శాల్మలీచూర్ణమును కలిపి పేరిననెయ్యి, పంచదారతో సేవించిన స్త్రీలకు కలుగు ప్రదరవ్యాధులు తగ్గును.

చలవమిరియాలు, చందనము వీట్ల చూర్ణమును ఔషధమునకు రెట్టింపు చేర్చి పల్లేరువేరురసముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, శెగరోగము, శుక్రమేహములు హరించును.

దాల్చినచెక్క, ఏలకులు, జీలకఱ్ఱ, ఆకుపత్రి, లవంగములు, సుగంధిపాల, తిప్పసత్తు వీనిని సమభాగములుగ గ్రహించి మృదు చూర్ణము చేసిన దానిని ఔషధమునకు సమముగా చేర్చి దానిని నేతితోగాని, తేనెతోగాని, పంచదారతోగాని సేవించిన శుక్రమేహము నోటిపూత, కాళ్ళు చేతులు మంటలు తగ్గును.

## 94. స్వర్ణవంగసిందూరము

ఈ ఔషధము స్వర్ణవంగము వండునప్పుడు కుప్పెపైభాగమున పట్టు సిందూరము

గుణము:—జ్వరహరము, రసాయనము, శుష్కకాసహరము, ఉష్ణశమనము.

ప్రమాణము:—2 మొదలు 4 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:-(అ. భూ.) దీనిలో సుగంధిపాలచూర్ణమును గాని, అశ్వగంధాదిచూర్ణమునుగాని కలిపి తేనెతో సేవించిన రక్తగత, చర్మగత రోగములను హరింపచేయును.

దీనిలో తిప్పసత్తును కలిపి అమృతారిష్టముతో నుపయోగించిన సామాన్య జ్వరములు, జీర్ణజ్వరములుతగ్గును.

మహాద్రాక్షాదిచూర్ణమును కలిపి నేతితో నుపయోగించిన శరీరమందుండు ఉష్ణాధిక్యతను తగ్గించి, నోటిపూత, మూత్రమునందు మంట మూత్రమునందువీర్యము పోవుటను తగ్గించును. మరియు స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములను తగ్గించును.

దీనిని నెయ్యి పంచదారతో సేవించిన శుష్క కాసలు (అనగా పొడిదగ్గులు) హరించును.

## 95. హుతాశనరసము

ఆ॥ ఔ॥ ర. (ప్రథమగుచ్ఛము)

శ్లో॥ గుల్మారోచకజారరాగ్ని సదనాజీర్ణం విషూచింకఫమ్
జాడ్యం శీర్ష సముద్భవంచకసనం ముద్గప్రమాణావటీ.

ద్రవ్యములు:—రసము, గంధకము, వెలిగారము, గవ్వభస్మము, శంఖభస్మము, నాభి, కరిదూపము, మిరియాలు.

గుణము:—దీపనము, పాచనము, కఫహరము, మరియు యిది దగ్గులను, జ్వరములను హరింపచేయును.

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(ఆ॥ ఔ॥ ర.) దీనిని అల్లపురసముతో సేవించినయెడల గుల్మము, అరోచకము, అగ్నిమాంద్యము, అజీర్ణము, విషూచి, కఫము, శిరోరోగములు, దగ్గు మొదలగువ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిని తేనెచేర్చిన తమలపాకురసముతో నుపయోగించిన పసిపిల్లలకు కలుగు జలుబు, దగ్గు, ఒగర్పులను హరింపచేయును.

దీనిని వాముురసముతో నుపయోగించిన శూలవ్యాధులు, క్రిమిరోగములు, అజీర్ణమువలన కలుగు కడుపుబ్బరములు తగ్గును.

ఇది పసిపిల్లలకు కలుగు అజీర్ణవ్యాధులయందు బాగుగా పనిచేయును.

## 96. హింగుళోత్థ రససిందూరము

వై॥ యో॥ ర.

ద్రవ్యములు:—ఇంగిలీకము, గంధకము.

గుణము:—దీపనము, బల్యము, జ్వరఘ్నము, ఔపసర్గిక రోగహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని ఉదయమున గుమ్మపాలతో (అనగా పాలుపితికిన వెంటనే నురుగు తగ్గకుండా యుండుపాలు)గాని మహాద్రాక్షాది చూర్ణమును కలిపి వెన్నపూస పంచదారతోగాని సేవించిన అగ్నిదీప్తిని కలుగచేసి రక్తక్షీణత, శుక్రనష్టము, క్షీణత్వమును పోగొట్టి బలము పుష్టిని కలుగచేయును.

దీనిలో త్రికటుచూర్ణమును కలిపి శారిబాద్యరిష్టములోగాని, ఖదిరారిష్టములోగాని సేవించిన ఫిరంగరోగము (సవామేహము)లు, శుక్రనష్టము, శరీరశుష్కము (ఎండిపోవుట లేక నిక్కుక) లను తగ్గించి బలము కలుగచేయును.

## 97. క్షయ కుఠారము

ఆ॥ భై॥ ర॥ (ప్రథమ గుచ్ఛము)

శ్లో॥ క్షయం క్షయకృతాన్ వ్యాధీనస్థిగజ్వరకంతథా
వాతం పిత్తం హరేచ్చైవపాణ్డుం గుల్మం కఫం హరేత్
సద్యః క్షయకుఠారోయం, పూజ్యపాదేన నిర్మితః.

ద్రవ్యములు:—రసము, గంధకము, నాభి, అభ్రకము, తామ్రము, గవ్వలు, పగడము, వెండి, లోహము, మాండూరము, హేమమాక్షికము, సీసము, తగరము, ముత్యము, కాంతము, వీట్ల యొక్క భస్మములు, వెలిగారము యివియన్నియు సమభాగములు.

గుణము:—క్షయహరము, అస్థిగత జ్వరహరము, వాతహరము, పిత్తహరము, శోణితవర్ధనము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో చాతుర్జాతక చూర్ణమును, తవాక్షీరిని, ఔషధమునకు సమభాగములుగా కలిపిగాని సితోపలాది చూర్ణమును కలిపిగాని అడ్డసరము కషాయములో సేవించిన క్షయ, కాసశ్వాసలు, రక్తపిత్తము, హరించును.

దీనిలో తిప్పసత్తు సుదర్శన చూర్ణములను కలిపి తిప్పతీగె కషాయముతోగాని, అమృతారిష్టముతోగాని సేవించిన అస్థిగత జ్వరములు, పురాణ జ్వరములు హరించును.

దీనిలో తాళీసాదిచూర్ణమును కలిపి లోహాసవముతో సేవించిన పాండు, శోఫ, కామిలావ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిచేయును.

కర్పూరశిలాజితు భస్మమును కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన పిత్తవికారములు తగ్గును.

---

# భస్మములు

## 98. అభ్రక భస్మము

(శతపుటి)

ర॥ ర॥ స॥ (పూర్వ॥ ఖం॥) 2 వ॥ అధ్యా.

శ్లో॥ గౌరీ తేజః పరమ మమృతం వాతపిత్తక్షయఘ్నం
ప్రజ్ఞాబోధి ప్రశమితిరుజం వృష్యమాయుష్యవ(క్ర)్యం.

గుణము:—జ్వరహరము, క్షయహరము, రక్తవృద్ధికరము, ప్రమేహ హరము, వృష్యము, ఉష్ణశమనము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ ర॥ స॥) దీనిలో వాయువిడంగముల చూర్ణము, త్రికటుచూర్ణములను కలిపి నెయ్యితో సేవించిన క్షయ, పాండు, గ్రహణి, శూల, ప్రమేహము, కాసరోగములు మొదలైన వ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి అమృతారిష్టముతో సేవించిన జీర్ణ జ్వరములు హరించును.

దీనిలో మంచిముత్య భస్మమును గాని పగడభస్మమునుగాని కలిపి

వాసారిష్టముతో సేవించిన రక్తపిత్తములు, రక్తపిత్తముతో కూడిన క్షయలు, ఉరఃక్షతము, శ్వాసకాసలు నివర్తించును.

దీనికి సమము కాంతభస్మమునుగాని, లోహభస్మమునుగాని కలిపి తేనెతో సేవించి పునర్నవారిష్టమును త్రాగిన యెడల శోఫ, పాండు వ్యాధులను హరించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో తంగేడు పంచకచూర్ణమును కలిపి నేరేడుగింజల కషాయముతో సేవించిన అతిమూత్రము, మధుమేహము, మొదలగు ప్రమేహ వ్యాధులు హరించును.

దీనిలో కర్పూరశిలాజితుభస్మము, మహాద్రాక్షాది చూర్ణములను కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన ఉష్ణాధిక్యత (అనగా కళ్ళుమంటలు, మూత్రమునందు మంట మొదలగునవి)ను, పైత్యోద్రేకములను తగ్గించి శరీరమునకు బలమును కాంతిని కలుగజేయును.

దీనికి సమము రజిత భస్మమును కలిపి అశ్వగంధాది లేహ్యముతో సేవించిన వీర్యవృద్ధిని కలుగచేయును.

దీనిలో స్వర్ణమాక్షిక భస్మము, కర్పూరశిలాజితు భస్మములను కలిపి తేనెతో సేవించిన నోటిపూత, నీరసము, కాళ్ళుతీతలను హరింపజేయును.

దీనిలో వంగభస్మము, యష్టిచూర్ణములను కలిపి బబ్బులారిష్టముతో సేవించిన శ్వేతరక్తప్రదరములు హరించును.

## 99. అమృతీకరణాభ్రక భస్మము

ర॥ ర॥ స। (పూ॥ ఖం.) 2వ అధ్యా.

శ్లో॥ తదేవజీర్ణమాదాయ సర్వరోగేషు యోజయేత్
అనుపానం వినాహ్యభ్రం జరామృత్యురుజాపహం
యోజయేదనపానైర్వా తత్తద్రోగహరం పరం.

ద్రవ్యములు:— అభ్రక భస్మము, ఆవునెయ్యి, త్రిఫలా కషాయము (గుణములు, ప్రమాణము, ప్రయోగము లన్నియు అభ్రక భస్మమునకు వ్రాయబడిన విధముగానే వుపయోగించుకొనవలెను.)

## 100. కర్పూర శిలాజితు భస్మము

భస్మప్రకాశిక (కృష్ణ పండితీయము)

శ్లో॥ మూత్రకృచ్ఛ్రాశ్మరీ మేహ కామలాపాండు నాశనమ్.

గుణము:—ఉష్ణశమనము, వస్తిశోధనము, మూత్రలము, మూత్ర కృచ్ఛ్రహరము.

ప్రమాణము:— 2 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనితో అభ్రక భస్మమును కలిపి వెన్న పూస, పంచదారతో సేవించిన ఉష్ణోద్రేకమువలన కలుగు కళ్ళు మంటలు, తలనొప్పి మొదలగు బాధలను నివర్తింప జేయును. మరియు శ్వేత రక్తప్రదరములను కూడా తగ్గించును.

దీనిలో స్వర్ణవంగమును కలిపి నేల ఉసిరిక రసముతో సేవించిన యెడల వస్తియందుండు పుండు (గనేరియా) నుమాన్పును.

దీనిలో గోక్షురాది చూర్ణమును కలిపి సేవించిన మూత్రమును జారీచేసి మూత్రకృచ్ఛ్రమును నివర్తింపజేయును.

దీనిని రజితచంద్రోదయము, పూర్ణచంద్రోదయములయందు అనుపానముగా చేర్చుకొని సేవించవచ్చును.

## 101. కాంతాభ్రక సిందూరము

భస్మప్రకాశిక (కృష్ణ పండితీయము)

శ్లో॥ పాండుశ్శోఫోదరా నాహ గ్రహణీ శోష కాసజిత్
క్షతం సతతంచైవ పురాణం విషమం జ్వరం.

ద్రవ్యములు:—కాంతము, అభ్రకము.

గుణము:—హృద్యము, రక్తవృద్ధికరము, జ్వరహరము, వృష్యము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు;—(భ. ప్ర.) దీనిలో త్రికటుచూర్ణమునుగాని, త్రిఫలాచూర్ణమును గాని కలిపి తేనెతో సేవించిన పాండు, నంజు,

ఉదరవ్యాధి, ఆనాహము, శ్వాసకాసలు, సంతత, సతత, పురాణ, విషమ జ్వరములు హరించును.

(అ. భూ.) దీనిలో మహాద్రాక్షాది చూర్ణము, శృంగభస్మములను కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన హృదయమునకు బలము కలుగచేయును.

తాళీసాదిచూర్ణమును కలిపి లోహాసవముతో సేవించిన పాండు, శోఫలను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో సీసభస్మమును కలిపి నేతితో సేవించిన కాళ్లుచేతుల యందు, సర్వాంగములయందు కలుగు తిమ్మెరలు, వీర్యనష్టము, కాళ్లు చేతులయందు కలుగు మంటలు, హృదయతాపమును నివర్తింపజేయును.

దీనిలో తిప్పసత్తు, సుదర్శన చూర్ణములను కలిపి తేనెతో సేవించిన విషమజ్వరములు, పురాణ జ్వరములు హరించును.

అశ్వగంధాదిచూర్ణమును కలిపి కూష్మాండ లేహ్యముతో సేవించిన వీర్యవృద్ధిని కలుగజేయును.

## 102. కాసీస సిందూరము

భ॥ ప్ర (కృష్ణ పండితీయము)

శ్లో॥ వాతశ్లేష్మహరం కేశ్యం నేత్ర్యం కణ్డూవిషప్రణుత్
మూత్రకృచ్ఛ్రాశ్మరీ శ్విత్రనాశకం పరికీర్తితమ్.

గుణము:—దీపనము, రక్తశోధనము జ్వరహరము, వాతశ్లేష్మ హరము, యిది యకృత్ప్లీహ వ్యాధులను, కామిలా, పాండు వ్యాధులను హరించును.

ప్రమాణము:— 2 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో త్రికటు చూర్ణమును కలిపి తేనెతో సేవించిన అజీర్ణములను హరింపజేసి దీపనశక్తి (ఆకలి)ని కలుగ జేయును.

దీనిలో కాంతవల్లభరసమును కలిపి తేనెతో సేవించిన పాండు శోఫలను తగ్గించి మంచిరక్తమును కలుగచేయును.

దీనిలో బాలచంద్రోదయము, జసదభస్మములను కలిపి సేవించిన యకృత్ల్పీహ వ్యాధులను హరింపజేయును.

ఇది పిల్లలకు కలుగు యకృత్ల్పీహ వ్యాధులయందు అమోఘముగా పనిచేయును.

దీనిలో అశ్వగంధాది చూర్ణమును కలిపి ఖదిరారిష్టముతో సేవించిన చర్మరోగములు, శ్విత్రము (బొల్లి) తగ్గగలవు.

దీనిలో త్రిఫలా చూర్ణమును కలిపి నేతితో సేవించిన వ్రణములు నోటిపూత, రక్తదోషములు నివర్తించును.

దీనిని అశోకారిష్టముతోగాని, నల్లఉలవకషాయముతోగాని సేవించిన స్త్రీలకు కలుగు ఋతుబద్ధవ్యాధులను పోగొట్టును.

## 103. కాంత భస్మము

ర॥ ర॥ స॥ (పూర్వ ఖండం) 5 వ అధ్యాయము.

శ్లో॥ కాంతాయోతి రసాయనోత్తరతరం స్వస్థే చిరాయుః ప్రదం
స్నిగ్ధం మేహహరం త్రిదోషశమనం శూలామయూలాపహం
గుల్మప్లీహ యకృత్ క్షయామయహరం పాండూదర వ్యాధినుత్.

గుణము:—రక్తవృద్ధికరము, క్షయహరము, వృష్యము, ప్రమేహహరము, మరియు గుల్మవ్యాధులు, యకృత్ల్పీహ వ్యాధులు, పాండు, ఉదరవ్యాధులను హరింపజేయును.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ ర॥ స॥) దీనిలో త్రికటుకములు, వాయువిడంగముల చూర్ణములను కలిపి నెయ్యి లేక తేనెతో సేవించిన రక్తమును వృద్ధిజేసి శరీరకాంతిని కలుగచేయును. మరియు క్రిమిరోగములు పాండువు, రాజయక్ష్మ, గరదోషములు గుల్మప్లీహములు, త్రిదోషవికారములు, మొదలగు రోగములను హరింపజేయును.

(అ. భూ.) దీనిలో గోక్షురాది చూర్ణమును కలిపి పునర్నవా రిష్టముతో సేవించిన పాండుశోఫలను తగ్గించును మరియు తిమిరవాతము లను కూడా హరింపజేయును.

దీనిలో మహాద్రాక్షాది చూర్ణమును కలిపి ద్రాక్షారిష్టముతో సేవించిన వీర్యవృద్ధిని కలుగజేయును. మరియు స్త్రీలకు వంధ్యాదోష మును హరింపచేసి పుత్రసంతతి కలుగునట్లు జేయును.

దీనిలో త్రిఫలాచూర్ణము, శంఖభస్మములను కలిపి రోహితకా రిష్టముతో సేవించిన గుల్మవ్యాధులు, శోఫలు, శూలవ్యాధులు ప్రమేహ వ్యాధులు హరించును.

దీనిలో తిప్పసత్తు, సితోపలాది చూర్ణములను కలిపి పటిక బెల్లము చూర్ణము వెన్నతో సేవించిన క్షయవ్యాధులయందు కలుగు రక్తహీనత, శోఫలను నివర్తింపజేసి రక్తమును వృద్ధిచేయును.

## 104. గంధక భస్మము

ర॥ ర॥ స॥ (పూ॥ ఖం॥) 3 వ అధ్యాయము.

శ్లో॥ కండూకుష్ట విసర్ప దద్రుదళనో దీప్తానలః పాచనః
ఆమోన్మోచన శోషణో విషహార సూ్తేంద్ర వీర్యప్రదః.

గుణము:—త్వచ్యము, రక్తదోషహరము, క్రిమిహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ ర॥ స॥) దీనితో సమానముగ మిరియాల చూర్ణమును, గంధకభస్మమునకు 6 రెట్లు త్రిఫలా చూర్ణమును కలిపి శేలవేరు గంధముతో సేవించుచూ శేలవేరును నీళ్ళతో నూరి శరీరము నకు లేపనము చేయుచున్న యెడల కుష్టువ్యాధులు హరించును.

(అ. భూ.) దీనిలో అశ్వగంధాది చూర్ణమును కలిపి నేతితో సేవించుచూ ఖదిరారిష్టమును త్రాగిన యెడల కురుపులు, విసర్పి, కుష్టము మచ్చలు, వ్రణములు, హరించును.

దీనిని త్రిఫలాచూర్ణమునందు కలిపి తేనెతో సేవించిన క్రిమి వ్యాధులు, చర్మగతరోగములు తగ్గును.

## 105. గంధకపుష్పము

భై॥ ప్ర॥ (కృష్ణ పండితీయం)

ద్రవ్యములు:—ఆముదము, గంధకము.

గుణము:—రక్తశుద్ధికరము, త్వచ్యము, వ్రణరోపణము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—దీనిని జీలకఱ్ఱ, ధనియాల రసముతోగాని. పంచదారతోగాని సేవించిన సవాయివ్యాధులు కుష్టము, భగందరము, సమస్త చర్మవ్యాధులు, రక్తవ్యాధులు హరించును.

దీనిలో అశ్వగంధాది చూర్ణమును కలిపి ఖదిరారిష్టముతో సేవించిన కుష్టము, శ్విత్రము (బొల్లి) విసర్పి, భగందరము, కొరుకుడు మొదలగు రక్తదోషములు, చర్మరోగములు నివర్తించును.

దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి శారిబాద్యరిష్టముతో సేవించిన దురదలు, గజ్జి, తామర, మచ్చలు, మూగతీట, మొదలగు చర్మరోగములను నివర్తింపజేసి సుఖవిరేచనము కలుగచేయును.

## 106. గైరికభస్మము

ర॥ ర॥ స॥ (పూ॥ ఖం॥) 3 వ॥ అధ్యా.

శ్లో॥ స్వాదుస్నిగ్ధం హిమం నేత్ర్యం కషాయం రక్తపిత్తనుత్
హిధ్మావమి విషఘ్నంచ రక్తఘ్నం స్వర్ణగైరికం.

గుణము:—రక్తపిత్తహరము, ఉష్ణశమనము, పిత్తహరము.

ప్రమాణము:— 1/16 తులము మొదలు 1/4 తులమువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో కర్పూరశిలాజితుభస్మము కలిపి ద్రాక్షారిష్టముతోగాని, శారిబాది రసాయనముతోగాని

సేవించిన ఉష్ణాధిక్యత (అనగా కళ్ళు మంటలు, తలనొప్పి, మూత్రము నందు మంట మొదలగునవి)ను తగ్గించును.

దీనిలో అభ్రక భస్మమును కలిపి వెన్నపూస పంచదారతో సేవించిన రక్తపిత్తములు, శ్వేతరక్తప్రదరములు హరించును.

## 107. తా మ్ర భ స్మ ము

ర॥ ర॥ స॥ (పూ॥ ఖం.) 5 వ అధ్యా.

శ్లో॥ శ్వాసం కాసం క్షయంపాండుం అగ్నిమాంద్యమరోచకం
గుల్మప్లీహా యకృన్మూర్ఛాశూలం పక్తిసంజ్ఞికం.

గుణము:—దీపనము, శ్వాసకాసహరము, రక్తవృద్ధికరము, శూలహరము, మరియు యకృత్ప్లీహారోగములు, గుల్మము, మూర్ఛలను హరింపజేయును.

ప్రమాణము:—1 మొదలు 3 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర॥ ర॥ స.) దీనిలో పిప్పలిచూర్ణమును కలిపి తేనెతో సేవించిన శ్వాసకాసలు, క్షయ, పాండు, అగ్నిమాంద్యము గుల్మము, యకృత్ప్లీహవ్యాధులు, శూలలు హరించును.

(అ. భూ.) దీనిలో వరాటభస్మమును కలిపి తేనెతో సేవించిన ఉదరశూలలు, అజీర్ణములను హరింపజేసి జీర్ణశక్తిని కలుగజేయును.

దీనిలో త్రికటుచూర్ణమును కలిపి తేనెతో సేవించిన దారుణ కఫములు, శ్వాసకాసలు హరించును.

దీనిని పునర్నవారిష్టముతో సేవించిన కామిల, పాండు, శోఫలను హరింపచేసి రక్తమును వృద్ధిచేయును.

## 108. తారమాక్షిక భస్మము

ర॥ ర॥ స॥ (పూ॥ ఖం॥) 2 వ అధ్యా.

గుణములు, ప్రమాణము, ప్రయోగములన్నియు హేమమాక్షిక

భస్మమునకు వ్రాయబడిన విధముగానే వుపయోగించుకొనవలెను. మరియు యిది రజితముయొక్క గుణములను కలిగియుండును.

కొందరు రజతభస్మమునకు బదులు దీనిని వాడుదురు.

## 109. తాళక భస్మము

భ॥ ప్ర॥ (కృష్ణ పండితీయము)

శ్లో॥ గలత్కుష్ఠం పుండరీకం, శ్విత్రం కాపాలికం తథా
ఔదుమ్బరం ఋష్యజిహ్వాం కాకణం స్ఫోటముల్బణమ్.

గుణము:—స్రోతశ్శోధనము, కుష్ఠహరము, కాసశ్వాసహరము.

ప్రమాణము:— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో అశ్వగంధాది చూర్ణమునుగాని, త్రిఫలాచూర్ణమునుగాని కలిపి, గానుగవేరు పట్టరసముతోగాని, ఖదిరారిష్టముతోగాని సేవించిన సమస్త కుష్ఠువ్యాధులు, శ్విత్రము (బొల్లి) వాతరక్తము, గజ్జి, భగందరము, వ్రణములు హరించును.

దీనిలో శృంగభస్మము, ప్రవాళభస్మములను కలిపి వెన్నపూసతో సేవించిన శ్వాసకాసలు, మేఘరంజి, ఉబ్బసము, మొదలగువానిని నిమిషములమీద తగ్గించి సుఖమును కలుగజేయును.

దీనిని త్రికటు చూర్ణమునందు కలిపి తేనెతో సేవించిన స్రోతస్సుల యందుండు దోషములను బైటికి త్రోసివేసి స్రోతస్సులను శుభ్రపరచును.

దీనిని కటుకరోహిణి రసముతో సేవించిన శీతజ్వరములు విషమ జ్వరములు తగ్గును.

## 110. త్రివంగ భస్మము

భ॥ ప్ర॥ (కృష్ణపండితీయము)

ద్రవ్యములు:—సీసము, వంగము, జసదము.

గుణము:—ప్రమేహహరము, ప్రదరరోగహరము, యకృత్ప్లీహోదరహరము పూయమేహఘ్నము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో తిప్పసత్తు, త్రిఫలాచూర్ణ ములను కలిపి చందనాసవముతో సేవించిన ప్రమేహములు, మూత్ర కృచ్ఛ్రము హరించును.

దీనిలో కర్పూరశిలాజితు భస్మమునుజేర్చి వెన్నపూస పంచదా రతో సేవించిన పూయమేహము (గనేరియా) తగ్గును. మరియు దీనిని సేవించుచూ బబ్బులారిష్టమును త్రాగినయెడల శ్వేత, రక్తప్రదరములు హరించును.

దీనిలో కాసీససిందూరము, శంఖభస్మములను కలిపి రోహీతకా రిష్టముతో సేవించిన యకృత్ప్లీహోదరములు నివర్తించును.

## 111. నా గ (సీసము) భ స్మ ము

ర॥ ర॥ స. (పూ॥ ఖం.) 5 వ॥ అధ్యా.

శ్లో॥ అత్యుష్ణం సీసకం స్నిగ్ధం తిక్తం వాతకఫాపహం
ప్రమేహ తోయదోషఘ్నం దీపనం చామవాతనుత్.

గుణము:—వాతహరము, కఫహరము, ప్రమేహహరము, రక్త వృద్ధికరము, ప్రదరరోగహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిని వెన్నపూసతో సేవించిన వాతవ్యాధులు, సమస్తకఫవ్యాధులు, క్షయ, సమస్తమూత్రవ్యాధులు, పాండువు, కాస, గ్రహణి, క్రిమిరోగములు ప్రదరవ్యాధులు హరించును మరియు వీర్యపుష్టిని కలుగజేయును.

(అ.భూ.) దీనిని తేనేతో సేవించుచూ రాస్నాది కషాయమును త్రాగినయెడల సమస్త వాతవ్యాధులు హరించును.

దీనిలో సితోపలాదిచూర్ణము, ప్రవాళభస్మములను కలిపి వాసా రిష్టముతో సేవించిన కాసశ్వాసలు, క్షయలు మొదలగు కఫవ్యాధులు హరించును.

తంగేడుపువ్వుచూర్ణము, త్రిఫలాచూర్ణములను కలిపి నేరేడుగింజల కషాయముతో సేవించిన సమస్తప్రమేహవ్యాధులు మూత్రవ్యాధులు హరించును.

ద్రాక్షారిష్టముతో సేవించిన రక్తవృద్ధిని, వీర్యవృద్ధిని కలుగజేయును.

దీనిలో శంఖభస్మమును కలిపి వాముర సముతోగాని, అజమోదార్క (వాంవాటరు)తోగాని సేవించిన సమస్తశూలలు, గుల్మములు హరించును.

దీనిలో తిప్పసత్తునుచేర్చి వెన్న పంచదారతో సేవించి బబ్బులారిష్టమును త్రాగినయెడల స్త్రీలకుకలుగు కుసుమరోగములు నివర్తించును.

## 112. ప్రవాళ పంచామృత భస్మము

(ప్రవాళ పంచామృతరసః)

యో॥ ర॥ (ద్వితీయ సంపుటము) గుల్మరోగాధి కారము.

శ్లో॥ ఆనాహగుల్మోదరప్లీహ కాస శ్వాసాగ్ని మాన్ద్యా వ్కఫమారుతోత్థాత్
అజీర్ణముద్గార హృదామయఘ్నం।గ్రహణ్యతిసార వికారనాశనమ్.

ద్రవ్యములు:-పగడము, ముత్యము, శంఖము, ముత్యపుచిప్పలు, గవ్వలు.

గుణము:-పాచనము, గుల్మోదరహరము, కఫహరము, క్షయహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో హింగ్వష్టక చూర్ణమును కలిపి కుమార్యాసవముతో సేవించిన సమస్త గుల్మములు యకృత్ప్లీహోదరములు, హరించును.

దీనిని తేనెతో సేవించిన అజీర్ణము, ఆనాహము, త్రేనుపులధికముగ వచ్చుట తగ్గును.

దీనిలో సితోపలాది చూర్ణమును కలిపి వాసారిష్టముతో సేవించిన శ్వాసకాసలు, క్షయలు, కఫవ్యాధులు తగ్గును.

దీనిని చ్యవనప్రాశలేహ్యము నందు కలుపుకొని సేవించిన క్షయలు,

శ్వాసకాసలు, తగ్గుటయేకాక దంతములు, ఎముకలు, వీనికి సంబంధించిన వ్యాధులయందు చక్కగా పనిచేయును.

## 113. ప గ డ భ స్మ ము

వై॥ చిం॥ (శుద్ధి॥ ప్ర.)

శ్లో॥ ప్రవాళం రక్తపిత్తఘ్నం రక్తాతిసారనాశనం
ప్రదరం రక్తశూలఘ్నం గ్రాహిపైత్తవినాశనం॥ వై. చిం.
క్షయపిత్తాస్రకాసఘ్నం దీపనం పాచనం లఘు
విషభూతాదిశమనం విద్రుమం నేత్రరోగనుత్. (ర. ర. స.)

గుణము:—క్షయహరము, కఫహరము, రక్తపిత్తహరము, దీపనము, పాచనము, గ్రాహి.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజలఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో సితోపలాదిచూర్ణమును కలిపి తేనెతోగాని, వెన్నపూసతోగాని సేవించిన క్షయ, మిక్కుటమగు దగ్గు, శ్వాసకాసలు మొదలగు కఫవ్యాధులను హరింపచేసి స్రోతస్సులను శుభ్రపరచును.

దీనిలో లాక్షాచూర్ణమునుగాని, మహాద్రాక్షాదిచూర్ణమును గాని కలిపి వాసారిష్టముతో సేవించిన రక్తపిత్తములు, రక్తాతిసారములు హరించును.

దీనిని తేనెకలిపిన తులసియాకు రసముతో చిన్నపిల్లల కుపయోగించిన గొంతుకలోకలుగు, గురక, దగ్గు తగ్గును.

తాంబూలమునందు సున్నమునకుబదులు దీని సేవించిన శ్వాసకాసలు, అగ్నిమాంద్యము హరించును.

దీనిని కొన్నిరోజులపాటు తేనెతో సేవించిన శరీరమునందు సున్నపు (Calcium) భాగము తక్కువగుటవలన కలుగు నేత్రరోగములను హరింపజేయును.

114. పగడభస్మము No 2 } ఈ రెంటికి పగడభస్మమునకు వ్రాయ
115. ప్రవాళభస్మము (చూర) } బడిన అనుపానములనే వాడవచ్చును.

## 116. ముత్యభస్మము

రసప్రదీపిక (3 వ అధ్యా)

తే॥ మౌక్తికము సేవజేసిన మానవులకు । నాయురారోగ్యకరము వీర్యాభివృద్ధి
దీపనముగల్గి రక్తపైత్య క్షయాది । దోషములబాపి పుష్టియు దృష్టినొసగు.

గుణము:—క్షయహరము, రక్తపిత్తహరము, వృష్యము, బల్యము, నేత్ర్యము దీపనము.

ప్రమాణము:—క్రీ మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని వెన్నతోగాని తేనెతోగాని సేవించిన క్షయ, రక్తపిత్తము, కాసశ్వాసలు, దాహము, నేత్రరోగములను, హరింపజేయును. మరియు బలమును, వీర్యవృద్ధిని, ఉత్సాహమును కలుగజేయును.

(అ. భూ.) దీనిలో సితోపలాది చూర్ణమునుగాని, తాళిసాది చూర్ణమునుగాని కలిపి వెన్న, పంచదారతోగాని తేనెతోగాని సేవించిన క్షయ, శ్వాసకాసలు, ఊపిరితిత్తులయందు కలుగురోగములు, బలహీనమును, హరింపజేయును.

దీనిని చ్యవనప్రాశలేహ్యమునందు కలుపుకొని సేవించిన క్షయ, ఉబ్బసము, దగ్గు, మొదలగు ఊపిరితిత్తులకు సంబధించిన రోగములను హరింపజేసి శరీరమునకు స్నిగ్ధత్వమును, బలమును, వీర్యవృద్ధిని, ఉత్సాహమును కలుగజేయును. మరియు రసాయనముగా పనిచేయును.

దీనిని వెన్నపూసతో సేవించి అడ్డసరపాకుల రసమునుగాని వాసారిష్టమునుగాని త్రాగుచుండిన రక్తపిత్తము, రక్తప్రదరము, క్షయ, ఉరఃక్షతములు హరించును.

మరియు దీనిని క్యాల్షియం (Calcium) లోపించుట వలన

కలుగు వ్యాధులనన్నిటియందును పై అనుపానములతో నుపయోగించిన ఎక్కువ గుణకారిగాయుండును (Superior calcium)

## 117. ముత్యభస్మము
## No. 2

దీనికికూడా ముత్యభస్మమునకు వ్రాయబడిన అనుపానములనే వాడవచ్చును.

## 118. మాండూర భస్మము

వై॥ చిం॥ (శుద్ధి॥ ప్ర॥)

శ్లో॥ కిట్టంకషాయం శిశిరం పాణ్డుశ్వయథుశోఫజిత్
హలీమకం కామలాంచ హరతే కుంభకామలామ్.

**గుణము:**—శోఫహరము, శోణితవర్ధనము, శూలహరము.

**ప్రమాణము:**— 2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

**ప్రయోగములు:**—(అ. భూ.) దీనిలో గోక్షురాది చూర్ణము, సురాష్ట్రార కాసీసములను కలిపి పునర్నవారిష్టముతో సేవించిన అన్ని విధములైన నంజువ్యాధులు హరించి మంచి రక్తమును కలుగచేయును.

దీనిని వాముురసముతో సేవించిన అజీర్ణము, శూలలు, క్రిములను హరించును.

దీనిని తాళిసాది చూర్ణమునందు కలిపి తేనెతో సేవించిన దగ్గు, ఆయాసములతో కూడిన నంజువ్యాధులు తగ్గును.

దీనిని ద్రాక్షపండ్ల రసముతో సేవించిన గుండెదడ, రక్తక్షీణతను పోగొట్టును.

దీనిలో త్రిఫలములు, వాయువిడంగముల చూర్ణమును కలిపి లోహాసవముతో సేవించిన క్రిమిజపాండు, కామిలావ్యాధులు తగ్గును.

## 119. రజిత భస్మము

(అనుభూతము)

శ్లో॥ శ్వాసప్లీహ యకృద్వల్లీపలిత జిత్పాండ్వా ర్తిశోఫాపహం
కాసక్షీణక్షతక్షయ ప్రశమనం దీర్ఘాయుషం పుష్టిదం. (వై॥ చిం॥)

**గుణము:**—దీపనము, రసాయనము, వాజీకరణము, శోణిత వర్ధనము, క్షయహరము.

**ప్రమాణము:**— ½ మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

**ప్రయోగములు:**—(వై॥ చిం॥) దీనితో సమముగా అభ్రక భస్మము, తామ్రభస్మములను, వీటి కన్నిటికి సమము త్రికటుచూర్ణ మును కలిపి రోగి బలానుసారముగ నేతితో సేవించిన క్షయ, పాండు, ఉదరరోగము, అర్శ, శ్వాసకాసలు, తిమిరరోగము, పిత్తరోగములు నివర్తించును.

(అ. భూ.) దీనిలో వంగభస్మము, తంగేడు చూర్ణములను కలిపి ఆవుపాలతో సేవించిన శుక్రనష్టము, వీర్యముపలచబడుట మొదలగు శుక్రదోషములు మరియు స్త్రీలకు కలుగు శ్వేతరక్త ప్రదరములనుపోగొట్టి వీర్యపుష్టిని, సంభోగ శక్తిని కలిగించును.

దీనికి రెట్టింపు కర్పూర శిలాజితుభస్మమును చేర్చి ద్రాక్షారిష్ట ముతో సేవించిన కాళ్ళుచేతులు మంటలు, గుండెదడ మొదలగు వానిని తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

మరియు దీనిని అశ్వగంధాది లేహ్యము, కూష్మాండలేహ్యముల యందు కలుపుకొని సేవించిన బలమును కలుగచేయును.

## 120. రాతినారభస్మము

భ. ప్ర. (కృష్ణపండితీయము)

**గుణము:**—ఉష్ణశమనము, మూత్రలము, ప్రదరరోగహరము.

**ప్రమాణము:**—1/32 తు. మొదలు 1/16 తు. వరకు.

ప్రయోగములు.—(అ. భూ.) దీనిలో స్వర్ణవంగమును కలిపి చందనాసవముతోగాని, పంచదారనీళ్ళతోగాని సేవించిన ఉష్ణప్రధానము వలన కలుగు కంఠమంటలు, కడుపులోమంట, తాపము, మూత్రద్వారమునందుమంట కాళ్ళుచేతులు మంటలు తగ్గును.

దీనిలో గోక్షురాది చూర్ణమును కలిపి పల్లేరు కషాయముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము తగ్గును.

వంగభస్మము, శాల్మలీచూర్ణములను కలిపి బబ్బులారిష్టముతో సేవించిన రక్తపిత్తము, శ్వేతరక్తప్రదరములు తగ్గగలవు.

## 121. ర స భ స్మ ము

వై॥ చిం॥ (శుద్ధి॥ ప్ర.)

శ్లో॥ దేహస్యశుద్ధిం, కురుతేచపారదో నానాగదానాం హరణేసమర్థః
కరోతిపుష్టిం హరతేచమృత్యుం కల్పాయుషం చైవకరోతినూనం
పారదస్సకలరోగపారదో రాజయక్ష్మసరభేక వారిదః.

గుణము:—పుష్టికరము, క్షయహరము, వాతహరము, కఫహరము, సన్నిపాతజ్వరహరము, సవామేహహరము.

ప్రమాణము:—1 మొదలు 5 గ్రెనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనికి అర్ధభాగము నెయ్యి, మిరియాలచూర్ణము కలిపి సేవించిన నీళ్ళపై తైలబిందువు ఎటుల వ్యాపించునో అటుల అనుపానముచే శరీరమందు ఔషధము ప్రసరించును.

దీనికి సమముగా ఉసిరికవలుపుచూర్ణము కలిపి పంచదారతో సేవించిన సమస్త పిత్తరోగములు హరించును.

దీనికి సమము పిప్పళ్ళచూర్ణము కలిపి సేవించిన సమస్తవాతరోగములు హరించును.

దీనిని అల్లపురసముతో సేవించిన శ్లేష్మరోగములు నివర్తించును. నిమ్మపండ్ల రసముతో సేవించిన జ్వరములు, తేనెతో సేవించిన రక్త

వికారములు, తుంగముస్తల కషాయముతో సేవించిన ప్రవాహిక, అతి సారములు నివర్తించును.

(అ. భూ.) దీనిని ఇతరమందుల కలియకతో వాడక ప్రత్యేకముగా మాటుయందుంచి (అనగా కాప్సెల్సులోగాని, లేక శొంఠిచూర్ణమునందుగాని యుంచుట) పండ్లకు తగలకుండా గొంతులోవేసుకొని మ్రింగవలయును. యిట్లు సేవించిన సమస్త వాతవ్యాధులు, కఫవ్యాధులు, దగ్గు, ఆయాసము, సన్నిపాతజ్వరములు, సవామేహములు, ఉపదంశము (కొరుకుడు) హరించును.

దీనినే చిన్నపిల్లలకు 1 మొదలు 3 గ్రైనులవరకు ఆముదమునందు కలిపి వాడిన, అజీర్ణములు, జలుబు, దగ్గు, జ్వరము, మలబద్ధము మొదలగువానిని హరింపచేసి విరేచనము కలుగచేయును.

## 122. లోహభస్మము

ర. ర. స. (పూ॥ ఖం.) 5 వ॥ అధ్యా.

శ్లో॥ రూక్షం స్యాత్తరలోహకం సమధురంపాకేఫ వీర్యేహిమం
తిక్తోష్ణం కఫపిత్త కుష్ఠజరరప్లీహామపాండ్వార్తిజిత్
సద్యశ్శూల యకృద్గదక్షయ జరామేహామ వాతాపహం.

గుణము:—శీతవీర్యము, రసాయనము, క్షయహరము, రక్తవృద్ధికరము, కుష్ఠహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(ర. ర. స.) దీనిలో త్రిఫలాచూర్ణమును కలిపి తేనెతో సేవించిన కఫపిత్తరోగములు, కుష్ఠము, యకృత్ప్లీహరోగములు, పాండు, శూల, క్షయ, మేహ, ఆమవాతము, క్రిమి మొదలగు రోగములను హరింపజేయును.

దీనిలో త్రికటుచూర్ణము, వాయువిడంగముల చూర్ణములను కలిపి నెయ్యి లేక తేనెతో సేవించిన రక్తమును వృద్ధిచేసి శరీరమునకు కాంతిని కలుగజేయును. మరియు పాండువు, రాజయక్ష్మ, కుష్ఠము, క్రిమిరోగములను హరింపజేయును.

(అ. భూ.) దీనిలో మాండూరభస్మము, గోక్షురాది చూర్ణము లను కలిపి పునర్నవారిష్టముతో సేవించిన శోఫరోగములను (నంజు) హరింపజేసి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో ప్రవాళభస్మము, సితోపలాది చూర్ణములను కలిపి అడ్డ సరపాకు కషాయముతోగాని, వాసారిష్టముతోగాని సేవించిన రక్తక్షీణ తవలన కలిగిన క్షయ వ్యాధులు, మరియు శ్వాసకాసలు హరించును.

దీనిలో మంచిగంధపు పొడి, ముదురు వేపచెట్టుయొక్క వేరు చూర్ణమును కలిపి తేనెతో సేవించిన కుష్టము, చర్మవ్యాధులు, రక్త వ్యాధులు తగ్గును.

## 123. లోహాభ్రక సిందూరము

(అనుభూతము.)

ద్రవ్యములు:—లోహము, అభ్రకము.

గుణము:—రసాయనము, రక్తవృద్ధికరము, శోఫహరము, ప్రదర రోగహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో గోక్షురాదిచూర్ణమును చేర్చి త్రిఫలాకషాయముతో సేవించిన క్రిమిసంబంధమైన పాండు, శోఫ వ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో తిప్పసత్తు, మహాద్రాక్షాదిచూర్ణములను చేర్చి బియ్యపు కడుగుతో సేవించిన గుండెదడ, శ్వేతరక్త ప్రదరములు హరించును.

దీనిలో చాతుర్జాతక చూర్ణమునుగాని, సితోపలాదిచూర్ణమునుగాని కలిపి వాసారిష్టముతో సేవించిన క్షయవ్యాధులయందు కలుగు రక్తహీనత, కాసశ్వాసములు హరించును.

దీనికి రెట్టింపు తంగేడుపువ్వుచూర్ణమును చేర్చి పెరుగు పైమీగడతో సేవించిన శుక్రనష్టము, ప్రమేహవ్యాధులు, దౌర్బల్యములను హరింపజేయును.

## 124. వంగ భస్మము

వై॥ చిం॥ (శు॥ ప్ర॥)

శ్లో॥ బల్యం దీపనపాచనం రుచికరం ప్రజ్ఞాకరం కాంతిదం
సౌందర్యైక వివర్ధనం హ్యాతజరానీ రోగతాకారకం
ధాతుస్థైర్యకరం క్షయక్షయకరం సర్వప్రమేహాపహం.

గుణము:—బల్యము, ప్రమేహహరము, క్షయహరము, ధాతుస్థైర్యకరము, పూయమేహ హరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని వెన్నపూసతో సేవించిన శరీరమునకు బలమును కలుగచేయును.

తులసియాకు రసముతో సేవించిన ప్రమేహములు హరించును. గంజాయియాకు రసముతో సేవించిన వీర్యస్తంభనము కలుగచేసి శుక్రనష్టమును హరింపజేయును.

(అ. భూ.) దీనిలో మహాద్రాక్షాది చూర్ణమును కలిపి వెన్నపూస పంచదారతో గాని, కూష్మాండలేహ్యమునందు కలుపుకొని గాని సేవించిన ధాతుపుష్టిని కలిగించి స్వప్నమునందైననూ శుక్రనష్టమును కలుగకుండ కాపాడును. మరియు స్త్రీలకు కలుగు శ్వేత రక్త ప్రదరములు కూడా తగ్గును.

దీనిలో జాతీఫలాది చూర్ణమును కలిపి తంగేడు పంచక (అనగా తంగేడు యొక్క ఆకు, కాయ, పువ్వు, చెక్క, వేరు) కషాయముతో సేవించిన అతిమూత్రము, మధుమేహము మొదలగు ప్రమేహవ్యాధులు తగ్గును

చలవమిరియాలు, మంచిజీలకఱ్ఱ తెల్లబాడిశచెక్క కర్పూర శిలాజితు భస్మము, వీట్ల చూర్ణములను వంగభస్మమునకు రెట్టింపుగా చేర్చి 1/16 తు చొ॥న చందనాసవముతోగాని, ఉసీరాసవముతోగాని సేవించిన పూయమేహము (గనేరియా) హరించును.

## 125. వంగతామ్రము

(తామ్రవంగము) వై॥ యో॥ ర.

ద్రవ్యములు:— వంగము, తామ్రము.

గుణము:—దీపనము, కఫహరము, రక్తవృద్ధికరము.

ప్రమాణము:—2 మొదలు 5 గ్రైనులఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో శంఖభస్మమును కలిపి తేనెతో సేవించిన, పరిణామశూల, అన్నద్రవశూలలను హరింపజేసి జీర్ణ శక్తిని కలుగజేయును.

దీనిలో త్రికటుచూర్ణము ప్రవాళభస్మములను కలిపి తేనెతో సేవించిన, కఫవ్యాధులు (దగ్గు, ఆయాసము, ఉబ్బసము, మొదలగునవి) హరించును.

దీనిలో కాసీససిందూరమును కలిపి తేనెతో సేవించిన పాండు వ్యాధినిపోగొట్టి రక్తమును వృద్ధిచేయును.

దీనికి రెట్టింపు గానుగవేరుపట్టచూర్ణమును కలిపి ఖదిరారిష్టముతో సేవించిన రక్తదోషములు, చర్మదోషములు తగ్గగలవు.

## 126. వరాటభస్మము

భ॥ ప్ర. (కృష్ణపండితీయము)

శ్లో॥ పరిణామాది శూలఘ్నీ గ్రహణీ క్షయనాశనీ
కటూష్ణాదీపనీవృష్యా నేత్ర్యావాత కఫాపహా. (ర॥ ర॥ స.)

గుణము:—శూలహరము, పాచనము, క్షయహరము.

ప్రమాణము:—2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:-(అ. భూ.) దీనిలో భాస్కరలవణము, కాసీస సిందూరములను కలిపి వేడినీళ్లతో సేవించిన, ఉదరశూలలు, పరిణామ శూల,అన్నద్రవశూల, గుల్మములు, యకృత్ప్లీహరోగములుహరించును.

హింగ్వష్టకచూర్ణమును కలిపి నీళ్లతోగాని అజమోదార్కము (వాంవాటరు)తోగాని సేవించిన పరిణామశూల, అగ్నిమాంద్యము (ఆకలి లేకపోవుట) అమ్లపైత్యము వీనిని హరించును.

దీనిని ఒక గురిగింజఎత్తు భస్మమును చెవిలోవేసి నిమ్మకాయరసమునుపోసిన అదిపొంగును. పొంగిన పిమ్మట వంచివేయవలయును. ఇటుల చేసిన చెవిపోటు, చెవులు దిమ్ముగాయుండుట తగ్గును. మరియు చెవులలో లేచుకురుపులు తొందరగా పగులును. పగిలినపిమ్మట ఉపయోగించరాదు.

## 127. వైక్రాంత భస్మము

ర॥ ర॥ స॥ (పూ॥ ఖం॥) 2 వ అధ్యా.

శ్లో॥ ఆయుః ప్రదశ్చబలకృద్ధ కరోహివృష్యః । ప్రజ్ఞాప్రదస్సకల రోగగదాపహారీ ।
దీప్తాగ్నికృత్య విసమాన గుణ స్తదన్యే.

**గుణము:—** కఫహరము, క్షయహరము, బలవర్ధకము, ప్రమేహహరము.

**ప్రమాణము:—** 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

**ప్రయోగములు:—** (వై॥ చిం.) దీనిని చంద్రచెక్కకషాయముతో పుచ్చుకొనిన కుష్టువులు, అల్లపురసములో తేనెచేర్చి పుచ్చుకొనిన వాతవ్యాధి, వాతరక్తము.అడ్డసరము, మిరియాలు, మోడి, పిప్పళ్లు వీటిచూర్ణముతో సేవించిన దగ్గు, కఫము, ఉబ్బసము. చక్కెరతో పుచ్చుకొనిన జ్వరములు నివర్తించును.

(అ. భూ.) దీనిలో తాళిసాదిచూర్ణమును కలిపి తేనెతో సేవించిన శ్లేష్మప్రకోపములు, క్షయలు, శ్వాసకాసములు, హరించును.

దీనిలో మహాద్రాక్షాది చూర్ణమును కలిపి కూష్మాండలేహ్యముతో సేవించిన బలము, వీర్యవృద్ధి, రక్తవృద్ధి కలుగును.

దీనికి రెట్టింపు నేరేడుగింజలచూర్ణమును కలిపి, త్రిఫలాకషాయముతో సేవించిన అతిమూత్రము, మధుమేహము, మొదలగు ప్రమేహవ్యాధులు హరించును.

కొందరు వజ్రభస్మమునకు బదులు దీనిని వాడుదురు. కాని వజ్రభస్మమీయగల గుణము నిది యీయజాలదు.

## 128. శంఖ భస్మము

భ॥ ప్ర॥ (కృష్ణపండితీయము)

శ్లో॥ శంఖః క్షారోహిమోగ్రాహీ గ్రహణీ రోగనాశకః
నేత్రపుష్పహరో వర్ణ్యస్తారుణ్య పిటికాప్రణుత్.

గుణము:—దీపనము, పాచనము, శూలఘ్నము, నేత్ర పుష్ప హారము, యకృత్ప్లీహ వికారహరము, గ్రాహి.

ప్రమాణము:— 2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో హింగ్వష్టక చూర్ణమును, కాసీస సిందూరములను కలిపి నిమ్మకాయ రసముతో సేవించిన శూలవ్యాధులను హరింపజేసి జీర్ణశక్తిని కలుగ జేయును.

దీనిని వెన్నపూసతో కొంతకాలము సేవించిన నేత్రములయందు కలుగు పుష్పములను హరింపజేయును.

దీనిలో బాలచంద్రోదయము, కాసీస సిందూరములను కలిపి తేనెతో సేవించిన యకృత్ప్లీహ వికారములు హరించును.

దీనిలో శృంగభస్మమును కలిపి తేనెతో సేవించిన ఊపిరికట్టు నొప్పులు, గుండె నొప్పి తగ్గును.

దీనిలో దాడిమాష్టక చూర్ణమును కలిపి మజ్జిగతో సేవించిన గ్రహణి అతిసారములు హరించును.

## 129. శు క్తి భ స్మ ము

భా॥ ప్ర॥ (కృష్ణ పండితీయము)

శ్లో॥ ముక్తాసు క్తిః కటుస్నిగ్ధా శ్వాస హృద్రోగహారిణీ
శూలప్రశమనీరుచ్యా మధురా దీపనీపరా.

గుణము:—కఫహరము, శూలఘ్నము, హృద్యము, కాస శ్వాస హరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో త్రికటుచూర్ణమును కలిపి తేనెతో సేవించిన తాత్కాలికముగా కలుగు జలుబు, దగ్గు హరించును.

దీనిలో తాళిసాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన హృదయమునకు బలము కలుగజేసి శ్వాసకాసలను నివర్తింప జేయును.

## 130. శృంగ భస్మము

భా॥ ప్ర॥ (కృష్ణ॥ పం॥)

గుణము:—కఫహరము, హృద్యము, శ్వాసకాస హరము, ప్రదరరోగ హరము.

ప్రమాణము:— 2 మొదలు 3 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భా.) దీనిలో తాళీసాది చూర్ణమును కలిపి తేనెతో సేవించిన దగ్గు, పడిశము, శ్వాసకాసలు, ఊపిరికట్టు నొప్పులను హరించును. దీనినే నేతితో వుపయోగించిన హృద్రోగము లను పోగొట్టును.

దీనిలో వంగభస్మమును కలిపి వెన్నపూస పంచదారతో సేవించిన శ్వేత రక్తప్రదరములు తగ్గును.

దీనిని కేవలము ద్రాక్షారిష్టముతో సేవించిన హృదయమునకు, ఊపిరితిత్తులకు సంబంధించిన రోగములను హరింపచేసి బలమును కలుగ చేయును.

## 131. సత్తు భస్మము

(జసద భస్మము)

ఆ॥ వి॥, 1వ భాగము, మరియు వై॥ యో॥ ర.

శ్లో॥ జసదం తువరం తిక్తంశీతలం కఫపిత్తహృత్
చక్షుష్యం పరమంమేహాన్పాణ్డుం శ్వాసంచనాశయేత్. (భా॥ ప్ర॥)

గుణము:—దీపనము, యకృత్ప్లీహరోగహరము, క్రిమిహరము, ఉదరరోగములు, నేత్రరోగములు హరింపజేయును.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భా.) దీనిలో కాంతవల్లభరసము, కాసీససిందూరములను కలిపి రోహితకారిష్టముతో సేవించిన జ్వరము లు, యకృత్ప్లీహరోగముల (Enlargements and Disorders)ను తగ్గించి రక్తమును వృద్ధిచేయును.

దీనిలో బాలచంద్రోదయమును కలిపి చనుపాలతో పిల్లలకువాడిన లివర్ స్ప్లీన్ వ్యాధులను తగ్గించి పిల్లలకు మంచి ఆరోగ్యమును కలుగ జేయును.

త్రిఫలాచూర్ణమును కలిపి వాయువిడంగములు, మోదుగమాడల కషాయముతో సేవించిన క్రిమిరోగము (అనగా మలమునందు పడు పురుగులు) హరించును.

దీనిని అతిమధుర కషాయముతో సేవించిన రక్తపిత్తము ప్రమేహములు తగ్గును.

దీనిని తేనెయందుగాని, వెన్నపూసయందుగాని కలిపి నేత్రముల యందుపెట్టిన దుర్మాంసములు తగ్గును.

## 132. సురాక్షారకాసీసభస్మము

వై॥ యో॥ ర॥

ద్రవ్యములు:—సురేకారము, అన్నభేది.

గుణము.—స్రోతశ్శోధనము, మూత్రలము, ఇది గుల్మము, శోఫ, ఉదరరోగములను తగ్గించును.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని లోకనాథ రసముతోగాని సువర్ణకాంత వల్లభ రసముతోగాని, రజితలోహ రసాయనముతో గాని కలిపి పొట్లములు కట్టి తేనెతో సేవించి పునర్నవారిష్టమును అనుపానముగా యిచ్చినయెడల గుల్మము, పాండువు, శోఫ, యకృత్ప్లీహోదరములు, జలోదరము, క్రిమి సంబంధమైన పాండురోగము మొదలగు వానిని తగ్గించి మలమూత్రములను బాగుగా వెడలించును. రక్తవృద్ధి చేయును.

## 133. సోమనాథీయతామ్రభస్మము

ర॥ ర॥ స. (పూ॥ ఖం.) 5 వ. అధ్యా.

శ్లో॥ సంలీహం పరిణామశూలముదరం శూలంచపాండుజ్వరం
గుల్మప్లీహయకృత్ క్షయాగ్ని పవనం మేహాంచమూలామయం
దుష్టాంచగ్రహణీం హరేద్ధ్రువమిదం శ్రీసోమనాథాభిధం.

ద్రవ్యములు:—రాగి, రసభస్మము, గంధకము, తాళకము, మణిశిల.

గుణము:—దీపనము, పాచనము, శూలహరము, యకృత్ప్లీహరోగహరము, గుల్మహరము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో వరాటభస్మము, శృంగభస్మములను కలిపి పంచకోల కషాయముతోగాని అజమోదార్కముతోగాని సేవించిన పరిణామశూల, ఉదరశూల, అజీర్ణము, శ్వాసకాసలు, తమకశ్వాస హరించును.

దీనిలో అర్కలవణమును కలిపి రోహితకారిష్టముతో సేవించిన గుల్మము, యకృత్ప్లీహరోగములు, ఉదరగుల్మరోగములు తగ్గును.

దాడిమాష్టకచూర్ణమును కలిపి కుటజారిష్టముతో సేవించిన అసాధ్యగ్రహణీవ్యాధులు, నివర్తించి ఆకలిని వృద్ధిచేయును.

## 134. స్వర్ణభస్మము

భ॥ ప్ర॥ (కృ॥ పం॥)

శ్లో॥ స్వర్ణం స్నిగ్ధకషాయ తిక్తమధురం దోషత్రయధ్వంసకం
శీతం స్వాదురసాయనంచ రుచికృచ్చక్షుష్య మాయుష్యదమ్
ప్రజ్ఞావీర్యబలస్మృతి స్వరకరం కాన్తిం విధత్తేతనో స్సంధత్తే
దురితక్షయం శ్రియమిదం ధత్తేనృణాం ధారణాత్.

గుణము:—రసాయనము, వాజీకరణము, క్షయహరము, విషహరము, త్రిదోషహరము, నేత్రదృష్టిని వృద్ధిచేయును. ఆయువు

నెచ్చించును, ప్రజ్ఞను, వీర్యమును, బలమును, జ్ఞాపకశక్తిని, సుస్వరము, దేహకాంతిని యిచ్చును. దీనిని సేవించుటవలన పాపక్షయమును చేయును, ఐశ్వర్యము నిచ్చును.

ప్రమాణము:— 1 మొదలు 2 గ్రైనుల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని పాలతో సేవించిన క్షయ వ్యాధులు తెల్లగలిజేరు వేరురసముతో సేవించిన నేత్రరోగములు హరించును. గుంటగలగరాకురసముతో సేవించిన శుక్రవృద్ధిని, పాలతో సేవించిన బలమును, నేతితో సేవించిన రసాయనముగను, కుంకుమపువ్వుతో సేవించిన కాంతిని కలుగచేయును. మరియు నేలగుమ్ముడు చూర్ణముతో సేవించిన సంతానవంతులుగ చేయును.

(అ. భూ.) దీనిని చ్యవనప్రాశ లేహ్యమునందు కలుపుకొని సేవించిన హృదయమునకు, శ్వాసకోశములకు బలము కలుగచేయును.

దీనిలో అభ్రకభస్మమును కలిపి వెన్నపూస పంచదారతో సేవించిన వాజీకరణముగా పనిచేయును.

ముత్యభస్మమును కలిపి మేకపాలతో సేవించిన చిరకాలాను గతమగు క్షయ, శ్వాసకాసలు తగ్గును.

త్రిఫలాచూర్ణమును కలిపి తేనెతో సేవించిన స్థావర, జంగమ, దూషీ విష వికారములు హరించును.

దీనిని అశ్వగంధాది లేహ్యమునందు కలుపుకొని సేవించిన వీర్య వృద్ధిని కలుగచేసి శరీరమునకు బలమును, కాంతిని కలుగజేయును.

ఇంకనూ అనేకవిధముల నీ భస్మమును వుపయోగించవచ్చును. అన్ని వ్యాధులయందునూ బాగుగా పనిచేయును.

## 135. హేమమాక్షికభస్మము

(స్వర్ణమాక్షికభస్మము)

ర॥ ర॥ స. (పూ॥ ఖం.) 2 వ అధ్యా.

శ్లో॥ సువర్ణమాక్షికంస్వాదు, తిక్తం వృష్యం రసాయనం
చక్షుష్యం వస్తిహృత్కంఠ పాండుమేహావిషోదరం
అర్శశ్శోఫవిషం కండూత్రిదోషానపినాశయేత్. (వై॥ చి.)

గుణము:—దీపనము, రసాయనము, నేత్ర్యము.

ప్రమాణము:—1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ప్రయోగములు:—(వై॥ చిం.) దీనిలో త్రిఫలాచూర్ణమును గాని, త్రికటుచూర్ణమునుగాని కలిపి నేతితో సేవించిన వీర్యవృద్ధి కలుగ జేయును. మరియు నేత్రరోగములు, కంఠరోగములు, పాండువు, ప్రమేహములు, విషదోషములు, మూలవ్యాధులు మొదలగునవి హరించును.

(అ. భూ.) దీనిలో త్రికటుచూర్ణమును కలిపి తేనెతో సేవించిన శ్వాసకాసములు, కంఠరోగములు, తగ్గును.

త్రిఫలాచూర్ణమును కలిపి నేతితో సేవించిన నేత్రరోగములు, విషదోషములు హరించును.

దీనిలో ముత్యభస్మమును కలిపి వాసారిష్టముతో సేవించిన క్షయ వ్యాధులను హరింపజేసి బలము కలుగజేయును.

దీనిలో కాంతాభ్రకము, తిప్పసత్తులను కలిపి వెలగాకురసముతో గాని, తేనెతోగాని సేవించిన, పాండు, కామిలా, నోటిపూతలు తగ్గును.

కొందరు స్వర్ణభస్మమునకు బదులు దీనిని వాడుదురు.

# వటుకములు

## 136. అగ్నితుండివటి

వై॥ ర॥ (అగ్నిమాంద్యాధికారం.)

శ్లో॥ అగ్నిమాంద్య ప్రశాంతయే.

ద్రవ్యములు:—పాదరసము, గంధకము, నాభి, వాము, త్రిఫలములు, ద్విక్షారములు, చిత్రమూలము, లవణత్రయము, జీలకఱ్ఱ, వాయువిడంగములు, వెలిగారము, విషముష్టి.

గుణము:—దీపనము, పాచనము, జ్వరహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని అల్లపురసముతో సేవించిన అగ్నిమాంద్యము, ఒడలు నొప్పులు తగ్గును.

శొంఠి, మిరియాల కల్కముతో సేవించిన అజీర్ణ జ్వరములు హరించును.

ఆవుపాలతోగాని, అశ్వగంధారిష్టముతోగాని సేవించిన నరముల బలహీనతను పోగొట్టుటయేగాక నరముల బలహీనతవలన కలుగు అతి మూత్రమును గూడ తగ్గించును.

దీనిని ద్రాక్షారిష్టముతో సేవించిన అజీర్ణములను తగ్గించి హృదయమునకు బలము కలుగజేయును.

N. B ఈ ఔషధముయొక్క పరిమాణమునందు సగభాగము విషముష్టి కలదు.

## 137. అ శో క వ టి

(అశోకాదివటి) వై॥ యో॥ ర॥

ద్రవ్యములు:—అశోకరసక్రియ, కాసీససిందూరము, అశోకపట్ట చూర్ణము.

గుణము:—స్రోతశ్శోధకము, గర్భాశయ రోగహరము, ఋతు శూలహరము, ఋతుకరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని అశోకారిష్టముతో గాని నువ్వులు, నల్లవులవలు వీని కషాయముతోగాని సేవించిన ఋతుబద్ధము, ఋతుశూల హరించును. మరియు ఋతువును జారీచేయును.

దీనిని సదాపాకు, వెదురాకు, మెంతులు, కరివేపాకు ఈనెలు, మిరపగింజలు, గాడిదెగడపవేళ్లు, శొంఠి వీనిని సమభాగములుగ గ్రహించి కషాయవిధిగా 8 వ భాగము కషాయము కాచి దానితో సేవించిన ముట్టుకుట్టునొప్పి తగ్గి ఋతువు జారీలేనివారికి ఋతువును జారీచేయును.

## 138. అష్టాక్షరీగుటిక

ఆ॥ క॥ ద్రు. (గ్రహిణీచికిత్స) పరియు యో॥ త॥ షష్ఠతరంగం.

శ్లో॥ అష్టాక్షరీయం గుళికా గ్రహణీ రోగిణాంహితా
తథార్శస్యతిసారేచ దధ్నా వాపూక్షి పేనవా,
పంచకృత్వః ప్రయుంజీత బలే సత్వ వలస్యతు.

ద్రవ్యములు:—నల్లమందు, చందనద్వయము, జాజికాయ, ఇంగిలీకము, పిప్పళ్లు, ఇంగువ, అతివస.

గుణము:—గ్రాహి, స్తంభనము, పాచనము, గ్రహణ్యాతిసారహరము.

ప్రమాణము:—1 మొదలు 3 మాత్రల వరకు.

ప్రయోగములు:—(యో॥ త.) దీనిని పెరుగుతోగాని తేనెతోగాని సేవించిన అతిసారము, మూలరోగము హరించును.

పంచకోలకషాయముతో సేవించిన పాచనశక్తిని కలుగజేయును. మజ్జిగతో సేవించిన ఆకలిని వృద్ధిచేసి ఆమవిరేచనములను తగ్గించును.

వట్టివేరు, నేలవేము, మానిపసుపు అనువాని కషాయముతోగాని, సుగంధిపాల, వాము, జీలకఱ్ఱ అనువాని కషాయముతోగాని, సేవించిన రక్తగ్రహణీ, రక్తాతిసారములు తగ్గును.

త్రికటుకములు, వరిపేలాలు, తెల్లవెంపలి, వస, తుంగగడ్డలు, కచోరములు, కురువేరు, కొబ్బరి ఆకుయీనెలు వీని కషాయముతోగాని బియ్యపుకడుగుతోగాని సేవించిన విషూచి (కలరా) తగ్గును.

(అ. భూ.) దాచినచెక్క, గసగసాలు, వాము వీని కషాయముతోగాని, కుటజారిష్టముతోగాని సేవించిన బంకవిరేచనములు, నీళ్లవిరేచనములు హరించును.

కర్పూరాద్యరిష్టముతో సేవించిన, కలరా, అజీర్ణవిరేచనములు నివర్తించును.

మజ్జిగతో సేవించిన ఆమాతిసారములు తగ్గును.

దీనిని పంచామృత పర్పటి మొదలగు పర్పటులతో కలిపి నుప యోగించిన చిరకాలగతమగు గ్రహణి, ఆమాశయపూత (Sprwe) మొదలగునవికూడా తగ్గును.

N B ఈ యౌషధముయొక్క మాత్రయందు ¼ వ వంతు నల్లమందు కలసి యున్నది.

## 139. ఆకార కరభాదివటి

(ఆకార కరభాది చూర్ణము)

శా॥ సం॥ (మ॥ ఖం.) 6 వ॥ అధ్యా.

శ్లో॥ శుక్ర స్తంభకరం చూర్ణం పుంసామానన్దకారకమ్
నారీణాం ప్రీతిజననం సేవేత నిశికాముకః.

ద్రవ్యములు:—అక్కలకఱ్ఱ, శొంఠి, కంకోలములు, కుంకుమ పువ్వు, పిప్పళ్ళు, జాజికాయ, లవంగములు, శ్రీగంధము, నల్లమందు.

గుణము:—శుక్ర స్తంభనము, వృష్యము, కాసశ్వాసహరము, గ్రాహి, నిద్రాకరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(శా॥ సం॥) దీనిని రాత్రి పరుండబోవునప్పుడు పంచదార కలిపిన గోరువెచ్చని ఆవుపాలతో సేవించిన శుక్రమును స్తంభింపజేసి స్త్రీలకు సంతృప్తిని కలుగజేయును.

(అ. భూ.) ఉదయ సాయంకాలములయందు దీనిని కనకాసవ ముతో సేవించిన కాసశ్వాసలు, ఉబ్బసములను హరింపజేయును.

దీనిని మజ్జిగతో సేవించిన గ్రహణీ, అతిసారములు తగ్గును. మరియు నిద్రను కలుగచేయును.

N B. దీనిని తరుచు వాడుటవలన మూత్రదోషములు, మూత్రబంధములువచ్చును కాబట్టి జాగ్రత్తగా వాడుకొనవలెను. ఈ ఔషధముయొక్క మాత్రయందు ⅓ వ భాగము నల్లమందు కలిసి యున్నది.

## 140. కర్పూరాదివటి

(కర్పూరరసము) భై। ర.

(అతిసారాధికారం) (ప్రవాహికరసయోగప్రకరణము)

శ్లో॥ జ్వరాతిసారిణీచైవ తథాతీసారరోగిణీ
గ్రహణీ షట్ప్రకారేచ రక్తాతీసార ఉల్బణే.

ద్రవ్యములు:—ఇంగిలీకము, తుంగముస్తలు, కొడిశపాల, జాజికాయ, హారతికర్పూరము, నల్లమందు, వెలిగారము, యివియన్నియు సమభాగములు.

గుణము:—గ్రాహి, స్తంభనము, పాచనము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని వాము, ఆవాలు, మిరపకాయలలోని గింజలు (మూడుసమానము) వీట్ల కాటుకనీళ్లతో నుపయోగించిన నీళ్లవిరేచనములు, అజీర్ణవిరేచనములు తగ్గును.

నేరేడుచెక్క, దాల్చినచెక్క, గసగసాలు వీట్లయొక్కరసముతో సేవించిన జ్వరాతిసారము, గ్రహణీవ్యాధులు, రక్తగ్రహణి తగ్గును.

కర్పూరాద్యరిష్టముతో సేవించిన నీళ్లవిరేచనములు, కలరా (విషూచి), ఆమాతిసారములు హరించును.

దీనిని మహాగంధకపర్పటి మొదలగు పర్పటులతో కలిపి నుపయోగించిన చిరకాలానుగతమగు గ్రహణ్యాతిసారములు, ఆమాశయపూత (Sprwe) మొదలగునవికూడా తగ్గును.

N. B. ఈ యౌషధముయొక్క మాత్రయందు $\frac{1}{8}$వ భాగము నల్లమందు కలిసియున్నది. కనుక జాగ్రత్తగా వాడవలెను.

## 141. కస్తూరి మాత్రలు

ఆ॥ వై॥ ర॥ (ప్ర॥ గుచ్ఛము)

శ్లో॥ కస్తూరికాకటుః తిక్తా క్షారోష్ణా శుక్రలాగురుః
కఫవాతవిషచ్ఛర్ది శీతదౌర్గంధ్యశోషహృత్.

ద్రవ్యములు:—రసకర్పూరము, రససిందూరము, సన్నిపాత భైరవి, జున్ను, ఇంగిలీకము, నాభి, వాతరాక్షసము, ప్రావుదారు, గోరోజనము, కస్తూరి, కొయ్యీపత యివి సమభాగములు.

గుణము.—వాతకఫహరము, శీతహరము, సన్నిపాతజ్వరహరము, హృదయోత్తేజకము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని చనుపాలతో నుపయోగించిన చిన్నపిల్లలకు కలుగు జలుబు, కఫము, జ్వరము, బాలపాప చిన్నెలు తగ్గును.

ఆకుజెముడాకు రసముతో నుపయోగించిన కంఠగతమగు శ్లేష్మమును, మరియు వాతప్రాబల్యమును తగ్గించును.

తమలపాకు రసముతో నుపయోగించిన దారుణ సన్నిపాత జ్వరములు, కరపాద శీతలము తగ్గును.

దశమూలారిష్టముతో నుపయోగించిన వాతోద్రేకమును తగ్గించి హృదయమునకు బలమును కలుగజేయును.

ఈ మాత్ర లత్యుత్తమమైనవి. ప్రతియింటను తప్పక నిలువ యుంచుకొనవలసినవి.

## 142. కస్తూర్యాది గుటిక

స॥ యో॥ (గుటి॥ ప్ర॥) మరియు వై॥ యో॥ ర॥

ద్రవ్యములు:—కస్తూరి, అయస్కాంత భస్మము, పచ్చకర్పూరము, ద్విక్షారములు, నీలాంజనము, మణిశిల, ఇంగిలీకము, ఈ మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వాతకఫహరము, శీతహరము, జ్వరహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 మాత్రల వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని కళింగరాష్ట్రిము, మిరియాలు, మంచిజీలకర్ర వీని యుపరసములతో నుపయోగించిన వాతకఫ ప్రకోపములవలన కలుగు జ్వరములు హరించును.

తమలపాకు రసముతో నుపయోగించిన పిల్లలకు కలుగు దగ్గు, జ్వరము, గొంతులో గురగుర యనుట తగ్గును.

అమృతారిష్టముతో సేవించిన సన్నిపాత జ్వరములు నివర్తించును.

దశమూలారిష్టముతో నుపయోగించిన వాతమును హరింపజేసి ఉష్ణమును కలుగజేయును.

## 143. కాంకాయన గుటిక

యో॥ ర॥ (అర్శో॥ ప్ర.)

శ్లో॥ క్షారాగ్ని శస్త్రపతనైరపియేऽసిద్ధాః। సిధ్యన్త్యనేన వటకేన గుదామయాస్తే.

ద్రవ్యములు:—కరక్కాయలు, మిరియాలు, జీలకఱ్ఱ, పిప్పళ్ళు, శొంఠి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, జీడిగింజలు, అడవికంద, యవక్షారము, బెల్లము.

గుణము:—అర్శోరోగహరము, రక్తపిత్తహరము, రక్తస్తంభనము.

ప్రమాణము:—⅛ తు. మొదలు ¼ తులము వరకు,

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని మజ్జిగతో సేవించిన అర్శోరోగికి కలుగు బాధలను తగ్గించి మొలలను వూడిపోవునట్లు జేయును.

దీనిని అభయారిష్టముతో సేవించిన అర్శోరోగికి విరేచనము కలుగచేసి సుఖమును కలుగజేయును.

త్రిఫలా కషాయముతో సేవించిన శస్త్రక్షారాగ్ని కర్మలచేత కూడ నయముకాని అర్శోరోగములు తప్పక శమించగలవు.

కూష్మాండరసాయనముతో సేవించిన అర్శోరోగికి రక్తముపడుటను ఆపుజేయును.

(ఈ యోగము లోకోపకారము కొరకు కాంకాయనమహర్షి చే చెప్పబడినది.)

## 144. కైశోర గుగ్గులు

శా॥ సం. (మ॥ ఖం.) 7 వ. అధ్యా.

శ్లో॥ జయేత్సర్వాణి కుష్ఠాని వాతరక్తం త్రిదోషజమ్
సర్వ వ్రణాంశ్చ గుల్మాంశ్చ ప్రమేహపిటికా స్తథా.

ద్రవ్యములు:—గుగ్గిలము, త్రిఫలములు, తిప్పతీగె, త్రికటుకములు వాయువిడంగములు, దంతివేరు, తెగడ.

గుణము:—వాతరక్తహరము, రక్తశుద్ధికరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(శా॥ సం.) దీనిని వేడినీళ్లతోగాని, ఆవు పాలతోగాని, మంజిష్ఠాదికషాయముతోగాని సేవించిన కుష్ఠములు, త్రిదోషముల వలన కలుగు వాతరక్తములు, వ్రణములు, ప్రమేహపిటికలు హరించును.

చంద్రచెక్క కషాయముతోగాని, ఖదిరారిష్టముతోగాని సేవించిన శరీరమున కలుగు నల్లని, ఎఱ్ఱని మచ్చలు, కుష్ఠురోగములు తగ్గును.

అడ్డసరపాకు కషాయముతో సేవించిన నేత్రరోగములు హరించును.

దీనినే ప్రతిదినము సేవించుచుండిన సమస్త రోగములు నశించి శరీరకాంతిని కలుగజేయును. దీనినే కైశోరగుగ్గులు రసాయనమనబడును.

## 145. గుడపిప్పలి

భై॥ ర॥ (ప్లీహాధికారము)

శ్లో॥ ... ... ... ప్లీహానం హంతి దుస్తరమ్
యకృతం పంచగుల్మంచాప్యుదరం సర్వరూపకమ్.

ద్రవ్యములు:—వాయువిడంగములు, త్రికటుకములు, చెంగల్వకోష్టు, ఇంగువ, పంచలవణములు, క్షారత్రయము, సముద్రఫేనము, చిత్రమూలము, గజపిప్పళ్ళు, నల్లజీర, తాటిగులక చండ్లక్షారము, బూడిదగుమ్మడితీగెక్షారము, ఉత్తరేణిక్షారము; పిప్పళ్ళు. బెల్లము.

గుణము:—దీపనము, పాచనము, యకృత్ప్లీహ, ఉదర, గుల్మ రోగహరము.

ప్రమాణము:— ⅛ తు॥ మొదలు ¼ తులము వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని వేడినీళ్ళతో సేవించిన యకృత్ప్లీహవ్యాధులు, పంచగుల్మములు, ఉదరవ్యాధులు, దగ్గులు హరించును.

(అ. భూ.) రోహితకారిష్టముతో సేవించిన యకృత్ప్లీహవ్యాధులు హరించును.

గోమూత్రముతోగాని, పునర్నవారిష్టముతోగాని సేవించిన ఉదరరోగములు తగ్గును.

5 సం॥ రములు లోపుగల పిల్లలకు 1/16 తు. మోతాదు వేడి నీళ్ళతో నుపయోగించిన పిల్లలకు దుష్టస్తన్యమువలన కలుగు అజీర్ణములు ఉదరవ్యాధులు, యకృత్ప్లీహరోగములు, శ్వాసకాసలు హరించును.

## 146. గో రో జ నా ది వ టి

స॥ చి॥ ర. (సన్ని॥ చికిత్స.) మరియు భై॥ యో॥ ర.

ద్రవ్యములు:—గోరోజనము, సీసభస్మము, స్వర్ణభస్మము, ప్రవాళ భస్మము. నీలాంజనము, పచ్చకర్పూరము మొదలగు ద్రవ్యములుకలవు.

గుణము:—త్రిదోషజ్వరహరము, సంజ్ఞాకరము, కఫవాతరోగహరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని చనుపాలతోగాని తులసి యాకు రసముతోగాని వుపయోగించిన సన్నిపాతజ్వరములు, పడిశభారము, శీతజ్వరములు హరించును.

పిల్లలకు చనుపాలతో నుపయోగించిన దగ్గు, జ్వరము, గొంతులో గురగురయనుట తగ్గును. (తమలపాకురసముతో గూడ నుపయోగించ వచ్చును.)

పిప్పల్యాసవముతో నుపయోగించిన శ్వసనక (Pneumonia) జ్వరములు తగ్గును.

దశమూలారిష్టముతోగాని, అమృతారిష్టముతోగాని సేవించిన సన్నిపాతజ్వరములు, వాతజ్వరములు హరించును.

## 147. చందనాదివటి

(వై॥ యో॥ ర.)

ద్రవ్యములు:—అతిమధురము, చలవమిరియాలు, తుమ్మజిగురు, అరటిక్షారము, రూమిమస్తకి, చందనతైలము, కోపేబా.

గుణము:—మూత్రలము, వస్తిశోధనము, పూయమేహహరము మూత్రనాళములయందు మంటను తగ్గించును.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—దీనిని చందనాసవముతో సేవించిన అన్నివిధములగు పూయమేహము (గనేరియా)లు, మూత్రకృచ్ఛ్రములు నివర్తించును.

కొండపిండివేళ్ళు, పల్లేరు, చలవమిరియాలు వీనికషాయముతో గాని బంతిపూలకషాయముతోగాని నుపయోగించిన మూత్రకృచ్ఛ్ర మూత్రాఘాతములు నివర్తించును. మరియు శ్వేత, రక్తప్రదరములను కూడా తగ్గించును.

## 148. చంద్రప్రభావటి

భై॥ ర. (ప్రమేహాధికారం.)

శ్లో॥ చంద్రప్రభేతి విఖ్యాతా సర్వరోగప్రణాశినీ
నిహంతి వింశతింమేహాన్ కృచ్ఛ్రమష్టవిధం తథా.

ద్రవ్యములు:—బావంచాలు, వస, పసుపు, త్రిజాతకములు, త్రిఫలములు, త్రికటుకములు, త్రిలవణములు, ద్విక్షారములు, హేమమాక్షికభస్మము, లోహభస్మము, గోమూత్రశిలాజితు, గుగ్గిలము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—మూత్రలము, ప్రమేహహరము, బల్యము, అమ్లశమనము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని తిప్పతీగె స్వరసముతోగాని, ఉసిరికాయలరసముతోగాని, శతావరిరసముతోగాని సేవించిన ప్రమేహములు, మూత్రకృచ్ఛ్రములు, అశ్మరీవ్యాధులు, అండవృద్ధి, కుష్ఠము, మొదలగు వ్యాధులను హరింపజేయును.

(అ. భూ.) పల్లేరు, చందనము వీని కషాయముతోగాని, చందనాసవముతోగాని సేవించిన మూత్రమును జారీచేసి మూత్రాఘాత, మూత్రకృచ్ఛ్ర, అశ్మరీవ్యాధులను హరింపజేయును.

నేరేడుగింజల కషాయముతో సేవించిన లాలామేహము, క్షారమేహము, వసామేహము (ఆల్బుమిన్) మొదలగు ప్రమేహవ్యాధులు తగ్గును. మరియు సెగరోగము నందలి మూత్రనాళమునందు కలుగు మంటనుకూడా తగ్గించును.

శారిబాద్యరిష్టముతోగాని, మంజిష్ఠకషాయముతోగాని సేవించిన వాతరక్తములు, రక్తదోషములు నివర్తించును.

## 149. చిత్రకాది వటి

చ॥ చి॥ (గ్రహణీ॥ అధ్యా.)

శ్లో॥ కృత్వావిపాచ యత్యామం దీపయత్యాశుచానలం.

ద్రవ్యములు:—చిత్రమూలము, మోడి, ద్విక్షారములు, పంచ లవణములు, త్రికటుకములు, ఇంగువ, వాము, చవ్యము, యివియన్నియు సమభాగములుగా యుండును.

గుణము:—దీపనము, పాచనము, గ్రాహి, స్తంభనము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు;—(చ॥ చి॥) శొంఠి, అతివస, తుంగగడ్డలు వీటి కషాయముతో సేవించిన ఆమ మలాదులను పచింపజేసి, గ్రహణీ వ్యాధులను తగ్గించును. మరియు ఆకలిని వృద్ధిజేయును.

(అ. భూ.) దీనిని అజామోదార్కము (వాంవాటరు)తో సేవించిన అజీర్ణశూల, అజీర్ణములు, అగ్నిమాంద్యములను హరింపజేయును.

సైంధవలవణము కలిపిన మజ్జిగతో సేవించిన పులిత్రేనుపులు, ఆమ్లపిత్తము, గ్రహణి, అతిసారములు తగ్గును.

కుటజారిష్టముతో సేవించిన గ్రహణీవ్యాధులను తగ్గించి అగ్నిదీపనమును కలుగజేయును.

## 150. జ్వరాంతక వటి

(అనుభూతము)

ద్రవ్యములు:—నల్లేరుస్వరసము, సర్వీరము.

గుణము:—జ్వరహరము, వాతహరము, కఫహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు. (మాత్రలు పెసరగింజలవలె యుండును.)

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని అల్లపురసముతోగాని జీలకఱ్ఱ రసముతోగాని సేవించిన వాతజ్వరములు తగ్గును.

వావిడువేళ్ళ రసముతో సేవించిన శ్లేష్మజ్వరములు, కాసశ్వాసలు హరించును.

పంచతిక్త కషాయముతోగాని పంచతిక్త రసాయనముతోగాని సేవించిన సంతత, సతతక, అన్యేద్యుష్క, తృతీయక, చాతుర్థిక (చలి జ్వరములు) జ్వరములు హరించును.

## 151. ప్ర ద రా రి లో హ వ టి

భై॥ ర. (స్త్రీ॥ రో.)

శ్లో॥ శ్వేతం రక్తం తథానీలం పీతం ప్రదర దుస్తరం
కుక్షిశూలం కటీశూలం దేహశూలం సర్వగం.

ద్రవ్యములు:—అభ్రకభస్మము, లోహభస్మము, మంజిష్ఠ, శాల్మలీ, తుంగముస్తలు, అతివస, కొడిశపాలరసక్రియ మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—గ్రాహి, గర్భాశయరోగహరము, ప్రదరరోగహరము, కుక్షిశూలహరము.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దర్భవేళ్ల కషాయముతో సేవించిన తెలుపు, ఎరుపు, నలుపు, పసుపు వర్ణములతో గూడిన ప్రదరవ్యాధులు నివర్తించును. మరియు కుక్షిశూల, కటిశూల, సర్వాంగశూలలు తగ్గును.

(అ. భూ.) అశోకారిష్టముతోగాని, బబ్బులారిష్టముతోగాని సేవించిన సమస్త ప్రదరవ్యాధులు, ఉదరశూల, ప్రదరములవలన కలుగు నడుము నొప్పులు తగ్గును.

కుటజారిష్టముతో సేవించిన రక్తగ్రహణి, రక్తాతిసారములు నివర్తించును.

## 152. పునర్నవాది మాండూరవటి

(పునర్నవాది మాండూరము)

భై॥ ర॥ (పాండు, కామిలాధి కారము)

శ్లో॥ పాండుశోఫోదరానాహ శూలార్శః। క్రిమిగుల్మనుత్.

ద్రవ్యములు:— తెల్లగలిజేరు, తెగడ, త్రికటుకములు, త్రిఫలములు, పసుపు, పుష్కరమూలము, మాండూరభస్మము, మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, పాచనము, రక్తవృద్ధికరము, క్రిమిహరము, పాండు, కామిల, ఉదరరోగములను హరించును.

ప్రమాణము:—1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని పునర్నవారిష్టముతో సేవించిన శోఫ, పాండు, కామిలావ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిజేయును.

పల్లేరు, కొండపిండి వేళ్లు, కటుకరోహిణి వీనికషాయముతో నుపయోగించిన మలబద్ధకమును పోగొట్టి మూత్రమును జారీచేసి ఉదర వ్యాధులను తగ్గించును.

లోహాసవముతో సేవించిన క్రిమిజపాండువును హరింపజేసి రక్తము వృద్ధిజేయును.

## 153. భల్లాతకవటి

(వై॥ యో॥ ర.)

ద్రవ్యములు:—జీడిగింజలు, నువ్వులు, కరక్కాయలు, బెల్లము యివి సమభాగములుగా యుండును.

గుణము:—రక్తశుద్ధికరము, త్వచ్యము, అర్శోరోగహరము, వాతహరము.

ప్రమాణము:—1 మొదలు 3 మాత్రల వరకు (మాత్ర 5 గ్రైనుల ఎత్తువుండును.)

ప్రయోగములు:-(అ. భూ.) దీనిని ఉదయసాయంకాలములయందు గోరువెచ్చని ఆవుపాలతో సేవించిన యెడల ఆమవాతము, వాతనొప్పులు సవామేహమువలన కలుగు వివిధ వికారములు, సవామేహమువలన కలుగు కీళ్లనొప్పులు, భగందరము, విసర్పి మొదలగు వ్యాధులు హరించును.

శారిబాద్యరిష్టముతో సేవించిన కురుపులు, మాంసగ్రంథులు, కుష్టము, పొడలు, తగ్గును.

చంద్రచెక్క కషాయముతో సేవించిన తెల్లని, ఎఱ్ఱని పొడలు శ్విత్రము, కుష్టములను పోగొట్టును మరియు అర్శోరోగములను కూడా హరించును.

N B. ఇది కొంతమందికి గిట్టక శరీరముపై పొక్కులు దురదలు కలుగవచ్చును. కనుక జాగ్రత్తగా వాడుకొనవలెను. ఇంకనూ వివరములు ముందు "అమృతభల్లాతకీ లేహ్యము" వద్ద వ్రాయబడినవి కావున చూడవలెను.

## 154. బాలసంజీవని వటి

(అనుభూతము.)

ద్రవ్యములు:—వసకాల్చిన మసి, శొంఠి, రసకర్పూరము, సదాపాకు, రసభస్మము.

గుణము:—వాత కఫహరము, అజీర్ణహరము, రేచనము.

ప్రమాణము:— 1 మొదలు 3 మాత్రలవరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని తమలపాకు రసముతోగాని చనుపాలతోగాని వుపయోగించిన పిల్లలకు కలుగు అజీర్ణములు, దగ్గు, పడిశములను హరింపజేసి విరేచనమును కలుగజేయును.

దీనిని ఆముదమునందు కలిపి నుపయోగించిన విరేచనమును కలుగజేసి అజీర్ణదోషములను హరింపజేయును.

వాముర సముతో నుపయోగించిన విరేచనమునందు కలుగు దుర్వాసనను పోగొట్టి అజీర్ణదోషమును హరింపజేయును.

N. B దీనిని 3 సంవత్సరములలోపు వయస్సుగల పిల్లలకే వాడవలయును. అంతకు మించిన యీడుగలవారికి పనిచేయజాలదు. ఇది కేవలము పసిపిల్లల కుపయోగించు ఔషధము.

## 155. బిల్వాది గుటిక

(భుజంగాది విషహర పాన నస్యాదులు అను పేరుతో యున్నది)

అ॥ హృ॥ (ఉత్తర॥ స్థా॥) 36 వ. అధ్యా.

శ్లో॥ భుజంగలూతోందురవృశ్చికాద్యైః । విషూచికాజీర్ణ గర జ్వరైశ్చ.

ద్రవ్యములు:—మారేడు, తులసిపువ్వు, కానుగవిత్తులు, గ్రంథితగరము, దేవదారు, త్రిఫలములు, త్రికటుకములు, పసుపు, మానుపసుపు యివియన్నియు సమభాగములుగా యుండును.

గుణము:—జంగమ, స్థావర, గరవిషహరము, గ్రహణ్యాతిసారహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 మాత్రల వరకు. (మాత్రలు గురిగింజలవలె యుండును.)

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని దిరిసినపువ్వు రసముతో సేవించిన జంగమ, స్థావర, గరవిషములను హరింపజేయును

దీనిని దిరిసెనపువ్వు రసమునందుగాని నీటితోగాని అరగతీసి నస్యాంజనములకు గూడ నుపయోగించిన అన్నిరకములైన విషవికారములు హరించును.

కొడిశపాల, దానిమ్మకాయ, వీట్ల కషాయముతో గాని, కుటజారిష్టముతోగాని సేవించిన బంకవిరేచనములు, అజీర్ణవిరేచనములు తగ్గును.

జంగమ విషములనగా:— విషజంతువులు, పురుగులయొక్క విషములు (అనగా పిచ్చికుక్క, నక్క, పంది, తేలు, పాము మొదలగు తిరుగుచుండు జంతువులయొక్క విషములు.)

స్థావర విషములనగా:— చెట్లు, దుంపలు మొదలగు నిలకడగా యుండు ద్రవ్యములయొక్క విషములు (అనగా నాభి, గన్నేరు, పాషాణములు, నల్లమందు, లోహములు మొదలగునవి.)

గరవిషమనగా:— పెట్టుమందులు.

## 156. బృ హ త్సూ ర ణ వ టి

శా॥ సం. (మ॥ ఖం.) 7 వ. అధ్యా.

శ్లో॥ ప్రబలాగ్నికరాఏతే తథార్శోనాశనాః పరాః
గ్రహణీంవాత కఫజాం శ్వాసంకాసం క్షయామయమ్.

ద్రవ్యములు:—అడవికంద, నేలతాడి, చిత్రమూలము, త్రిఫలములు, జీడిగింజలు, బెల్లము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, అర్శోరోగహరము, గ్రాహి, కాసశ్వాసహరము.

ప్రమాణము:— $\frac{1}{8}$ తు॥ మొదలు $\frac{1}{4}$ తులము వరకు.

ప్రయోగములు:—(చ॥ చి.) దీనిని చిరుబొద్ది కషాయము, దురదగొండికషాయము, మారేడుకాయగుజ్జు శొంఠికషాయము వీట్లలో

దేనితోనైననూ ప్రతిదినము సేవించిన అర్శోరోగములు హరించును. మరియు రక్తార్శస్సులయందు రక్తము అధికముగా పోవుటనుకూడా తగ్గించును.

దీనిని మజ్జిగతో సేవించిన సమస్త అర్శోరోగములు తప్పక హరించును.

(అ. భూ.) దీనిని అభయారిష్టముతో సేవించిన సమస్త అర్శో వ్యాధులను తగ్గించును. మరియు మూలవ్యాధులయందు సుఖముగా విరేచనము కలుగజేయును.

కొండకసాల, తుంగగడ్డలు, వీట్ల కషాయముతో సేవించిన రక్తార్శస్సులు, రక్తగ్రహణీ వ్యాధులు తగ్గగలవు.

## 157. మహాయోగరాజగుగ్గులు

(బృహత్ యోగరాజగుగ్గులు)

భై॥ ర॥ (ఆమవాతాధికారము)

శ్లో॥ సంధివాతం క్రోష్టుశీర్షం వాతం సర్వశరీరగమ్
అశీతిం వాతజాన్ రోగాం శ్చత్వారింశచ్చ పైత్తికాన్.

ద్రవ్యములు:—త్రికటుకములు, త్రిఫలములు, చాతుర్జాతకములు, త్రిలవణములు, చిరుబొద్ది, వస, లోహభస్మము, వంగభస్మము, అభ్రకభస్మము, గుగ్గిలము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వాతహరము, బల్యము, త్రిదోషహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు. (మాత్ర 2 గురిగింజల ఎత్తుయుండును.)

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని ఉష్ణోదకముతో సేవించిన ఆమవాతము, కటివాతము, ఏకాంగవాతము మొదలగు వాతరోగములను హరింపజేయును.

(అ. భూ.) దీనిని ఆవుపాలతోగాని, మహారాస్నాది కషాయముతోగాని సేవించిన శోణితవాతము, కీళ్ళవాతము, వాతరక్తములను హరింపజేయును మరియు మేహవాతనొప్పులు(కీళ్ళనొప్పులు)కూడతగ్గును.

చంద్రచెక్క, సుగంధిపాల వీట్ల కషాయముతోగాని ఖదిరారిష్ట ముతోగాని సేవించిన రక్తదోషములు, కుష్ఠములు హరించును.

తుమ్మచెక్క కషాయముతోగాని, బబ్బులారిష్టముతోగాని సేవించిన స్త్రీలకు కలుగు శ్వేతరక్త ప్రదరములు తగ్గును.

అశ్వగంధారిష్టముతో సేవించిన కృశత్వమువలన కలుగు పక్ష వాతము, తిమిరవాతము, అర్దితవాతము మొదలగు వాతవ్యాధులు హరించును.

## 158. యో గ రా జ గు గ్గు లు

భై॥ ర. (ఆమ వాతాధికారం)

శ్లో॥ ఆమవాతాఢ్య వాతాదీన్ క్రిమిదుష్టవ్రణానిచ
ప్లీహగుల్మోదరానాహా దుర్నామాని వినాశయేత్.

ద్రవ్యములు:—చిత్రమూలము, మోడి, వాయువిడంగములు, దేవదారు, యాలకులు, చంగల్వకోష్టు, సన్నరాష్ట్రము, త్రిఫలములు, త్రికటుకములు, యవక్షారము, గుగ్గిలము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వాతహరము, రక్తశుద్ధికరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:— మహాయోగరాజగుగ్గులుకు వ్రాయబడిన అనుపానములనే దీనికి వుపయోగించ వచ్చును.

## 159. వి షూ చి వ టి

(అనుభూతము)

ద్రవ్యములు:—సర్జీరసము, అగశియాకుస్వరసము.

గుణము:—గ్రాహి, విషూచి, గ్రహణ్యాతిసారహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రల వరకు (మాత్రలు పెసరగింజలవలె యుండును.)

ప్రయోగములు:—దీనిని వాము మాడ్చిన కషాయముతో నుపయోగించిన పిల్లలకు కలుగు అజీర్ణవిరేచనములు, అతిసారములు తగ్గును.

దీనిని పెద్దవారు కర్పూరాద్యరిష్టముతో సేవించిన విషూచి (కలరా) అమాతిసారములు, గ్రహణీ వ్యాధులు హరించును.

యింకనూ వాతవ్యాధులయందుకూడా పనిచేయును.

## 160. రజః ప్రవర్తినీవటి

ర॥ సా॥ సం॥ (యోనివ్యాపత్ చికిత్సావ్యాఖ్యానములోనిది)

శ్లో॥ రజోరోధవ్యథాన్ కష్టరజః స్రావవ్యథామ్ తథా
రజః ప్రవర్తినీ హ్యేవ నీలకంఠేన భాషితా.

ద్రవ్యములు:— వెలిగారము, ఇంగువ, కాసీససిందూరము, ముసాంబ్రము యివి సమభాగములుగా యుండును.

గుణము:— స్రోతశ్శోధనము, గర్భాశయరోగహరము, ఋతు శూల హరము, రజః ప్రవర్తనము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు.

ప్రయోగములు:— (అ. భూ.) దీనిని అశోకారిష్టముతోగాని, నల్లనువ్వులు, నల్లవులవలు వీనికషాయముతోగాని సేవించిన ఋతుబద్ధ మును పోగొట్టి ఋతుశూలను (ముట్టుకడుపు నొప్పిని) హరింపజేయును.

జీరకాద్యారిష్టముతో సేవించిన ఋతువును జారీజేసి గుండెకు బలమును కలుగజేయును.

మరియు అశోకవటికి వ్రాయబడిన అనుపానములతోగూడ దీనిని సేవించవచ్చును.

## 161. ల శు నా ది వ టి

(వాతరోగేలశునవిధిఃఅనియున్నది.)

యో॥ ర॥ (వాత॥ ప్ర.)

శ్లో॥ వాతామయం నిహన్త్యేవ మర్దితం చాపతన్త్రికమ్
ఏకాఙ్గ రోగిణాంరోగం తథాసర్వాఙ్గ రోగిణామ్.

ద్రవ్యములు:— వెల్లుల్లి, ఇంగువ, జీలకఱ్ఱ, సైంధవలవణము, సౌవర్చలవణము, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు.

గుణము:—వాతహరము, శూలహరము, క్రిమిహరము.

ప్రమాణము:— 1 మొదలు 3 మాత్రల వరకు (మాత్రలు కంది గింజల వలెయుండును.)

ప్రయోగములు:—(యో॥ ర.) దీనిని ఆముదపువేళ్ల కషాయముతో సేవించిన వాతవ్యాధులు; అర్దితవాతము, అపతంత్రకవాతము, ఏకాంగవాతము మొదలగు వాతరోగములు హరించును. మరియు శూలలు, క్రిమిరోగములుకూడా హరించును.

(అ. భూ.) దీనినే చిన్నబిడ్డగుణము (బాలాపస్మారము) వచ్చు బాలురకు వాముర సముతో నెలరోజులు విడవకుండా వుపయోగించిన బాలాపస్మారములు రాకుండా కాపాడును.

దీనిని అజామోదార్కముతో నుపయోగించిన సమస్త శూలవ్యాధులు, క్రిమిరోగములు హరించును.

## 162. లఘుసూరణ మోదకము

యో॥ ర॥ (అర్శోరోగాధికారః)

శ్లో॥ ... . ... అర్శస్సుః పరంపాచన దీపనః.

ద్రవ్యములు:—చిత్రమూలము, అడవికంద, బెల్లము శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు.

గుణము:—దీపనము పాచనము, అర్శోరోగ హరము.

ప్రమాణము:— 1/16 తు॥ మొదలు ¼ తు॥ వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) ఉత్తరేణుగింజల రసముతో సేవించిన అర్శోరోగికి రక్తము పడుటను ఆపుజేసి బాధను తగ్గించును.

దీనిని అభయారిష్టముతో సేవించిన సమస్త అర్శోరోగములు, (మూలవ్యాధులు)మలబద్ధకముహరించును. మరియు ఆకలినివృద్ధిజేయును.

దీనిని మజ్జిగతో సేవించుచూ కేవలము మజ్జిగనే ఆహారముగా తీసుకొనుచుండిన సమస్త అర్శస్సులను వూడిపోవునట్లు జేయును.

ఇది మూలవ్యాధుల కత్యుత్తమమైన ఔషధము.

## 163. విషమజ్వరవటి

(అనుభూతము)

ద్రవ్యములు:-కాసీససిందూరము, శీతాంశురసము, క్వైనైన్ సల్ఫేట్.

గుణము:—విషమజ్వరహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రల వరకు (మాత్రలు గురిగింజలవలె యుండును.)

ప్రయోగములు:—దీనిని పంచతిక్తరసాయనముతోగాని, కిరాతారిష్టముతోగాని, సేవించిన విషమజ్వరము (మలేరియా జ్వరము)లు, సామాన్యజ్వరములు హరించును.

ఇది మలేరియా జ్వరములయందు బాగుగాపనిచేయును. క్వైనైన్ యొక్క వికారములను కలుగజేయదు.

## 164. శంఖవటి (బృహత్)

(మహాశంఖవటి)

భై॥ ర. (అగ్నిమాంద్యాధికారః)

శ్లో॥ భుక్త్వాకంఠంతు తస్యాంతే ఖాదేచ్చగుటికామిమాం
తత్క్షణాజ్జారయత్యాశు సర్వాజీర్ణవినాశినీ.

ద్రవ్యములు:—శంఖభస్మము, పంచలవణములు, చింతక్షారము, త్రికటుకములు, ఇంగువ, నాభి, పాదరసము, గంధకము, లోహభస్మము, వంగభస్మము మొదలగునవి కలవు.

గుణము:—దీపనము, పాచనము, శూలహరము, గ్రాహి.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) కంఠపర్యంతము భుజించిన పిమ్మట దీనిని వేడినీళ్లతో సేవించిన యెడల వెంటనే జీర్ణమగునటుల జేయును. మరియు సమస్త అజీర్ణములను హరింపజేయును.

(అ. భూ.) సైంధవలవణము చేర్చిన మజ్జిగతో సేవించిన అజీర్ణము అజీర్ణవిరేచనములు తగ్గును.

అజమోదార్కము (వాంవాటరు)తో సేవించిన అజీర్ణమువలన కలిగిన శూలలు హరించును.

వాముసముతో పిల్లలకుపయోగించిన అజీర్ణవిరేచనములు, (అనగా తెల్లగా విరేచనమగుట, వారనగాయుండుట మొదలగునవి) తగ్గును.

## 165. శ్వాసానంద వటి

ఆ॥ క॥ (గుటికా॥ ప్ర) మరియు యో॥ త॥

శ్లో॥ ... ... ... కాసానిల క్షయాన్

హిక్కాంచ హరతి క్షిప్రం శ్వాసానందాహ్వయామతా.

ద్రవ్యములు:—ఇంగిలీకము, నాభి, పచ్చకర్పూరము, యివి సమభాగములుగా యుండును.

గుణము:—స్రోతశ్శోధకము, వాతకఫహరము, తమకశ్వాసహరము.

ప్రమాణము:—1 మొదలు 3 మాత్రలవరకు. (మాత్రలు పెసలువలె యుండును.)

ప్రయోగములు:—(ఆ॥ క॥) పంచదార కలిపిన చనుపాలతో సేవించిన దగ్గు, వాతరోగములు, క్షయలు, ఎక్కిళ్ళు అనువానిని శీఘ్రముగా హరింపజేయును.

(అ. భూ.) తమలపాకు రసముతో సేవించిన కఫమును హరింపజేయును.

మిరియాల కషాయముతో సేవించిన కంఠనాళములయందు చుట్టుకొని యుండు కఫమును కరగింపజేసి స్రోతస్సులను శుభ్రపరచును.

వాసారిష్టముతో నుపయోగించిన తమకశ్వాస (ఉబ్బసము) యందు కలుగు ఆయాసమును వెంటనే తగ్గించును.

## 166. సూ తి కా మా త్ర లు

ఆ॥ ఔ॥ ర. (ద్వితీయగుచ్ఛము)

ద్రవ్యములు:—కస్తూరి, జున్ను, పావుదారు, రొయ్యపీత, గోరోజనము, సూతికాభరణము, త్రైలోక్యచింతామణి, సువర్ణవాతరాక్షసము,

సన్నిపాతము, కాలకూటము, రసకర్పూరము, వాతవిధ్వంసి, వాతరాక్షసము యివి సమభాగములుగా యుండును.

గుణము:—వాతకఫహరము, శీతహరము, సన్నిపాతజ్వరహరము, సూతికావాతహరము, హృద్యము.

ప్రమాణము:— 1 మాత్ర మొదలు 2 మాత్రల వరకు.

ప్రయోగములు:–(అ. భూ.) దీనిని తమలపాకురసముతోగాని, వేడినీళ్లతోగాని సేవించిన సూతికల (బాలింతల)కు కలుగు జ్వరములు, సూతికావాతములు, కాళ్లు చేతులు చల్లదనమును తగ్గించి శరీరమునకు వేడిని కలుగజేసి బాలింతలకు సుఖమును కలుగజేయును.

దీనిని జీరకాద్యరిష్టముతోగాని, అశోకారిష్టముతోగాని సూతికల కుపయోగించిన ఋతు (మైల)వును జారీచేసి హృదయమునకు బలము కలుగజేయును.

ఆకుజెముడాకులరసముతో సేవించిన కంఠగతమగు కఫమును, సన్నిపాతజ్వరములను, వాతవ్యాధులను హరింపజేయును.

దీనిని దశమూలారిష్టముతోగూడా పై వ్యాధులయందుపయోగించు కొనవచ్చును.

N. B. ఈ మాత్రలు ప్రసవించిన స్త్రీలకు ఏసుస్తి లేకపోయినప్పటికి పూటకు 1 మాత్ర చొ॥న 3 రోజులువాడి స్నానముచేసినప్పుడు 1 మాత్ర వాడినచో సూతికా సంబంధమైన వ్యాదులను రాకుండా కాపాడును. గర్భిణీ స్త్రీలకు ప్రసవకాలము సమీపింపగనే యీమాత్రలను పదింటిని యింట సిద్ధముగా నుంచుకొనుటత్యావసరము.

## 167. క్షారమాండూర వటి

(అనుభూతము.)

ద్రవ్యములు:—మాండూరభస్మము, రేవల్‌చిన్ని, రుద్రబేవరు, లవంగాలు, మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—మూత్రలము, శోఫహరము, ఉదర రోగహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 మాత్రలవరకు. (మాత్రలు గురిగింజల వలె యుండును.)

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని పునర్నవారిష్టముతో సేవించిన నంజు, ఉదరవ్యాధులు గలవారికి మలమూత్రములను జారీజేసి శరీరమందుండు వాపును తగ్గించును.

త్రిఫలా కషాయముతో సేవించిన క్రిమిసంబంధమైన పాండు శోఫవ్యాధులను హరింపజేయును.

లోహాసవముతో సేవించిన శోఫ, ఉదరవ్యాధులు గలవారికి మూత్రవిరేచనములను జారీచేయుచూ వ్యాధిని తగ్గింపజేసి రక్తమును వృద్ధిజేయును.

---

## ఆసవములు - అరిష్టములు

ప్రతి ఆసవారిష్టమును సేవించునప్పుడు ఔషధమునకు సమము నీరును చేర్చి త్రాగవలయును.

### 168. అభయారిష్టము

భై॥ ర. (అర్శో॥ రో.)

శ్లో॥ అర్శాంసినాశయేచ్ఛీఘ్రం తథాష్టా వుదరాణిచ
వర్చోమూత్రవిబంధఘ్నో వహ్నిం సందీపయే త్త్వరమ్.

ద్రవ్యములు:—కరక్కాయలు, ద్రాక్ష, వాయువిడంగములు, ఇప్పపువ్వు, బెల్లము, పల్లేరు, చేదుపుచ్చ మొదలగుద్రవ్యములసారములుగలవు.

గుణము:—శోధనము, ఉదరశోఫహరము, అర్శోరోగహరము, మలబద్ధహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని నిత్యము త్రాగుచుండిన అర్శోవ్యాధులు, ఎనిమిది విధములైన ఉదరములు, మలబద్ధము, మూత్రబంధములను పోగొట్టును మరియు ఆకలిని కలుగ జేయును.

(అ. భూ.) దీనిని రజితలోహరసాయనము, లోకనాథరసము, కాంతవల్లభరసములకు అనుపానముగా సేవించిన ఉదరశోఫరోగములు హరించును.

బృహత్పూరణవటి, కాంకాయనగుటికలకు దీనిని అనుపానముగా సేవించిన రక్తముతోగూడిన అర్శోరోగము (మూలరోగము)లు, మల బద్ధము హరించును.

## 169. అశోకారిష్టము

భై॥ ర॥ (స్త్రీ॥ రోగాధి॥)

శ్లో॥ మాసాదూర్ధ్వంచ పీత్వేన మసృగ్దరరుజాంజయేత్
జ్వరంచరక్తపిత్తార్శో మందాగ్నిత్వ మరోచకం.

ద్రవ్యములు:—అశోకపట్ట, బెల్లము, మరియు త్రిఫలములు, మామిడిజీడి, శొంఠి, మొదలగు ద్రవ్యముల సారములు గలవు.

గుణము:—గ్రాహి, ప్రదరరోగహరము, గర్భాశయరోగహారము, వంధ్యాదోష హరము.

ప్రమాణము:— ¼ ఔ. మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని నిత్యము త్రాగుచుండిన ప్రదరరోగములు, జ్వరము,రక్తపిత్తము,మూలవ్యాధి, అగ్నిమాంద్యము, అరోచకములను హరింపజేయును.

(అ. భూ.) దీనిని స్వర్ణమాలినీ వసంతము, అభ్రకభస్మము, స్వర్ణమాక్షిక భస్మములకు అనుపానముగా సేవించిన స్త్రీలకు కలుగు అన్నివిధములగు ప్రదరములు, అపస్మారము, గర్భాశయ వ్రణములు హరించును. మరియు రక్తపిత్తములు గూడా తగ్గును.

అశోకవటి, రజఃప్రవర్తనీ వటులకు దీనిని అనుపానముగా సేవించిన స్త్రీలకు కలుగు ఋతుశూల (ముట్టుకడుపు నొప్పి) ఋతుబద్ధములు హరించును.

కాంతభస్మమునకు అనుపానముగా సేవించిన స్త్రీలకు రక్తక్షీణత

వలన కలిగిన ఋతుబద్ధము హరించును. మరియు గర్భాశయదోషములను హరింపజేసి సంతానప్రాప్తిని కలుగజేయును.

## 170. అర్జునారిష్టము

భై॥ ర. (హృద్రోగాధికారః)

శ్లో॥ హృత్ఫుప్ఫుసగదాన్ సర్వాన్ హంత్యయం బలవీర్యకృత్.

ద్రవ్యములు:—మద్దిపట్ట, ద్రాక్ష, ఇప్పపువ్వు, ధాతకీ, బెల్లము, వీట్లసారములు గలవు.

గుణము:—హృద్యము, పుప్పుసరోగహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని నిత్యము త్రాగుచుండిన అన్ని విధములైన గుండెజబ్బులను, ఊపిరితిత్తులకు సంబధించిన వ్యాధులను హరించుటయేగాక బలమును వీర్యమును కలుగజేయును.

(అ. భూ.) దీనిని క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసము, శృంగభస్మము లకు అనుపానముగా సేవించిన సమస్త హృద్రోగములు, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు హరించి బలము కలుగజేయును.

పూర్ణచంద్రోదయము, రజితచంద్రోదయములకు అనుపానముగా సేవించిన శుక్రనష్టమువలన కలిగిన గుండెజబ్బులను హరింపజేయును.

దీనిని ద్రాక్షారిష్టముతో కలిపి సేవించిన గుండెదడ, రక్తపిత్తము పిత్తోద్రేకములు తగ్గగలవు.

## 171. అశ్వగంధారిష్టము

భై॥ ర॥ (మూర్ఛ॥ రో॥)

శ్లో॥ మూర్ఛాయపస్మృతిం శోషం ఉన్మాద మపిదారుణం
కార్శ్యమర్శాంసిమందత్వ మగ్నేర్వాత భవాన్ గదాన్.

ద్రవ్యములు:—పెన్నేరు, నేలతాడి, మంజిష్ఠ, పసుపు, నేల గుమ్ముడు, మద్దిపట్ట, సుగంధి, చందనము, తేనె, ధాతకీపుష్పం త్రికటుక ములు మొదలగు ద్రవ్యముల సారములు గలవు.

గుణము:—బృంహణము, బల్యము, స్మృతికరము, వాతహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని నిత్యము సేవించిన మూర్ఛ, అపస్మారము, శోష, ఉన్మాదము, కృశత్వము, మూలవ్యాధులు, అగ్నిమాంద్యము, వాతరోగములు హరించును.

(అ. భూ.) దీనిని రసరాజరసమునకు అనుపానముగా సేవించిన కృశత్వమును పోగొట్టి శరీరమునకు బలము కలుగజేయును. మరియు మూర్ఛ, అపస్మారము, మొదలగు మెదడుకు సంబంధించిన వ్యాధులను వాతరోగములను హరింపజేయును.

సిద్ధమకరధ్వజము, రజితచంద్రోదయము, వంటసువర్ణసూర్యావర్తి వీట్లకు అనుపానముగా సేవించిన శుక్రనష్టమువలన కలిగిన బలహీనతను, బుద్ధిమాంద్యమును, తగ్గించి శరీరమునకు, బుద్ధికి మంచి బలమును కలుగజేయును.

దీనిని అశోకారిష్టమునందు సమభాగముగా కలిపి రసరాజరసమునకు అనుపానముగా సేవించిన స్త్రీలకు కలుగు వంధ్యాదోషములు, మరియు ఋతుదోషమువలన కలుగు అపస్మార (హిస్టీరియా)ములు హరించును.

## 172. అరవిందాసవము

భై॥ ర. (బా॥ రో॥ కా.)

శ్లో॥ బాలానాం సర్వరోగఘ్నః బలపుష్ట్యగ్ని వర్ధనః
అరవిందాసవః ప్రోక్త ఆయుష్యో గ్రహదోషహృత్.

ద్రవ్యములు:—తామరపూలు, వట్టివేళ్లు, నల్లకలువ, ఏలకాయలు, త్రిఫలములు, ధాతకీపుష్పం, ద్రాక్ష, పంచదార, తేనె మొదలగు ద్రవ్యముల సారములు కలవు.

గుణము:—బల్యము, ఉష్ణశమనము, బాలరోగహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు ½ ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని ప్రతినిత్యము సేవించిన

బాలురసమస్తరోగములను హరింపజేయును. మరియు బలమును, పుష్టిని, ఆకలిని వృద్ధిపొందించును.

(అ. భూ.) దీనిని షడ్గుణము తిప్పసత్తుకు అనుపానముగా నుపయోగించిన పిల్లలకు కలుగు అత్యుష్ణమును తగ్గించి బలమును కలుగజేయును. మరియు ఆకలిని వృద్ధిజేయును.

చ్యవనప్రాశలేహ్యమునకు అనుపానముగా త్రాగినయెడల శ్వాసకాసలను హరింపజేసి హృదయమునకు, శరీరమునకు బలము కలుగజేయును.

¼ ఔన్సు మొదలు ½ ఔన్సువరకు బాలుర వయస్సు ననుసరించి వాడవలెను.

## 173. అ మృ తా రి ష్ట ము

భై॥ ర॥ (జ్వరాధికారః)

శ్లో॥ అమృతారిష్టఇత్యేవ ప్రోక్తోజ్వర కులాంతకృత్.

ద్రవ్యములు:—తిప్పతీగె, దశమూలములు, బెల్లము, జీలకఱ్ఱ, త్రికటుకములు, నాగకేసరములు, కటుకరోహిణి, మొదలగు ద్రవ్యముల సారములు కలవు.

గుణము:—జ్వర, విషమజ్వర, సన్నిపాత జ్వరహరము, పిత్తహరము.

ప్రమాణము:— ½ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన సర్వజ్వరములు హరించును.

(అ. భూ.) దీనిని శీతాంశు రసము, ఆనందభైరవి లకు అనుపానముగా సేవించిన సామాన్య జ్వరములు, పిత్తజ్వరములు, హరించును.

మహాజ్వరాంకుశమునకు అనుపానముగా సేవించిన వాతజ్వరములు, స్వర్ణమాలినీ వసంతరసమునకు అనుపానముగా సేవించిన పురాణజ్వరములు హరించును.

విషమజ్వరవటికి అనుపానముగా సేవించిన విషమజ్వరము

(మలేరియా)లు మరియు సంతత, సతతక, అన్యేద్యుష్క మొదలగు విషమ జ్వరములు హరించును.

## 174. ఉశీరాసవము

భై॥ ర॥ (రక్తపిత్తాధికారః)

శ్లో॥ ఉశీరాసవ ఇత్యేవ రక్తపిత్తవినాశనః
పాండు కుష్ఠప్రమేహార్శః కృమిశోథహర స్తథా.

ద్రవ్యములు:—వట్టివేళ్ళు, కురువేరు, నల్లకలువ పూవులు, పద్మకాష్టము, లొద్దుగపట్ట, మంజిష్ఠ, మఱ్ఱిపట్ట, కచ్చూరములు, చేదుపొట్ల, బూరుగబంక, ద్రాక్ష, ధాతకీ, పంచదార, తేనె మొదలగు ద్రవ్యముల యొక్క సారములు గలవు.

గుణము:—రక్తపిత్తహరము, ప్రమేహహరము, క్రిమిహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన రక్తపిత్తములు, పాండువు, కుష్టములు, ప్రమేహములు, మూలవ్యాధి, క్రిమిరోగములు, నంజులు హరించును.

(అ. భూ.) దీనిని అభ్రక భస్మమునకు గాని, రక్తమాహేశ్వర రసమునకు గాని అనుపానముగా సేవించిన ఊర్ధ్వగత అధోగత రక్తపిత్తములు, రక్తప్రదరములు హరించును.

దీనిని మేహవంగ రాజీయమునకు అనుపానముగా సేవించిన ఇంద్రియనష్టము, అతిశీఘ్రస్ఖలనము, కాళ్లుచేతులు మంటలు తగ్గును.

పంచలోహ రసాయనమునకు అనుపానముగా సేవించిన సమస్త ప్రమేహములు, క్రిమిసంబంధమైన పాండువు, నంజులను హరింపజేసి రక్తమును వృద్ధిజేయును.

పంచామృత పర్పటికి అనుపానముగా సేవించిన రక్తాతిసారములు రక్తగ్రహణులు తగ్గగలవు.

## 175. క న కా స వ ము

భై॥ ర॥ (హిక్కా—శ్వాసాధికారః)

శ్లో॥ నిహంతి నిఖిలాన్ శ్వాసాన్ కాసంయక్ష్మాణమేవచ
క్షతక్షీణం జ్వరంజీర్ణం రక్తపిత్తమురః క్షతమ్.

ద్రవ్యములు:—నల్లఉమ్మెత్త సమూలం, అడ్డసరము, ఇప్పపువ్వు, పిప్పళ్లు, వాకుడు, ధాతకీపుష్పం, ద్రాక్ష, పంచదార, తేనె మొదలగు ద్రవ్యముల సారములు కలవు.

గుణము:—స్రోతశ్శోధనము, కఫహరము, కాసశ్వాసహరము, క్షయహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన అన్నిరకముల శ్వాసలు, దగ్గులు, క్షయరోగము, జీర్ణజ్వరము, రక్తపిత్తము, ఉరఃక్షతములు హరించును.

(అ. భూ.) దీనిని రసభూపతి, రసరాట్, సితోపలాది చూర్ణములకు అనుపానముగా సేవించిన పడిశము, దగ్గు, శ్వాసకాసలు హరించును.

వాతాగ్ని కుమారమునకు అనుపానముగా తీసుకొనిన తమక శ్వాసలు (ఉబ్బసము) హరించును.

క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసము, స్వర్ణమాలినీ వసంతరసములకు అనుపానముగా సేవించిన క్షయ, జీర్ణజ్వరము, ఉరఃక్షతము, రక్తపిత్తములు హరించును.

## 176. క ర్పూ రా ద్య రి ష్ట ము (కర్పూరాద్యర్కము)

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—హారతికర్పూరము, వాము, పీట్ల సారములు గలవు.

గుణము:— స్తంభనము, దీపనము, గ్రహణ్యాతిసారహరము, కఫహరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(అ. భూ) దీనిని అష్టాక్షరీ గుటిక, చిత్రకాది వటి, విషూచివటి, శంఖవటులకు అనుపానముగా సేవించిన అజీర్ణవిరేచనములు, ఆమాతిసారము, విషూచి, గ్రహణీ వ్యాధులు హరించును.

కర్పూరాది వటికి అనుపానముగా సేవించిన విషూచి (కలరా) అజీర్ణ విరేచనములు, కాసశ్వాసలు హరించును.

దీనికి సమము కుటజారిష్టమును కలిపి పంచామృత పర్పటి, మహా గంధకపర్పటి మొదలగు పర్పటులకు అనుపానముగా నుపయోగించిన గ్రహణీవ్యాధులయందు పనిచేయును.

## 177. కిరాతారిష్టము.

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—నేలవేము, బెల్లము, తేనె, పంచకోలములు వీట్ల సారములు గలవు.

గుణము:—పాచనము, జ్వరహరము, క్రిమిహరము, త్వచ్యము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు ½ ఔన్సు వరకు.

ప్రయోగములు:—దీనిని విషమజ్వరవటికి అనుపానముగా సేవించిన చలిజ్వరము (మలేరియా)లు, విషమజ్వరములు హరించును.

సన్నిపాతభైరవికి అనుపానముగా నుపయోగించిన మన్యపు జ్వరములు తగ్గును.

శీతాంశురసము, తిప్పసత్తులకు అనుపానముగా నుపయోగించిన సమస్త జ్వరములయందు ఆమమును పచనము జేయును మరియు చర్మగతరోగములుకూడా తగ్గగలవు.

దీనిని ఆహారము సేవించినపిదప అరగంటకు గాని, ఈయౌషధమును సేవించినపిదప అరగంటకు ఆహారమునుగాని తీసుకొనవలయును.

## 178. కుటజారిష్టము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 10॥ వ. అధ్యా:

శ్లో॥ జ్వరాన్ ప్రశమయేత్సర్వాన్ తీక్ష్ణంధనంజయం
దుర్వారాన్ గ్రహణీన్ హంతి రక్తాతీసారముల్బణం॥

ద్రవ్యములు:—కొండిశపాలపట్ట, ద్రాక్ష, ఇప్పపువ్వు, పెగ్గుమ్ముడు, బెల్లము, ధాతకీపుష్పము వీటియొక్క సారములుగలవు.

గుణము:—గ్రాహి, జ్వరహరము, గ్రహణ్యతిసారహరము, పాచనము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(శా॥ ధ॥) దీనిని సేవించిన సమస్త జ్వరములు హరించి ఆకలినివృద్ధిజేయును, మరియు గ్రహణి, రక్తాతిసారములను తగ్గించును.

(అ. భూ.) దీనిని కర్పూరాదివటి, చిత్రకాదివటి, శంఖవటులకు అనుపానముగా సేవించిన అజీర్ణవిరేచనములు, ఆమాతిసారములు, గ్రహణీ వ్యాధులు హరించును.

పంచామృతపర్పటి, మహాగంధకపర్పటి, అష్టాక్షరీగుటికలకు అనుపానముగ సేవించిన అసాధ్యమగు గ్రహణీవ్యాధులు, రక్తాతిసారములు తగ్గగలవు.

దీనికి సమము బబ్బులారిష్టమును కలిపి పై యౌషధములకు అనుపానముగా సేవించిన రక్తాతిసారములయందు బాగుగ పనిజేయును.

## 179. కుమార్యాసవము.

యో॥ ర॥ (గుల్మ॥ ప్ర॥)

శ్లో॥ జారరం కురుతేదీప్తం కోష్ఠశూలంచ నాశయేత్
గుల్మాష్టకం నష్టపుష్పం నాశయేదేకపక్షతః॥

ద్రవ్యములు:—కరక్కాయలు, కలబంద, బెల్లము, తేనె, ధాతకీ, జాజికాయలు, జాపత్రి, తామ్రభస్మము, లోహభస్మము మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—స్రోతశ్శోధనము, దీపనము, గుల్మోదరరోగహరము, ఋతువృద్ధికరము, శ్వాసకాసహరము.

ప్రమాణము:—½ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(యో॥ర॥) దీనినిపదునైదు దినములుత్రాగిన యెడల కాసశ్వాసములు, ఉదరరోగములు, గుల్మరోగములు, ఋతు నాశనమును హరించును. మరియు అగ్నిదీప్తిని కలుగజేయును.

(అ॥భూ) దీనిని ప్రవాళపంచామృతభస్మమునకు అనుపానముగా సేవించిన సమస్త గుల్మరోగములు, యకృత్ప్లీహరోగములు, కాస శ్వాసలు హరించును.

మేహవంగరాజీయమునకు అనుపానముగా సేవించిన పూయ మేహములు, వస్తిశూలలు నివర్తించును.

రజఃప్రవర్తనీవటికి అనుపానముగా సేవించినయెడల ఆర్తవ స్రోతోముఖములను వికసింపజేసి ఋతురక్తమును జారీజేయును.

## 180. ఖదిరారిష్టము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 10 వ॥ అధ్యా.

శ్లో॥ మహాకుష్ఠాని హృద్రోగం పాండురోగార్బుదం తథా
గుల్మగ్రంధిక్రిమీన్ శ్వాసం కాసం ప్లీహోదరం తథా
పీషవై ఖదిరారిష్ట సర్వకుష్ఠ నివారణః.

ద్రవ్యములు:—చంద్రచేవ, దేవదారు, బావంచాలు, మ్రాని పసుపు, త్రిఫలములు, తేనె, పంచదార, ధాతకీ, చాతుర్జాతకములు మొదలగు ద్రవ్యముల యొక్క సారములు గలవు.

గుణము:—కుష్ఠహరము, రక్తశుద్ధికరము, త్వచ్యము, క్రిమిహరము.

ప్రమాణము:— ½ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(శా॥ ధ॥) దీనిని నిత్యము సేవించుచుండిన కుష్ఠములు, గ్రంధులు, క్రిమిరోగములు, చర్మగతరోగములు హరించును.

(అ. భూ.) దీనిని సర్వవ్యాధిహరణరసమునకు అనుపానముగా సేవించిన రక్తదోషములు, కుష్టములు, కురుపులు; ప్రమేహపిటికలు హరించును.

గంధకరసాయనమునకు అనుపానముగా సేవించిన చర్మగత రోగములు, (అనగా దురద, పొడలు, చర్మముపగులుట మొదలగునవి) కుష్ఠము, శ్విత్రము (బొల్లి) హరించును.

అమృతభల్లాతకీ లేహ్యమునకు అనుపానముగా సేవించిన గ్రంధులు, అర్బుదములు, సమస్తకుష్ఠు వ్యాధులు తగ్గును.

## 181. చందనాసవము.

భై॥ ర॥ (ప్రమేహాధికారః॥)

శ్లో॥ చందనాసవ ఇత్యేష శుక్రమేహవినాశనః
బలపుష్టికరోహృద్యో వహ్ని సందీపనః పరః.

ద్రవ్యములు:—చందనము, కురువేరు, తుంగముస్తలు, కచూరములు, అతిమధురము, బూరుగబంక, ధాతకీ, ద్రాక్ష, పంచదార, బెల్లము మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—బల్యము, హృద్యము, మూత్రలము, ఉష్ణశమనము, శుక్రమేహహరము.

ప్రమాణము:—½ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ర॥) దీనిని సేవించిన శుక్రమేహమును హరింపజేసి శరీరమునకు బలమును, పుష్టిని కలిగించును. మరియు హృదయమునకు బలము కలుగచేయును. ఆకలిని వృద్ధిజేయును.

(అ॥భూ) దీనిని రజితచంద్రోదయము, స్వర్ణవంగములకు అనుపానముగా సేవించిన శుక్రమేహము, స్వప్నస్ఖలనములను తగ్గించి బలమును కలుగజేయును.

స్వర్ణవంగము, చందనాదివటులకు అనుపానముగా సేవించిన

గనేరియా వ్యాధులను తగ్గించును. మరియు మూత్రనాళములయందు కలుగు మంటను తగ్గించి మూత్రమును జారీజేయును.

దీనిని అభ్రకభస్మము, రక్తమార్తేశ్వరరసములకు అనుపానముగా తీసుకొనిన శ్వేతరక్తప్రదరములు, రక్తపిత్తములు తగ్గగలవు.

## 182. జీరకాద్యరిష్టము.

భై॥ ర॥ (స్త్రీ॥ రో॥ కా॥)

శ్లో॥ అరిష్టో జీరకాద్యోధ నిహన్యాత్ సూతికాగదాన్
గ్రహణీమతిసారంచ తథా వహ్నేశ్చ వైకృతిమ్.

ద్రవ్యములు:—జీలకర్ర, బెల్లము, ధాతికీ, శొంఠి, జాజికాయలు, లవంగములు మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—దీపనము, గ్రాహి, వాతహరము, గర్భాశయ శోధనము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన సూతికా వ్యాధులు, గ్రహణ్యతిసారములు, జఠరాగ్నివైకల్యములు హరించును.

(అ. భూ.) దీనిని సూతికా మాత్రలకు అనుపానముగా సేవించిన సూతికారోగము (Puerperal Deseases)లు, సూతికా వాతములు, సూతికలకు కలుగు ఒడలు నొప్పులు హరించును.

హింగ్వష్టక చూర్ణమునందు కాసీస సిందూరమును కలిపి సేవించి దీనిని అనుపానముగా సేవించినయెడల సూతికలకు మైలవిసర్జనము సరిగా కాకపోవుటవలన కలుగు కడుపునొప్పి, జ్వరములను హరింపజేసి మైల విసర్జనమును కలుగజేయును.

మరియు దీనిని రజఃప్రవర్తినీవటి, అశోకవటులకుకూడా అనుపానముగా సేవించిన పైన వ్రాయబడిన వ్యాధులయందు పనిజేయును.

దీనిని కుటజారిష్టమునకు సమముగాకలిపి సేవించిన గ్రహణీ వ్యాధులు తగ్గును.

## 183. దశమూలారిష్టము.

భై॥ ర॥ (వాజీకరణాధికారః.)

శ్లో॥ వాతవ్యాధింక్షయంఛర్దిం పాండురోగంచ కామలాం
కృశానాం పుష్టి జననో వంధ్యానాం పుత్రదఃపరః
అరిష్టోదశమూలాఖ్య స్తేజః శుక్రబలప్రదః.

ద్రవ్యములు:—దశమూలములు, చిత్రమూలము, పుష్కరమూలము, లొద్దుగపట్ట, దురదగొండి, కరక్కాయలు, వాయువిడంగములు, జీలకఱ్ఱ, సన్నరాష్ట్రము, కొడిశపాల, ద్రాక్ష, తేనె, ధాతకీ మొదలగు ద్రవ్యముల యొక్క సారములు గలవు.

గుణము:—దీపనము, పాచనము, రసాయనము, హృదయోత్తేజకము, వాతహారము, జ్వరహరము.

ప్రమాణము:— $\frac{1}{4}$ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన వాతరోగములు, క్షయలు, వాంతులు, పాండుకామిలారోగములు హరించును. మరియు కృశించిన వారికి పుష్టికలుగజేయును. గొడ్రాళ్లకు సంతానము కలుగజేయును.

(అ. భూ.) దీనిని పూర్ణచంద్రోదయము, రజితచంద్రోదయములకు అనుపానముగా సేవించిన శరీరమునకు పుష్టిని, శుక్రవృద్ధిని కలుగజేసి నరముల బలహీనత (Nerves Debelity) నుపోగొట్టును.

సువర్ణవాత రాక్షసమునకు అనుపానముగా సేవించిన సమస్తవాత రోగములు, సన్నిపాత జ్వరము, శ్వాసనిక సన్నిపాతములు హరించును.

దీనిని సూతికామాత్రలు, కస్తూరిమాత్రలకు అనుపానముగా సేవించిన సన్నిపాత జ్వరములు, సూతికావాతములు తగ్గును.

## 184. ద్రాక్షారిష్టము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 10 వ॥ అధ్యా.

శ్లో॥ ఉరఃక్షతం క్షయంహన్తి కాసశ్వాస గలామయాన్
ద్రాక్షారిష్టాహ్వయః ప్రోక్తోబలకృన్మలశోధనః.

ద్రవ్యములు:—ద్రాక్ష, పంచదార, బెల్లము, చాతుర్జాతక ములు, ప్రేంఖణము, మిరియాలు, పిప్పళ్లు, వాయువిడంగములు, పిట్ల యొక్క సారములు గలవు.

గుణము:—హృద్యము, బల్యము, పిత్తహరము, క్షయహరము, ఉరఃక్షతమును హరింపజేయును.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(శా॥ ధ॥) దీనిని నిత్యము సేవించిన యెడల ఉరఃక్షతము, క్షయ, కాసశ్వాసలు, కంఠరోగములు హరించును. మరియు శరీరమునకు బలము కలుగజేయును. మలబద్ధమును పోగొట్టును.

(అ. భూ.) దీనిని క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసమునకు అనుపాన ముగా సేవించిన ఉరఃక్షతము, క్షయ, కాసశ్వాసలు హరించును. మరియు శరీరమునకు బలము కలుగజేయును.

పూర్ణచంద్రోదయమునకు అనుపానముగా సేవించిన శుక్రనష్టము వలన కలిగిన క్షయ, బలహీనము, మలబద్ధకములను హరింజేసి బలమును కలుగజేయును.

వంగసువర్ణ సూర్యావర్తి, తిప్పసత్తులకు అనుపానముగా సేవిం చిన పైత్యోద్రేకమువలన కలుగు తలనొప్పి, తలతిరుగుట, గుండెదడ, వాంతులు, అజీర్ణము మొదలగువాటిని తగ్గించును.

సువర్ణసింధూరభూషణము లేక లఘుసింధూర భూషణమునకు అనుపానముగా త్రాగినయెడల గర్భపోషణము జరుగును. మరియు గర్భ వతులకు బలము కలుగజేయును.

సువర్ణక్రవ్యాదికి అనుపానముగా సేవించిన అగ్నిమాంద్యము, అజీర్ణములను హరింపజేయును.

## 185. పిప్పల్యాసవము

శా॥ ధ॥ సం. (మ॥ ఖం) 10 వ॥ అధ్యా.

శ్లో॥ క్షయంగుల్మోదరం కార్శ్యం గ్రహణీం పాండుతాం తథా
అర్శాంసినాశయేత్ శీఘ్రం పిప్పల్యాద్యాసవస్త్వయమ్.

ద్రవ్యములు:—పిప్పళ్ళు, మిరియాలు, చవ్యము, పసుపు, చిత్ర మూలము, వాయువిడంగములు, చందనము, చాతుర్జాతకములు, ధాతకీ, బెల్లము, ద్రాక్ష మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—దీపనము, పాచనము, కఫహారము, క్షయహారము.

ప్రమాణము:—¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(శా॥ధ) దీనిని సేవించిన క్షయ, గుల్మోదర ములు, కృశత్వము, సంగ్రహణి, పాండు, మూలవ్యాధులు హరించును.

(అ॥భూ) దీనిని మహారాజమృగాంకరసము, మహాకనకసుందర రసము, సువర్ణభూపతి వీట్లకు అనుపానముగా సేవించిన క్షయ, కృశ త్వము, కాసశ్వాసలు హరించును.

ప్రవాళపంచామృతభస్మమునకు అనుపానముగా సేవించిన గుల్మ ములు, ఉదరరోగములు హరించును.

సితోపలాదిచూర్ణమునకు అనుపానముగాసేవించిన స్రోతస్సులను శుభ్రపరచి, పడిశము, కాసశ్వాసలను తగ్గించును.

## 186. పునర్నవారిష్టము (పునర్నవాసవము)

గ॥ ని॥ (ఆసవాధికారః)

శ్లో॥ హృత్పాండురోగం శ్వయదుప్రవృద్ధం । ప్లీహాభ్రమారోచక మేహగుల్మాన్.

ద్రవ్యములు:—గలిజేరు, చిరుబొద్ది, నేపాళములు, తిప్పతీగె, చిత్రమూలము, వాకుడు, త్రిఫలములు, బెల్లము, తేనె మొదలగు ద్రవ్యముల యొక్క సారములు గలవు.

గుణము:—శోధనము, మూత్రలము, శోఫహారము, హృద్యము గుల్మోదరరోగ హరము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(గ॥ ని॥) దీనిని సేవించిన హృద్రోగములు, పాండు, నంజు, గుల్మోదరములు, ప్లీహవ్యాధులు, హలీమకము, మల బద్ధము హరించును.

(అ. భూ.) దీనిని రజితలోహరసాయనము, సువర్ణకాంత వల్లభ రసము, గోక్షురాది చూర్ణములకు అనుపానముగా సేవించిన మల మూత్రములను జారీచేసి అన్నివిధములైన నంజు, గుల్మోదరరోగములు, పాండు, ప్లీహవ్యాధులను హరింపజేయును. మరియు రక్తమును వృద్ధి జేయును.

కాంతవల్లభరసము, లోకనాధరసము, జసదభస్మములకు అను పానముగా సేవించిన యకృత్ప్లీహరోగములవలన హృద్రోగములవలన కలుగు నంజువ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిజేయును.

చంద్రప్రభావటికి అనుపానముగా సేవించిన మూత్రపిండరోగ ములవలన కలుగు నంజు వ్యాధులను తగ్గించును.

## 187. బబ్బులారిష్టము.

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 10 వ॥ అధ్యా॥

శ్లో. క్షయం కుష్ఠమతీసారం ప్రమేహశ్వాసకాసనుత్॥

ద్రవ్యములు:—తుమ్మపట్ట, బెల్లము, ధాతకీ, చాతుర్జాతకములు మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—గ్రాహి, రక్తపిత్తహరము, క్షయహరము, కుష్ఠ హరము, ప్రమేహ హరము.

ప్రమాణము:—¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు

ప్రయోగములు:-(శా. ధ.) దీనిని సేవించిన క్షయ, కుష్ఠము, అతిసారము, ప్రమేహములు, కాసశ్వాసలు హరించును.

(అ. భూ.) దీనిని రక్తమాహేశ్వర రసము, లాక్షా చూర్ణములకు అనుపానముగా సేవించిన క్షయ వ్యాధులయందు కలుగు రక్తపిత్తము (అనగా కళ్లెయందుగాని, మలమునందుగాని రక్తము పడుట) శ్వేతరక్త ప్రదరములు, రక్తపిత్తములు హరించును.

వంట బాలసూర్యోదయము, ప్రవాళభస్మము, లాక్షాచూర్ణము లకు అనుపానముగా సేవించిన శ్వేతరక్తప్రదరములు తగ్గును.

దీనిని పంచామృత పర్పటికి అనుపానముగా సేవించిన గ్రహణ్యా తిసారములు, కుష్ఠములు హరించును.

## 188. భృంగరాజాసవము.

గ॥ ని (ఆసవాధికారః)

శ్లో॥ ధాతుక్షయం జయేత్సీఘ్రం కాసంపంచవిధంతథా
కృశానాం మహోపుష్టిం కురుతేచ మహాబలమ్
కామవృద్ధింకరోత్యేవ వంధ్యానాం పుత్రదోభవేత్.

ద్రవ్యములు:—గుంటగలగరాకు స్వరసము, మరియు బెల్లము, కరక్కాయలు, చాతుర్జాతకములు, పిప్పళ్ళు, జాజికాయలు, లవంగములు వీట్లయొక్క సారములు గలవు.

గుణము:—బల్యము, ధాతువృద్ధికరము, వంధ్యాదోషహరము, జ్వరహరము, కాసశ్వాసహరము.

ప్రమాణము:—½ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(గ॥ని) దీనిని సేవించిన ధాతుక్షయము, దగ్గు, ఆయాసము హరించును. బలము, కామమును వృద్ధిజేయును. గొడ్రాండ్రకు సంతానము కలుగును.

(అ. భూ.) దీనిని వసంతకుసుమాకరము, పూర్ణచంద్రోదయములకు అనుపానముగ్గా సేవించిన ధాతువులను వృద్ధిపరచి బలమును, కామమును వృద్ధిజేయును.

స్వర్ణమాలినీ వసంతరసమునకు అనుపానముగా సేవించిన పురాణజ్వరములు, క్షయ, శ్వాసకాసలు హరించును. లోకనాథరసమునకు అనుపానముగా సేవించిన పాండు, నంజు, దగ్గు, ఆయాసములను తగ్గించును.

## 189. రోహితకారిష్టము.

భై॥ ర॥ (యకృత్ప్లీహాధికారః)

శ్లో॥ .........సర్వోదర రుజాంజయేత్
ప్లీహాగుల్మోదరాష్ఠీలా గ్రహణ్యర్శాంసికామలాం.

ద్రవ్యములు:—ములుమోదుగపట్ట, బెల్లము, ధాతకీ, పంచకోల ములు, త్రిజాతకములు, త్రిఫలములు వీట్ల యొక్క సారములుగలవు.

గుణము:—శోధనము, యకృత్ప్లీహోదరరోగహరము, కామిల, కుష్ఠరోగహరము.

ప్రమాణము:— ½ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనినిసేవించిన సమస్తమైన ఉదర వ్యాధులు, ప్లీహవ్యాధులు, గుల్మములు, ఉదరాష్ఠీలను, గ్రహణి, అర్శస్సులు, కామిల, కుష్ఠములు హరించును.

(అ॥ భూ) దీనిని సువర్ణకాంతవల్లభరసము, లోకనాథరసము, జసదభస్మములకు అనుపానముగా సేవించిన యకృత్ప్లీహ (Liver and Spleen) రోగములు, ఉదరములు, గుల్మములు, కామిలా వ్యాధులు హరించును.

సోమనాథీయ తామ్రభస్మమునకుగాని, ప్రవాళపంచామృత భస్మమునకుగాని అనుపానముగా సేవించిన సమస్తగుల్మములు, ఉదర రోగములు, శూలలు హరించును. మరియు కుష్ఠములు తగ్గగలవు.

## 190. లోహాసవము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 10 వ॥ అధ్యా.

శ్లో॥ పాండుశ్వయధు గుల్మాని జఠరాణ్యర్శసాంరుజమ్
కుష్ఠం ప్లీహామయంకండూం కాసం శ్వాసం భగందరమ్
అరోచకంచగ్రహణీం హృద్రోగంచవినాశయేత్.

ద్రవ్యములు:—లోహచూర్ణము, త్రికటుకములు, త్రిఫలములు, వాము, వాయువిడంగములు, తుంగముస్తలు, చిత్రమూలము, ధాతకీ, తేనె, బెల్లము వీటిసారములు గలవు.

గుణము:—దీపనము, రక్తవృద్ధికరము, కఫహరము, శోఫహరము, ప్లీహరోగహరము, గ్రాహి.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(శా॥ ధ॥) దీనిని సేవించినయెడల ఆకలి వృద్ధియగును. మరియు పాండు, నంజు, గుల్మము, ఉదరరోగము, మూలవ్యాధి, కుష్ఠము, ప్లీహరోగము, దురద, దగ్గు, ఉబ్బసము, గ్రహణి, హృద్రోగములు హరించును.

(అ. భూ.) దీనిని కాంతవల్లభరసము, పంచలోహ రసాయనము లకు అనుపానముగా సేవించిన క్రిమిజపాండు, కామిల, ప్లీహరోగ ములు, గుల్మములు హరించును. మరియు రక్తమును వృద్ధిజేయును.

రజతలోహ రసాయనము, లోకనాథరసము, గోక్షురాది చూర్ణ ము లకు అనుపానముగా సేవించిన గ్రహణీ అతిసారములవలన కలిగిన శోఫ (నంజు) ఉదరవ్యాధులు హరించును.

దీనిక సమముగా ద్రాక్షారిష్టమును కలిపి సేవించిన రక్తహీనత వలన కలిగిన హృద్రోగములు తగ్గును.

## 191. వాసారిష్టము

(వాసకాసవము.)

గ॥ ని॥ (ఆసవాధికారః)

శ్లో॥ వాసకాసవఇత్యేష స్సర్వశ్వయథునాశనః.

ద్రవ్యములు:— అడ్డసరము, బెల్లము, ధాతకీ, చాతుర్జాతకములు, చలవమిరియాలు, త్రికటుకములు, కురువేరు వీట్లయొక్కసారములుగలవు.

గుణము:—హృద్యము, శోఫహరము, రక్తపిత్తహరము, కఫహరము.

ప్రమాణము:—¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(గ. ని.) దీనిని సేవించిన అన్నివిధములైన నంజువ్యాధులు హరించును.

(అ. భూ) దీనిని రక్తమాహేశ్వర రసము, అభ్రకభస్మము లకు అనుపానముగా సేవించిన క్షయవ్యాధులయందు కలుగు రక్తపిత్తములు, క్షయలు, రక్తప్రదరములు హరించును.

క్రమవృద్ధిలక్ష్మీవిలాసరసమునకు అనుపానముగా సేవించిన క్షయ రోగములను హరింపజేసి శ్వాసకోశములకు బలమును కలుగజేయును.

పంచలోహరసాయనమునకు అనుపానముగా సేవించిన నంజు వ్యాధులను హరింపజేసి రక్తమును వృద్ధిజేయును.

వాతాగ్నికుమారము, ప్రవాళభస్మములకు అనుపానముగా సేవించిన శ్వాసకాసలు, తమకశ్వాస (ఉబ్బసము) హరించును.

## 192. వాంవాటరు (అజామోదార్కము)

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—వాము, త్రికటుకములు, త్రిఫలములు, లవంగములు, కళింగరాష్ట్రము, మోడి, చిత్రమూలము పీట్లసారములు గలవు.

గుణము:—దీపనము, పాచనము, శూలఘ్నము, గ్రాహి, కఫవాతహరము.

ప్రమాణము: — $\frac{1}{4}$ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(అ. భా) దీనిని అగ్నికుమార రసమునకు అనుపానముగా సేవించిన అజీర్ణవాతమును తగ్గించి జీర్ణశక్తినివృద్ధిజేయును.

భాస్కరలవణచూర్ణము, శంఖభస్మములకు అనుపానముగా ప్రయోగించిన ఉదరశూలలు (కడుపునొప్పి), కడుపుబ్బరములు, పుల్లత్రేనుపులు తగ్గును.

శంఖవటికి అనుపానముగా సేవించిన కంఠపర్యంతము భుజించిన ఆహారమును వెంటనేజీర్ణమగునటుల జేయును. మరియు శూల, కడుపుబ్బరము, అజీర్ణవిరేచనములు హరించును.

విషూచివటికి అనుపానముగా సేవించిన విషూచి, (కలరా) అజీర్ణవిరేచనములు, ఆమాతిసారములు హరించును.

దీనిని ప్రతిరోజు సాయంకాలము పిల్లలకిచ్చుచుండిన మంచిజీర్ణశక్తిని కలుగజేయును.

## 193. శారిబాద్యరిష్టము (శారిబాద్యాసవః)

భై॥ ర॥ (ప్రమేహ పిడకాధికారము).

శ్లో॥ ... ... ... పానాన్మేహాశ్చవింశతిః
శరావికాద్యాః సర్వాః పిడకా స్తత్ర్పశాశ్చయాః
ఉపదంశోద్భవాః వాతశోణితంచ భగందరమ్.

ద్రవ్యములు:—సుగంధిపాల, లొద్దుగపట్ట, తుంగముస్తలు, చందనము, కటుకరోహిణి, ఏలకులు, బెల్లము, ద్రాక్ష, ధాతకీ మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—త్వాచ్యము, రక్తశోధనము, వాతరక్తహారము, ప్రమేహ హారము.

ప్రమాణము:— ½ ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన యెడల ఇరువది మేహములు, ప్రమేహవ్రణములు, ఉపదంశ (కొరుకుడు) సంబంధమైన వ్యాధులు, వాతరక్తము, భగందరములు హరించును.

(అ. భూ.) దీనిని వసంతకుసుమాకరమునకు అనుపానముగా సేవించిన యిరువది మేహములు, ప్రమేహవ్రణములు హరించును.

దీనిని గంధకపుష్పము, లేక గంధకభస్మమునకు అనుపానముగా సేవించిన సమస్తచర్మరోగములు (అనగా కురుపులు, దురద, గజ్జి, తామర, పొడలు మొదలగునవి) హరించును.

సర్వవ్యాధి హరణ రసమునకు అనుపానముగా సేవించిన రక్తదోషములు (అనగా మేహవ్రణములు, కుష్టు, బొల్లి, పొడలు, భగందరములు మొదలగునవి) వాతరక్తము, ఉపదంశ (కొరుకుడు) మునకు సంబంధించిన వ్యాధులు, సవామేహరోగములు హరించును.

దీనిని మధుస్నుహీ రసాయనమునకు గాని, అమృత భల్లాతకీ లేహ్యమునకు గాని అనుపానముగా సేవించిన రాచపుండ్లు (మేహవ్రణములు), కుష్టువ్యాధులు తగ్గును.

N B దీనిని మావైద్యశాలయందు సుగంధిపాలను ఎక్కువగా గ్రహించి కషాయముకాచి అరిష్టముగా తయారు చేయబడుచున్నది.

## 194. సారస్వతారిష్టము.

భై॥ ర॥ (రసాయనాధికార॥)

శ్లో॥ "ఆయుర్వీర్యం స్మృతింమేధాం బలంకాంతిం వివర్ధయేత్
వాగ్విశుద్ధికరోహృద్యో రసాయన వరఃస్మృతః.

ద్రవ్యములు:—సరస్వతీయాకు, శతావరి, నేలగుమ్ముడు, వట్టివేరు, అల్లము, సదాప, తేనె, పంచదార, ధాతకీ, రేణుకలు, తెగడ, పెన్నేరు, యాలకులు మొదలగుద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—దీపనము, రసాయనము, బల్యము, మేధాకరము, హృద్యము.

ప్రమాణము:— ¼ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనికి సమముగా ఆవుపాలుజేర్చి నిత్యముసేవించినయెడల ఆయువును, వీర్యమును, ధైర్యమును, బలమును, కాంతిని వృద్ధిజేయును. వాగ్విశుద్ధి (అనగా మాటలను స్పష్టముగా నప శబ్దములు లేకుండ నుచ్చరించునట్లు) జేయును. హృదయమునకు బలము కలుగజేయును. యిది రసాయనౌషధములయందు త్తమమైనది.

(అ. భూ) దీనిని రసరాజరసమునకు అనుపానముగా సేవించిన అపస్మారము, మూర్ఛ, బుద్ధిమాంద్యము, నరములబలహీనతను హరింపజేసి వాక్శుద్ధిని, హృదయమునకు బలమును కలుగజేయును.

వంటసువర్ణసూర్యావర్తికి అనుపానముగాసేవించిన పైత్యోద్రేకము వలనను, మనోవ్యాకులతవలననూ కలిగినబుద్ధిచాంచల్యమును తగ్గించును.

సిద్ధమకరధ్వజమునకు అనుపానముగాసేవించిన శుక్రనష్టమువలన కలిగిన బుద్ధిమాంద్యములను హరింపజేసి బుద్ధివికాసమును కలుగజేయును. మరియు శరీరమునకు బలము కలుగజేయును.

సితోపలాదిచూర్ణమునకు అనుపానముగాసేవించిన విశేషముగా చదువుట, పాడుట, మొదలగువానివలనకలుగు స్వరభంగము (గొంతు బొంగురుపోవుట) కాసశ్వాసలు హరించును.

N B చిన్నపిల్లలకు తొందరగాను సరిగాను మాటలు రాకుండినచో దీనిని ప్రతినిత్యము వాడిన తొందరగా మాటలువచ్చును.

దీనిని సేవించిన విద్యార్థులకు జ్ఞాపకశక్తినిచ్చి మెదడునకు బలము చేకూర్చును.

# లేహ్యములు

## 195. అశ్వగంధాది లేహ్యము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ అశ్వగంధో జరావ్యాధి నాశకః తువరస్మృతః
శరీరపుష్టికారీచ వృష్యశ్చ ఉష్ణోలఘుస్మృతః.

ద్రవ్యములు:—అశ్వగంధాది చూర్ణము, నెయ్యి, చక్కెర, ద్రాక్ష, తేనె, ఏలకులు గలవు.

గుణము:—రసాయనము, బల్యము, రక్తశుద్ధికరము, వృష్యము, ఔపసర్గికరోగ హరము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులము వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో పూర్ణచంద్రోదయమును గాని రజతచంద్రోదయమునుగాని కలిపి ఉదయ సాయంత్రముల యందు పాలతో సేవించిన శుక్రమును వృద్ధిజేసి దౌర్బల్యము, అతి శీఘ్రస్ఖలనము, సంభోగమునందిచ్ఛ లేకుండుటను హరింపజేసి మంచి యవ్వనమును, శరీరపుష్టిని కలుగజేయును.

దీనిలో సర్వవ్యాధి హరణరసమును కలిపి సేవించిన వాతరోగములు, రక్తదోషము (కురుపులు, పొడలు, విసర్పి మొదలగునవి)లు, చిరకాలము నుండి బాధించు సవాయి వ్యాధులు, చర్మరోగములను పోగొట్టి శుక్రదోషములను హరింపజేయును.

N B అశ్వగంధాది చూర్ణమునందుండు ద్రవ్యములను చూర్ణప్రకరణములో గల అశ్వగంధాది చూర్ణము దగ్గర వ్రాయబడినవి.

## 196. అమృత భల్లాతకీ లేహ్యము

(అమృతభల్లాతకావలేహ్యము)

భా॥ ప్ర॥ (మ॥ ఖం॥) కుష్టరోగాధి కారః

శ్లో॥ నాశయేదవ లేహోయం పథ్యాన్నాని ఖాదతః
కుష్ఠానివాతరక్తాని సర్వాణ్యర్శాంసి సేవితః.

ద్రవ్యములు:—జీడిగింజలు, తిప్పతీగె, పీట్ల సారములు మరియు నెయ్యి, పాలు, తేనె; పంచదార, బావంచాలు, తంగేడువిత్తులు, వేపచెక్క, త్రిఫలములు, మంజిష్ట, త్రికటుకములు, చాతుర్జాతకములు, చందనము మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—త్వచ్యము, రక్తదోషహరము, కుష్ఠహరము, వాతరక్తహరము, అర్శోరోగహరము, రసాయనము.

ప్రమాణము:— ¼ తు మొదలు 2 తులములవరకు.

ప్రయోగములు:—(భా॥ ప్ర॥) దీనిని ఉదయమున ఉదకానుపానముతో సేవించిన కుష్ఠరోగములు, వాతరక్తములు, మూలవ్యాధులు హరించును. మరియు బలమును కలుగజేసి రసాయనముగా పనిజేయును.

(అ. భూ.) దీనిలో సర్వవ్యాధిహరణ రసమును గాని, గంధక రసాయనమును గాని కలిపి సేవించిన సమస్త కుష్ఠువ్యాధులు, శ్విత్రము, విసర్పి, భగందరము, ప్రమేహవ్రణములు, దురదలు, కురుపులు, పొడలు మొదలగు రక్తగత, చర్మగత వ్యాధులనన్నిటిని హరింపజేసి బలమును కలుగజేయును.

దీనిని పైవిధముగా సేవించుచూ ఖదిరారిష్టమును అనుపానముగా త్రాగుచుండిన యెడల పైన వ్రాయబడిన వ్యాధులయందు బాగుగా పని జేయును.

దీనిని అభయారిష్టముతో సేవించిన సమస్త మూలవ్యాధులు హరించును.

దీనిలో సర్వవ్యాధిహరణరసమును కలిపి సేవించిన ఫిరంగరోగము (సవాయివ్యాధు)లు తగ్గగలవు.

N. B, ఈ ఔషధమును సేవించువారు వ్యాయామము (కసరత్) ఎండలో తిరుగుట, అగ్నిసమీపమున యుండుట, మైదునము, తైలాభ్యంగనము, నడక, కారము, ఆవ, గుమ్మడి, పులుసు, మాంసము, పెరుగు వీటిని విడిచిపెట్టవలెను.

దీనిని సేవించుట గిట్టనివారికి శరీరముపై దద్దుర్లు, వాపు, దురదలు కలుగు చిహ్నములగు పడినవెంటనే ఈ లేహ్యమును సేవించుట ఆపివేయవలెను. అప్పుడు శరీరమునకు కొబ్బరినూనె రాయవలెను. మరియు కొబ్బరి, పంచదార, కొబ్బరినీళ్లు మొదలగు

వానిని ఆహారమునందు తీసుకొనవలెను. సామాన్యముగ నీ లేహ్యమును సేవించు కాలమందు పాలు, అన్నము, గోదుమరొట్టె, నెయ్యి మొదలగు పుష్టిగల పదార్థములను సేవించవలెను. శరీరముపై వాపులు, దురదలు కన్పించినను అవి 4, 5 దినములలో కొబ్బరినూనె రాయుట మొదలగు పైనుదహరించిన ఉపచారములచే తగ్గిపోగలవు. భయములేదు.

## 197. ఆర్ద్రిఖండావలేహ్యము (ఖండార్ద్రి.యోగము)

వై॥ చిం॥ (అరుచి॥ ప్ర)

శ్లో॥ ......... మహాపిత్తవినాశనం
ఆమ్లపిత్తం నిహంత్యాశు సర్వపిత్త వికారజిత్
సర్వారుచిం వాతరోగం మందాగ్నించ నియచ్ఛతి.

ద్రవ్యములు:—అల్లము, నెయ్యి, పటికబెల్లము, త్రికటుకములు, ఏలకులు, జాజికాయలు మొదలగుద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, ఆమ్లపిత్తహరము, అరుచి, పిత్తరోగములను హరించును.

ప్రమాణము:— ¼ తు. మొదలు ½ తులము వరకు.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని 40రోజులు సేవించిన మహాపిత్తములు, ఆమ్లపిత్తములు, సమస్త పిత్తవికారములు, అరుచిరోగములు అగ్నిమాంద్యము, వాతవ్యాధులు హరించును.

(అ. భూ) దీనిలో సూతశేఖరరసమునుకలిపి సేవించిన యెడల ఆకలిని వృద్ధిజేసి,ఆమ్లపిత్తమును,వాంతులను, శూలలనుహరింపజేయును. మరియు మలబంధముగలవారికి సుఖవిరేచనమునుజేసి ఆమపచనము గావించును.

దీనిని ద్రాక్షారిష్ట అనుపానముతో సేవించిన సమస్త పైత్యరోగములను హరింపజేసి బలము కలుగజేయును.

## 198. కళింగాదిలేహ్యము

(అనుభూతము)

ద్రవ్యములు:—చేదుపుచ్చకాయలస్వరసము, పంచలవణములు, సునాముఖి, వాము, శొంఠి మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—తీక్ష్ణరేచనము, లేఖనము, యకృత్ప్లీహోదరహరము, గుల్మరోగహరము, క్రిమిహరము.

ప్రమాణము:— ¼ తులము మొదలు ½ తులము వరకు.

ప్రయోగములు:— (అ.భూ) దీనిని రాత్రిపూట పరుండబోవు నప్పుడుగాని, ఉదయముననేగాని వేడినీళ్ళతో సేవించిన గాఢముగా విరేచనములను కలుగజేసి యకృత్ప్లీహోదరములను, గుల్మములను, మలజ క్రిములను హరింపజేయును.

కాంతవల్లభరసమును సేవించుచూ ఈలేహ్యమును పైవిధముగా సేవించిన గుల్మములు, యకృత్ప్లీహోదరములు, క్రిమిజపాండువ్యాధులు హరించును. మరియు రక్తమును వృద్ధిజేయును.

దీనిని గర్భిణీస్త్రీలు ఉపయోగించకూడదు.

పైనవ్రాసిన దానికంటె ఎక్కువగా వాడకూడదు. మోతాదు ఎక్కువయైన కడుపుకోతపుట్టి అపకారము చేయగలదు. ఈకాలపుతత్వ ములకు ¼ తులముతో ప్రారంభించి యెవరికివారు వారి శరీరతత్వము ననుసరించి తగ్గించియో హెచ్చించియో తమశరీరమునకుసరిపడునట్లుగా చూచుకొనవలెను.

## 199. కూష్మాండ లేహ్యము

(కూష్మాండ ఖండః అనియున్నది)

భై॥ ర॥ (రక్తపిత్తాధి కారః)

శ్లో॥ ... ... ... రక్తపిత్తక్షతక్షయీ
కాసశ్వాసతమశ్ఛర్ది తృష్ణజ్వరనిపీడితః
వృష్యం పునర్నవకరం బలవర్ణ ప్రసాదనం.

ద్రవ్యములు:—బూడిదగుమ్మడికాయగుజ్జు, నెయ్యి, పటిక బెల్లము, తేనె, మరియు త్రికటుకములు, జీలకఱ్ఱ, త్రిజాతకములు, ధని యాలు గలవు.

గుణము:—దీపనము, రసాయనము, ఉష్ణశమనము, వృష్యము, రక్తపిత్తహరము, అర్శోరోగహరము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులమువరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని సేవించిన రక్తపిత్తము, క్షతక్షయ, దగ్గు, రొప్పులను తగ్గించును. మరియు శుక్రమును, పుష్టిని, కాంతిని వృద్ధిజేయును. గుండెకు బలమునిచ్చును.

(అ. భూ.) దీనిని నిత్యము ఉదయ సాయంకాలములయందు సేవించిన, అత్యుష్ణము, కాళ్లుచేతులయందు కలుగు మంటలు, శరీర కృశత్వమును పోగొట్టి బలమును కలుగజేయును.

దీనిలో సిద్ధమకరధ్వజమునుగాని, పూర్ణచంద్రోదయమునుగాని కలిపి సేవించిన శుక్రనష్టమును, కాళ్ళుచేతులు లాగుటను, పోగొట్టి శుక్రవృద్ధిని, జ్ఞాపకశక్తిని, బలమును కలుగజేయును.

దీనిలో అభ్రకభస్మము, కర్పూరశిలాజిత్తు భస్మముంను కలిపి సేవించిన స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములు, రక్తపిత్తములు, శరీరమందు కలుగు ఉష్ణాధిక్యత హరించును.

దీనిని బాబ్బులారిష్టములో సేవించిన రక్తము పడుచుండు అర్శోరోగములు, రక్తపిత్తములు తగ్గును.

## 200. చ్యవనప్రాశలేహ్యము

చ॥ చి॥ (రసాయనపాదము)

శ్లో॥ ఇత్యయం చ్యవనప్రాశః పరముక్తం రసాయనః
కాసశ్వాసహరశ్చైవ విశేషేణోపదిశ్యతే
క్షీణక్షతానాం వృద్ధానాం బాలానాం చాఙ్గవర్ధనః
సర్వక్షయమురోరోగం హృద్రోగం వాతశోణితం
పిపాసాం మూత్రశుక్రస్థాన్ దోషాంశ్చాప్య పకర్షతి.

ద్రవ్యములు:—ఉసిరికాయల గుజ్జు, నెయ్యి, నూనె, దశమూలములసారము, వంశలోచనము, (తవాక్షీరి) పిప్పళ్ళు, చాతుర్జాతకములు, పటికబెల్లము మొదలగు ద్రవ్యములుకలవు.

గుణము:—రసాయనము, బల్యము, ధాతువృద్ధికరము, క్షయహరము, వాజీకరణము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులము వరకు.

ప్రయోగములు:–(చ. చి) దీనిని నిత్యముసేవించిన కాసశ్వాసలు, ధాతుక్షీణము, ఉరఃక్షతము గలరోగులకు, బాలురకు, వృద్ధులకు శరీరమును వృద్ధినొందించి బలము కలుగజేయును. మరియు కంఠస్వరక్షయమును, రొమ్మునొప్పిని, హృద్రోగమును, వాతరక్తమును, దప్పిని, మూత్రశుక్రములకు సంబంధించిన రోగములను హరింపజేయును. దీనిని సేవించిన ముసలివారు యౌవనవంతు లగుదురు.

(అ. భూ.) దీనిని ఉదయ సాయంత్రములయందు ఆవుపాలతోగాని, మేకపాలతోగాని సేవించిన ధాతువులను వృద్ధిపరచి, బలమును, శుక్రవృద్ధిని కలుగజేయును.

దీనిలో క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసమును కలిపి సేవించిన క్షయరోగములు, ఉబ్బసములను పోగొట్టి శ్వాసకోశములకు బలమునుకలుగజేయును.

శరీరమునందు ఏవ్యాధిలేకున్ననూ నిత్యము సేవించిన శరీరకృశత్వమును, మలబద్ధకమును పోగొట్టి రసాయనముగ పనిజేయును.

దీనిని వృద్ధులు సేవించిన శరీరమునకు, నరములకు పటుత్వమును కలిగించును. మరియు గుండె ఆరిపోవుట, శరీరము శుష్కించుట, చర్మమునందు స్నిగ్ధత తగ్గిపోవుట, ఎ. విటమిను లోపముచే కలుగు వ్యాధులు దీని సేవనముచే తగ్గి సుఖము చేకూరును.

## 201. త్రిఫలాది లేహ్యము

(అను భూతము)

ద్రవ్యములు:—చాతుర్జాతకములు, త్రికటుకములు, జాపత్రి, జాజికాయ, ద్రాక్ష, ఖర్జూర, త్రిఫలములు, జీలకఱ్ఱ, పంచదార మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:–ఉష్ణశమనము, ప్రమేహహరము, హృద్యము, నేత్ర్యము.

ప్రమాణము:— ½ తు. మొదలు 1 తులమువరకు.

ప్రయోగములు:—దీనిని ఉదయ సాయంకాలములయందు వేడి

నీళ్ళతో సేవించిన దేహతాపములు తీరును. వింశతిమేహములను పోగొట్టును. చిత్తవిభ్రమము, హృద్రోగము, పంచవిధములగు కాసలు, నేత్రరోగములను హరింపజేయును.

## 202. దశామృతహరీతకీ లేహ్యము

(అనుభూతము)

ద్రవ్యములు:—త్రిఫలములు, అతిమధురము, దాల్చినచెక్క, సైంధవలవణము, పిప్పళ్ళు, ఏలకులు, పంచదార, తేనె, నెయ్యి.

గుణము:—నేత్రరోగహరము, పిత్తహరము, దీపనము, కాసశ్వాసహరము.

ప్రమాణము:— ½ తు. మొదలు 1 తులమునరకు.

ప్రయోగములు:—దీనిని ఉదయ సాయంకాలములయందు ఆవుపాలతో సేవించిన యెడల రాత్రి యంధము, దివసాంధము, తిమిరము, ఊర్ధ్వరోగము, పటలము దుర్మాంసములు, కటిలము, పిళ్ళకము, కాచము, కీలలు మొదలగు నేత్రరోగములు ఉన్మాదములను హరింపజేయును.

దీనిని వేడినీళ్ళతో సేవించినయెడల శ్వాసకాసలు, శిరోరోగములు, విషమ జ్వరములు, వమనము, మందాగ్ని, పైత్యవిభ్రమములను హరింపజేసి ఆకలిని వృద్ధిజేయును.

కొందరు ఈ యౌషధమును రాత్రి పూట పరుండబోవునప్పుడు పై అనుపానములతో సేవించుటాచారముగలదు.

## 203. ధాన్యకాదిలేహ్యము

(ఆంధ్రాయుర్వేదఫార్మసీవారి నూరుఔషధయోగముల పుస్తకము)

శ్లో॥ పిత్తనాశనం జ్వరకాస తృష్ణాఛర్దికఫహారీచదీపనం.

ద్రవ్యములు:—ధనియాలు, సునాముఖి, తెగడ, ద్రాక్ష, గులాబిపువ్వు, రేలగుజ్జు, పటికబెల్లము, నెయ్యి, తేనె, కంపిల్లము.

గుణము:—పిత్తహరము, మృదురేచనము, దీపనము, పాచనము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులమువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని రాత్రిపరుండబోవునప్పుడు గాని, ఉదయముననేగాని వేడినీళ్ళతో సేవించిన సుఖముగా విరేచనము కలుగజేసి పిత్తప్రకోపములను తగ్గించి ఆకలిని కలుగజేయును.

దీనిని మలబద్ధకముగలవారు ప్రతిరోజు సేవించవచ్చును. గర్భిణీ స్త్రీలుకూడా వాడవచ్చును.

## 204. బిల్వాదిలేహ్యము

స॥ యో॥ (లే॥ ప్ర॥) మరియు వై॥ యో॥ ర॥

శ్లో॥ లీఢం ఛర్దిరరోచకాగ్ని సదనశ్వాస ప్రసేకాపహః.

ద్రవ్యములు:—మారేడుసారము, బెల్లము, త్రికటుకములు, తేనె, ధనియాలు మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, గ్రాహి, రసాయనము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులమువరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిలో పంచామృత పర్పటిని గాని, యితర పర్పటులలో దేనినైననూగాని కలుపుకొని సేవించిన బంకవిరేచనములు, రక్తగ్రహణి, వాంతులు, అజీర్ణ విరేచనములు, సంగ్రహగ్రహణి వ్యాధులను హరింపజేసి ఆకలిని వృద్ధిజేయును.

## 205. నారసింహ లేహ్యము (భస్మములు కలిసినది)

(దీనినే శతమూలికాది లేహ్యమనికూడ పిలుతురు)

ఆం॥ భై॥ ర॥ (లేహ్యప్రకరణః)

శ్లో॥ వలీపలిత ఖాలిత్య మేహపాణ్డ్వాఢ్య పీనసాన్
హన్త్యష్టాదశ కుష్ఠాని తిదాష్టావుదరాణిచ॥

ద్రవ్యములు:—శతావరి, పల్లేరు, తిప్పతీగె, జీడిగింజలు, చిత్రమూలము, నువ్వులు, ఫిరంగిచెక్క, పంచదార, తేనె, నెయ్యి, ఇంగిలీకము కట్టు, కాంతాభ్రకభస్మము, వంగభస్మము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—త్వచ్యము, రక్తదోషహరము, కుష్టహరము, ఔప సర్గిక రోగహరము, అర్శోరోగహరము, రసాయనము.

ప్రమాణము:— ¼ తులము మొదలు ½ తులమువరకు.

ప్రయోగములు:—(ఆం॥ వై॥ ర॥) దీనిని ఒకమాసముపయోగించినచో ముసలితనమును, ముసలితనమున వచ్చువ్యాధులు నశించును. మరియు వెంట్రుకలు నెరయుట, శరీరము ముడతలు పడుట, మేహము, ఊరుస్తంభము, కుష్టములు, ఉదరవ్యాధులు, భగందరములు, సంసర్గజ వ్యాధులు, మూలవ్యాధులను హరింపజేసి శరీరమునకు బంగారముతో సమానమైన కాంతిని, సింహముతో సమానమైన పరాక్రమమును, ఉత్సాహమును కలుగజేయును.

(అ. భూ.) దీనిలో గంధకరసాయనమును కలిపి సేవించిన చర్మరోగములు (కురుపులు, పొడలు, దురద, తామర మొదలగునవి)హరించును.

దీనిని ఖదిరారిష్టముతో సేవించిన రక్తదోషములు, కుష్టములు, శ్విత్రములు, గ్రంధులు హరించును.

దీనిలో సర్వవ్యాధిహరణరసమును కలిపిసేవించిన సంసర్గదోషము (సవాయివ్యాధులు) లను హరింపజేసి శుక్రమును శుభ్రపరచి యవ్వనమును కలుగజేయును.

## 206. నారసింహలేహ్యము (భస్మములులేనిది)

ఆం॥ వై॥ ర. (లేహ్యప్రకరణః)

దీనికి వివరములన్నియు భస్మములుకలిసిన నారసింహ లేహ్యమునకు వ్రాయబడినవియే. దీనియందు కాంతాభ్రకభస్మము, వంగభస్మములు మాత్రము కలిసియుండలేదు.

## 207. మదనకామేశ్వరీ లేహ్యము

ఆం॥ వై॥ ర॥ (లేహ్యప్రకరణః)

శ్లో॥ సర్వరోగహరం చైతత్స గ్రిహగ్రహణీ హరమ్
ఏతస్య సతతాభ్యాసా ద్వృద్ధోపితరుణాయతే.

**ద్రవ్యములు:**—పెన్నేరు, నేలతాడి, మెంతులు, అష్టవర్గు, వంగ భస్మము, గంజాయి, పచ్చకర్పూరము, తేనె, పంచదార, మొదలగు ద్రవ్యములు గలవు.

**గుణము:**—వృష్యము, బల్యము, రసాయనము, కామోద్దీపకము, వాతశ్లేష్మహరము, గ్రాహి.

**ప్రమాణము:**— ¼ తులము మొదలు ½ తులము వరకు.

**ప్రయోగములు:**— (ఆం॥ భై॥ ర॥) దీనిని సేవించిన వాతశ్లేష్మ వ్యాధులు, ఆమవాతము, సంగ్రహగ్రహణి, వీనిని హరింపజేయును. మరియు దీనిని ఎల్లప్పుడు సేవించినచో ముసలివారుకూడ యావనవంతులగుదురు.

(అ.భూ) దీనిని పంచదార చేర్చిన ఆవుపాలతో సేవించిన శుక్రనష్టము, శుక్రముపలచనగుట, అతిశీఘ్రస్ఖలనములను తగ్గించి సంభోగ సౌఖ్యమును కలిగించును.

దీనిలో సిద్ధమకరధ్వజమును కలిపి సేవించినయెడల శుక్రదోషములను, శుక్రదోషములవలన కలుగు నడుమునొప్పి, కాళ్ళులాగుట, నీరసము మొదలగు వానిని పోగొట్టి కామోద్రేకమును కలిగించును. కుటజారిష్టముతో సేవించిన గ్రహణీ, సంగ్రహగ్రహణీ వ్యాధులుతగ్గును.

## 208. వా.సాకంటకారీలేహ్యము

(వై॥ యో॥ ర.)

**ద్రవ్యములు:**—అడ్డసరము, వాకుడు వీట్ల సారము మరియు బెల్లము, త్రికటుకములు, రాస్న, వంశలోచనము, (తవాక్షీరి) పిప్పళ్ళు మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—దీపనము, పాచనము, కఫహరము, కాసశ్వాసహరము.

ప్రమాణము:—¼ తులము మొదలు ½ తులము వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని కాసాసముతో సేవించిన ఉబ్బసము, ఆయాసము, దగ్గులను హరింపజేయును. ముఖ్యముగా ఊపిరితిత్తులయందుగాని, గుండెయందుగాని చేరినకఫమును వెంటనే తగ్గించును.

దీనిలో వాతాగ్నికుమారము, ప్రవాళభస్మములను కలిపి కొంత కాలము సేవించిన చిరకాలమునుండియున్న తమకశ్వాస.(ఉబ్బసము)లు తగ్గును.

## 209. సుగంధాదిలేహ్యము

ఆం॥ వై॥ ర॥ (లేహ్య ప్రకరణః)

శ్లో॥ ... ... ... మేహావింశతినాశనమ్
చత్వారింశచ్చ పిత్తాని సర్వకుష్ఠం నిహన్తిచ
సర్వవ్రణ వినాశంచ మూలరోగంచ నాశయేత్
రక్తదోషా నశేషాంశ్చ త్వగ్గతానపినాశయేత్.

ద్రవ్యములు:—సుగంధిపాల, జీలకఱ్ఱ, యాలకులు, చందనము, కురువేరు, ఫిరంగిచెక్క, ద్రాక్ష, నెయ్యి, పంచదార మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—త్వచ్యము, రక్తశోధనము, కుష్టహరము, పిత్తహరము, ఫిరంగరోగహరము, బల్యము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులమువరకు.

ప్రయోగములు:—(ఆం॥ వై॥ ర॥) దీనిని సేవించిన ప్రమేహములు పైత్యములు, కుష్టములు, వ్రణములు, మూలవ్యాధి, కొరుకువ్యాధి, ఉరక్షతము, సమస్తమైన రక్తదోషములు, చర్మదోషములు హరించును.

(అ. భూ.) దీనిలో గంధకభస్మమును చేర్చి సేవించిన సమస్త చర్మగతరోగము (అనగా కురుపులు, దురద, మూగతీటలు మొదలగునవి) లుహరించును.

దీనిలో సర్వవ్యాధిహరణరసమును కలిపి సేవించిన రక్తదోషము (అనగా విసర్పి, భగందరములు, వ్రణములు, మేహవ్రణములు మొదలగునవి)లు, కుష్టములు, సవామేహమువలన కలుగు కొరుకుడు, గడ్డలు, కురుపులను హరింపజేసి శరీరమునకు బలము కలుగజేయును.

లోహాభ్రకసిందూరమును దీనిలో కలుపుకొని సేవించిన శరీరోష్ణమును తగ్గించి రక్తమును వృద్ధిజేయును.

# ఘృతములు

ప్రతి ఘృతమును ఉదయమునమాత్రము అగ్ని బలము ననుసరించి గోరువెచ్చని ఆవుపాలలో కలిపిగాని, పంచదారయందు కలుపుకొనిగాని సేవించవలయును.

## 210. కల్యాణఘృతము

చ॥ చి. (ఉన్మాదాధికారః) 9 వ. అధ్యాయం

శ్లో॥ అపస్మారే జ్వరేకాశే శోషే మందానలేక్షయే
శస్తం స్త్రీణాంచవంధ్యానాం వర్ణాయుర్బలవర్ధనమ్.

ద్రవ్యములు:—నెయ్యి, మరియు చేదుపుచ్చ, త్రిఫలములు, దేవదారు, ముయ్యాకుపొన్న, పసుపు, సుగంధిపాల, ఏలకులు, మంజిష్ట, వాయువిడంగములు, చంగల్వకోష్టు మొదలగు ద్రవ్యములయొక్క సార ములు గలవు.

గుణము:—దీపనము, వాతహరము, పిత్తహరము, మేధ్యము, వంధ్యారోగహరము, విషహరము, అపస్మారహరము.

ప్రమాణము:—½ తులము మొదలు 1 తులము వరకు.

ప్రయోగములు:—(చ॥ చి.) దీనిని సేవించిన అపస్మారము, క్షయ, వాతరక్తము, ఉన్మాదము, విషములు, మేహరోగములు, మూర్ఛ, చిత్తభ్రమములు హరించును. మరియు గొడ్రాళ్లగు స్త్రీలకు చాలా ప్రశస్తమైనది.

(అ. భూ.) దీనిని రసరాజరసమునకు అనుపానముగా సేవించిన మూర్ఛ, అపస్మారము (హిస్టీరియా), ఉన్మాదము (పిచ్చి), వాతరోగ ములను హరింపజేయును.

దీనిని అశోకవటి, రజఃప్రవర్తినీవటులకు అనుపానముగా సేవిం చిన స్త్రీలకు ఋతుబద్ధము, ఋతుబద్ధమువలన కలుగు అపస్మారము (హిస్టీరియా), మలబద్ధము, వంధ్యాదోషములు నివర్తించి సంతాన ప్రాప్తి కలుగును.

కాంతాభ్రకసిందూరమును సేవించుచూ దీనిని సేవించిన వయస్సు వచ్చిన బాలికలు ఎండుకొనిపోవుటను తగ్గించి రజస్వలయగునట్లుజేయును.

## 211. జాత్యాదిఘృతము

(గంభీరాది వ్రణహారఘృతమని యున్నది)

అ॥ హృ॥ (ఉత్తరస్థానము) 25 వ. అధ్యా॥

శ్లో॥ సర్పిస్సాధ్యమనేన సూక్ష్మవదనా మర్మాశ్రితాః క్లేదినో
గంభీరాస్సరుజో వ్రణాస్సగతయ శ్శుధ్యంతి రోహంతిచ.

ద్రవ్యములు:— నెయ్యి, మైనము, మైలతుత్థము మరియు జాజి యాకులు, పసుపు, మానుపసుపు, మంజిష్ట మొదలగుద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:— వ్రణశోధనము, వ్రణరోపణము.

ప్రయోగములు:— ఇది లేపనముగా నుపయోగించుఔషధము.

దీనిని చీముకారు పుండ్లు, రక్తస్రావముగల గాయములు, నాడీ వ్రణములు, భగందరములు, సూక్ష్మమైనరంధ్రములుగల వ్రణములు, మర్మములనాశ్రయించుకొని యుండు వ్రణములను శుభ్రముగా కడిగి లేపనముగా నుపయోగించిన పైవ్రణములన్నియు మానును.

మరియు అగ్నిదగ్ధవ్రణము (కాలినపుండ్లు) ల యందు దీనిని లేపనముగా నుపయోగించిన అమోఘముగా పనిజేయును.

## 212. సుకుమారఘృతము

అ॥ హృ॥ (చి॥స్థా॥) 13 వ. అధ్యాయం.

శ్లో॥ సర్వకాలోపయోగేన కాంతిసౌభాగ్యపుష్టిదమ్
వర్ధ్మవిద్రధి గుల్మార్శో యోనిమేఢ్రానిలార్తిషు
శోఫోదరఖుడప్లీహా విడ్విబంధేషుచోత్తమమ్.

ద్రవ్యములు:— నెయ్యి, పాలు, బెల్లము, ఆముదము మరియు గలిజేరు, దశమూలములు, పెన్నేరు, కుశాపంచకము, శతావరి మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—రసాయనము, బల్యము, దీపనము, విద్రధి, అండవృద్ధి, గుల్మోదరరోగహరము, యోనిరోగహరము, మేఢ్రరోగహరము.

ప్రమాణము:— ½ తులము మొదలు 1 తులము వరకు.

ప్రయోగములు:—(అ॥హృ॥) దీనినిసేవించిన అండవృద్ధి, విద్రధి, గుల్మము, ఉదరరోగములు,మూలవ్యాధులు, యోనిశూల, మేఢ్రశూల, ప్లీహారోగములు, మలబద్ధము హరించును. మరియు శరీరమునకుబలము కాంతిని కలుగజేసి రసాయనముగా పనిజేయును.

(అ.భూ) దీనిని గోరువెచ్చని పాలయందు కలుపుకొని సేవించిన యెడల అండవృద్ధి, విద్రధి, గుల్మము, ఉదరములు, మూలవ్యాధులు హరించును. మరియు సుఖవిరేచనమును కలుగజేయును.

దీనిని సేవించుచూ పూర్ణచంద్రోదయమును గూడ సేవించిన యెడల పురుషులకు కలుగు మేఢ్రరోగములను పోగొట్టి వీర్యవృద్ధిని, యవ్వనమును, బలమును కలుగజేయును.

మహావంగేశ్వరరసమును సేవించుచూ దీనిని సేవించిన యెడల స్త్రీలకుకలుగు యోనిరోగములు, వంధ్యాదోషములను హరింపజేసి సంతానప్రాప్తి కలుగజేయును.

## 213. సారస్వత ఘృతము (బ్రాహ్మీఘృతము)

భై॥ ర॥ (స్వరభేదాధికారః)

శ్లో॥ ఏతత్ప్రాశితమాత్రేణ వాగ్విశుద్ధిః ప్రజాయతే.

ద్రవ్యములు:—సరస్వతీయాకు స్వరసము, నెయ్యి, పంచదార, సైంధవలవణము మరియు పసుపు, ఉసిరిక, తెగడ, కరక్కాయ, పిప్పళ్లు, వాయువిడంగములు, వస ఈ ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—దీపనము, మేధ్యము, రసాయనము, స్మృతివృద్ధి కరము, బృంహణము, స్వరభంగహరము.

ప్రమాణము:—¼ తులము మొదలు 1 తులము వరకు.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని నిత్యము సేవించిన వాక్కు

ద్ధిని కలుగజేయును. రసాయనముగా పనిజేయును. మరియు కుష్టములు, అర్శస్సులు, గుల్మములు, ప్రమేహములు, వంధ్యాదోషములుహరించును.

(అ. భూ.) దీనిని వంటసువర్ణసూర్యావర్తికి అనుపానముగా సేవించిన పిత్తాధిక్యత, బుద్ధిమాంద్యము, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదములను హరింపజేసి బుద్ధిబలమును కలుగజేయును.

రజితచంద్రోదయము, పూర్ణచంద్రోదయములకు అనుపానముగా సేవించిన ధాతునష్టము, దీనివలన కలుగు కృశత్వమును పోగొట్టి ధాతువులను, జ్ఞాపకశక్తిని వృద్ధిజేయును.

క్రమవృద్ధి లక్ష్మీవిలాసరసము, సితోపలాదిచూర్ణములకు అనుపానముగా సేవించిన కంఠగతనాడులకు బలము కలుగజేసి స్వరభంగమును హరింపజేసి స్వరమును కిన్నెరులతో సమానముగా యుండునట్లు జేయును.

దీనిని చిన్నపిల్లల కుపయోగించిన నత్తిని, సోమరితనమును పోగొట్టి మంచిమాటలు వచ్చునట్లుగను, మేధావంతులుగను జేయును.

## తైలములు

1. స్నేహకర్మ (Emollient & Demulcent):—స్నేహకర్మ యనగా తైలము (స్నేహద్రవ్యము) లను నస్యము, అభ్యంగనము, పానము, మర్దనలేపనములద్వారా శరీరమున నింకింపజేయుట. మరియు చెవులు నేత్రములయందుకూడా స్నేహద్రవ్యములను వేయుచుండుట. యిట్టిదానిని స్నేహకర్మయనబడును.

2. స్వేదకర్మ (Diaphoretic):— స్వేదకర్మయనగా ఇసుక, ఉప్పు మొదలగువానిని వేయించి కాపుట వలననూ, కషాయములు, నీరు మొదలగు ద్రవద్రవ్యములచే ఆవిరి పట్టుటవలననూ మొదలగు ప్రక్రియల

వలన శరీరమునకు స్వేదము (చెమట) పట్టించి దుష్టద్రవమును బహిర్గతముగావించుట స్వేదకర్మయనబడును.

### 3. నస్యము (Stenutatori):—

శ్లో॥ నస్యంతత్కథ్యతేధీరైః నాసాగ్రాహ్యం యదౌషధం.

తా॥ నాసికచేపీల్చదగిన ఔషధము నస్యమనిపండితులు వచించెదరు. ఇట్టినస్యము మూడువిధములుగా యుండును.

అవి: 1. విరేచననస్యము, 2. బృంహణనస్యము, 3. శమన నస్యము.

ఈ తైలప్రకరణమునందు చెప్పబడిన నస్యము బృంహణనస్యము శమననస్యములుగా యుండును.

నస్యముచేయు విధానము:—పురుషుని (రోగిని) ఎత్తుగాయుండు బల్లమీాద వెల్లకిల పరుండబెట్టి మెడను క్రిందికి వ్రేలాడునట్లుగను, కొంచెము పొడవుగ కాళ్ళను ఎత్తునట్లుగను, హస్తములను బాగుగా జాచునట్లుగను చేసి ఒకనాసికాద్వారమును మూసి రెండవ నాసికా ద్వారమునందు గొట్టము (Ink piller) చేగాని, ప్రత్తిచేగాని రోగాను గుణ్యముగా ఔషధమును వేయవలెను. ఇటులనే రెండవనాసికాద్వార మునందుకూడ యితర నాసికాద్వారమును మూసి ఔషధము వేయ వలెను. యిట్లు నస్యము చేసినపిమ్మట అరికాళ్ళు, భుజములు, హస్త ములు, చెవులు, మెడ, నుదురు ఈభాగములను చేతితో మర్దించవలెను.

### 4. వస్తికర్మ (Enema):—

శ్లో॥ వస్తిభిర్దీయతే యస్మాత్తస్మాద్వస్తిరితిస్మృతః

తా॥ వస్తుల (అనగా మేక, గొఱ్ఱె, ఎనుబోతు మున్నగువాని మూత్రపుతిత్తులు లేక Enema cane) చే ద్రవద్రవ్యములను గుదద్వారమునుండి శరీరములో ప్రవేశింప జేయుకర్మ వస్తికర్మయనంబడును.

ఈ తైల ప్రకరణమునందు చెప్పబడిన వస్తికర్మ నిరూహ, అను వాసనవస్తి యని రెండువిధములు.

నిరూహవస్తి:—కషాయము, క్షీరము, తైలముఅనువానినికలిపి ఎనిమాడబ్బాలోపోసి గుదద్వారముగుండా శరీరములో ప్రవేశింపజేయుట.

అనువాసనవస్తి:— తైలము (స్నేహద్రవ్యము) లను ఎనిమా డబ్బాతోగాని, సిరంజి (పిచికారీ) తో గాని గుదద్వారమునుండి శరీరములో బ్రవేశింపజేయుట.

5. **తైలపానము** (సేవించుట) చేయువిధానము:—

తైలమును పానముచేయవలసి నప్పుడు ఉదయమున అగ్నిబలము ననుసరించి గోరువెచ్చని ఆవుపాలలోకలిపిత్రాగవలెను. లేక Capcels (గోధుమ గొట్టములు) లో పోసుకొనిమ్రింగవలెను.

6. **మర్దనలేపనములు** (Message & Application):— శరీరావయవములకు తైలము (స్నేహద్రవ్యము) ను రాసి చేతులతో అవస్థానుగుణ్యముగా మర్ధించుచూ (రుద్దుట, పిసుకుట మొదలగువాట్లచే) తైలమును శరీరమున యింకింపచేయుట మర్దనయనియు. శరీరావయవములకు తైలమునురాయుట (Application) లేపనమనియు తెలుసుకొనవలెను. ఈ లేపనము చేయునప్పుడు ప్రతిలోమముగా (అనగా రోమకూపములకు ఎదురుగా) రోమకూపముల ద్వారా శరీరములోనికి ప్రవేశించునటుల లేపనము చేయవలెను.

## 214. ఆమవాతతైలము

యో॥ త॥ (14 వ. ప్రకర.)

ద్రవ్యములు:—నువ్వులనూనె, పెరుగుతేట, చింతాకుస్వరసము మరియు చంగల్వకోష్టు, వస, మునగచెక్క, దేవదారు, శొంఠి, వెల్లుల్లి, ఆవాలు, గుగ్గిలము ఈ ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—ఆమవాతహరము, వాతహరము, స్రోతశ్శోధనము.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని వాపు, నొప్పులుగలచోట్లను మర్దించి ఉలవలుగాని, ఉప్పుగాని, ఇసుకగాని వేయించి కాచ

వలెను. ఇట్లు చేసిన ఆమవాతము, కీళ్ళవాపులు, నొప్పులు, కీళ్ళనొప్పులు హరించును.

దీనిని పైవిధముగా వుపయోగించుచూ లోహాసవ్వీరమును అను పానములతో సేవించినయెడల పైన వ్రాయబడిన వ్యాధులయందు బాగుగా పని జేయును.

## 215. ఐన్ద్రితైలము

(అనుభూతము.)

ద్రవ్యములు:–ఆముదము, చేదుపుచ్చకాయలస్వరసము, మరియు చిత్రమూలము, త్రికటుకములు, వస, సదాపాకు, దుంపరాష్ట్రము మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—రేచనము, లేఖనము, యకృత్ప్లీహ వృద్ధిహరము, వాతహరము, కఫహరము.

ప్రిమాణము:—1/16 ఔన్సు మొదలు $\frac{1}{8}$ ఔన్సు వరకు.

ప్రయోగములు:–(అ॥భూ) దీనికి సమానముగాగాని, రెట్టింపుగా గాని వెచ్చచేసినఆముదముకలిపిపిల్లలకుత్రాగించిన యకృత్ప్లీహవృద్ధులను వాతమును, దగ్గు, ఆయాసములను తగ్గించి విరేచనము కలుగచేయును.

దీనిని పెద్దవారు Capcels (గోధుమ గొట్టములు) లో పోసుకొని మ్రింగినయెడల యకృత్ప్లీహావృద్ధులు, గుల్మములు, శ్వాసకాసలు హరించును. సుఖవిరేచనమును కలుగజేయును.

దీనిని పిల్లలకు పైవిధముగా వుపయోగించుచూ బాలచంద్రోదయమును కూడ వుపయోగించిన యెడల యకృత్ప్లీహ వృద్ధులయందు బాగుగాపని జేయును.

## 216. చందనాదితైలము

భై॥ ర. (జ్వరాధికారః)

శ్లో॥ చందనంశీతలంరూక్షం తిక్తమహ్లాదనం లఘు
హృద్యంవర్ణ్యం విషశ్లేష్మ తృష్ణాపిత్తాస్రదాహనుత్.

ద్రవ్యములు:—నువ్వులనూనె, చందనతైలము, కదంబఅత్తరు మరియు మంజిష్ట, లొద్దుగచెక్క, చందనపొట్టు, వట్టివేళ్ళు మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—ఉష్ణశమనము, శిరోరోగహరము, నేత్ర్యము, ఊర్ధ్వాంగ వాతహరము.

ప్రయోగములు:—దీనిని నిత్యము శిరస్సునకు మర్దనజేయుచుండిన ఉష్ణాధిక్యతవలన కలుగు శిరోరోగములు, నేత్రరోగములను నివర్తింపజేసి మెదడునకు చలువ కలుగజేయును. మరియు నిద్రను బాగుగా పట్టించును.

దీనిని ఉదయమున నస్యాభ్యంగనముల యందుపయోగించిన ఉన్మాదము, హిస్టీరియా, అపస్మారము, పార్శ్వశూలలను హరింపజేసి జ్ఞాపకశక్తిని కలుగజేయును.

## 217. ధన్వంతరితైలము

సర్వ॥ చి॥ ర॥ (వాతరోగాధికారః.) మరియు యో॥తరం॥ (16 వ॥ అధ్యాయం.)

శ్లో॥ . . . . తైలం సర్వవాతవికారజిత్
సూతికాబాల మర్మాస్థి క్షతక్షీణేషు పూజితం.

ద్రవ్యములు:—నువ్వులనూనె, పాలు మరియు బలామూలము, దశమూలములు, యవలు, ఉలవలు, దేవదారు, మంజిష్ట, చంగల్వకోష్టు, పెన్నేరు మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—వాతహరము, ధాతుక్షయహరము.

ప్రయోగములు: దీనిని శరీరాభ్యంగన మర్దనలేపనముల కుపయోగించిన పక్షవాతము, అర్దితవాతము, సర్వాంగవాతము మొదలగు వాతవికారములు, సూతికలకు, బాలురకుకలుగు వాతములు, అస్థిక్షయము, (అనగా వాతముచే ఎముకలుఎండిపోవుట) లను హరింప జేయును. మరియువాతదోషముచే శరీరము క్షీణించినవారికి దీనినుపయోగించిన క్షీణత్వమును పోగొట్టి బలమును కలుగజేయును.

## 218. నారాయణతైలము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 9 వ॥ అధ్యా॥

శ్లో॥ పక్షఘాతరి హనుస్తమ్భం మన్యాస్తమ్భం గళగ్రహమ్
ఖల్లిత్వం బధిరత్వంచ గతిభఙ్గం కటిగ్రహమ్.

ద్రవ్యములు:—నువ్వులనూనె, శతావరిస్వరసము, పాలు మరియు పెన్నేరు, బలామూలము, మారేడు, పెద్దములక, చంగల్వకోష్టు, ఏలకులు, సదాప, సన్నరాస్నము మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:— వాతహరము, ధాతువృద్ధికరము, క్షయహరము, శిరోగ్రహవాతహరము.

ప్రయోగములు:—(శా॥ ధ) దీనిని నస్యమున కుపయోగించిన శిరోగ్రహవాతము, పార్శ్వశూలలు, హనుస్తంభవాతము, నేత్రాదీన్ద్రియములయందు కలుగు వాతవికారములు హరించును.

దీనిని వస్తిపానముల యందుపయోగించిన పక్షవాతము, గళగ్రహము, కటిగ్రహవాతము, హస్తపాదముల శోషింపజేసెడి వాతము, శుక్రధాతుక్షయము, క్షయరోగము, అండవృద్ధి, గృధ్రసీవాతము, సర్వాంగవాతములు, వంధ్యాదోషము మొదలగు వ్యాధులను హరింపజేయును.

దీనినిపైనవ్రాయబడిన విధములుగా నుపయోగించుచూ శరీరమునకు మర్దనలేపనములు కూడాచేసిన పైనవివరించిన వ్యాధులయందు బాగుగాపనిజేయును.

N, B:—దీనిని లోపలికి సేవించవలసినదిగా వ్రాసియున్ననూ అనుభవములో సేవించుటలేదు. సేవించిననూ ప్రమాదములేదు. సేవించవలసినప్పుడు జఠరాగ్ని బలమునను సరించి గోరువెచ్చని ఆవుపాలలో కలుపుకొనిత్రాగవలెను. లేక Capcels (గోధుమ గొట్టములు) లో పోసుకొని సేవించవచ్చును.

## 219. నిర్గుండీతైలము

(వై॥ రో॥ ర.)

ద్రవ్యములు:—నువ్వులనూనె, అల్లము, వావిలాకు, జిల్లేడాకులు, మునగాకు, తులసియాకు, కామంచియాకు, అరటిగడ్డ పీట్ల స్వరసములు

మరియు పసుపు, త్రికటుకములు మొదలగు ద్రవ్యములయొక్క సార ములు గలవు.

గుణము:—వాతహరము, కర్ణరోగహరము.

ప్రయోగములు:-(అ. భూ.) దీనిని కొంచము వెచ్చజేసి చెవిలో పోసినయెడల చెవిలో కలుగుపోట్లు, చీముకారుట, పురుగులుపడుట, వ్రణములు, చెముడు,ధ్వని మొదలగు కర్ణరోగములను హరింపజేయును.

దీనిని లేపన మర్దనలకుపయోగించిన కీళ్ళనొప్పులు, పోట్లు, వాపులు హరించును. మరియు వ్రణములు తొందరలో నయమగును.

## 220. పిండతైలము

వా॥ చి॥ స్థానం (వాతరక్త॥ చి॥) 22 వ. అధ్యా.

శ్లో॥ సమధూచ్ఛిష్టమంజిష్ఠం సర్జరససశారిబమ్
పిండతైలం తదభ్యంగా ద్వాతరక్తం రుజాపహమ్.

ద్రవ్యములు:—నువ్వులనూనె, మైనము, గుగ్గిలము మరియు సుగంధిపాల, మంజిష్ఠ మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:—వాతరక్తహరము, పాదదారికాహరము, వ్రణరోపణము, శోఫనిర్వాపణము, శూలఘ్నము.

ప్రయోగములు:-(వా॥ చి॥) దీనిని లేపనమర్దనముల కుపయోగించిన వాతరక్తవ్యాధులను, అందు కలుగు కాళ్ళుపగుళ్ళను, మంట, పోట్లును తగ్గించును.

(అ॥ భూ) దీనిని లేపనమర్దనల కుపయోగించిన వాతపునొప్పులు, విసర్పము, కాలినపుండ్లు, అభిఘాతవ్రణము, శోఫలు, ఎలుక, కుక్క, నక్క మొదలగు జంతువులయొక్క కాట్లవలన గలుగు బాధలు, రక్త దోషములు, వ్రణములు హరించును. మరియు అండవృద్ధినికూడా హరింపజేయును.

## 221. భృంగామలక తైలము

వై॥ చిం॥ (పిత్తప్రకరణః)

శ్లో॥ శిరోభ్యంజన నస్యాభ్యాం శిరోరోగనివారణం
అక్షిరోగమపస్మారం కర్ణశూలంనివారయేత్
ఉన్మాదః ఘరోగఘ్నం సర్వరోగనివారణమ్.

ద్రవ్యములు:—తైలము, గుంటగలగరాకుస్వరసము, ఉసిరికాయల స్వరసము, కలబందస్వరసము మరియు తుంగముస్తలు, అతిమధురము, చందనము, వట్టివేరు మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—శిరోరోగహరము, నేత్ర్యము, మేధ్యము, కేశవృద్ధి కరము, శ్లేష్మహరము, ఉన్మాదరోగహరము, వలీపలితనాశనము.

ప్రయోగములు:—(వై. చిం.) దీనిని నస్యాభ్యంగనలేపన మర్ద నల కుపయోగించిన శిరోరోగములు, నేత్రరోగములు, అపస్మారములు, కర్ణశూలలు, ఉన్మాదరోగములు, శ్లేష్మరోగములు హరింపజేయుటయే గాక తెల్లని వెంట్రుకలు నల్లనగుట, శరీరకాంతి పీటిని కలుగజేయును.

(అ. భూ.) దీనిని నిత్యము, అభ్యంగనమున కుపయోగించిన శిరోరోగములు, భ్రమ, నేత్రరోగములను హరింపజేసి నిద్రను బాగుగా పట్టించును.

దీనిని నస్యమున కుపయోగించిన పార్శ్వశూలలు, పీనస, అప స్మారములు, మూర్ఛలు, వాతరోగములు, పిత్తరోగములు హరించును.

## 222. బలాశ్వగంధాది తైలము

యో॥ తరం॥ (16 వ॥ అధ్యాయః.)

శ్లో॥ లేపసర్వజ్వరోన్మాద క్షయకాసాదయోగదాః
నశ్యంతివివిధాంశ్చైవ వాతరోగానసంశయః
అశ్విభ్యాం నిర్మితం తైలమేతత్ పుష్టికరంపరం.

ద్రవ్యములు:—నువ్వులనూనె, పెరుగుతేట, మరియు బలామూ లము, పెన్నేరు, లక్క, సన్నరాష్ట్రము, మంజిష్ట, సుగంధిపాల, దేవ దారు, సదాప మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—బల్యము, వాతహారము, క్షయహారము, ఉన్మాదహారము.

ప్రయోగములు:—దీనిని నస్యాభ్యంగన వస్తికర్మలయం దుప యోగించిన ఉన్మాదములు, కటివాతము, సంధివాతము మొదలగు వాత రోగములు హరించును.

మరియు శరీరమునకు మర్దనలేపనములయం దుపయోగించిన పైన వ్రాయబడిన వ్యాధులను క్షయ, పురాణజ్వరములయందు కలుగు శరీర కృశత్వమును పోగొట్టును. మరియు ఎండిపోయిన అవయవములకు కండ పుష్టిని కలుగజేయును.

## 223. మహామాష తైలము (మహామినుమాష తైలము)

భై॥ ర॥ (వాతరోగాధికారః)

శ్లో॥ పక్షాఘాతేర్దితే వాతే బాధిర్యేహనుసంగ్రహే
పాణిపాదశిరోగ్రీవా భ్రమణేమందచంక్రమే
కలాయఖంజేపాంగుల్యే గృధ్రస్యామపబాహుకే.

ద్రవ్యములు.—నువ్వులనూనె, పాలు, మరియు మినుములు, దశమూలములు, మేకమాంసము, శతావరి, సన్నరాష్ట్రము, త్రికటుక ములు, పెన్నేరు మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—వాతహారము, పుష్టికరము, ఊర్ధ్వాంగవాతహారము.

ప్రయోగములు:—(భై॥ ర.) దీనిని వస్తిపానాభ్యంగన మర్దన లేపనములవలన పక్షవాతము అర్దితవాతము, చేతులుకాళ్ళయొక్క నడక మందగించుట, పంగువాతము (కాళ్లు ఈచకపోవుట), గృధ్రసీవా తము, అపబాహుకవాతము మొదలగు వాతవ్యాధులన్నియు హరించును.

దీనిని నస్యాభంగన లేపన మర్దనలు చేయుచూ చెవులయం దునూ, నేత్రములయందునూ వేయుటవలన చెవుడు, నక్కిళ్ళు బిగతీ యుట, చెవులు, కణతలు, శిరస్సు పీట్లయందు కలుగు శూలలు, మరియు పైన వ్రాయబడిన వ్యాధులు హరించును.

దీనిని పై వ్యాధులయందు స్నేహస్వేదకర్మల కుపయోగించిన మిక్కిలి గుణకారిగానుండును. (ఇది తైలములయందు శ్రేష్టమైనది.)

## 224. విషముష్టి తైలము (విషతిందుక తైలము.)

బ॥ రా॥ (వాత। ప్ర) 6 వ॥ అధ్యాయః.

శ్లో॥ సర్వాంగసంధ్యస్థిగతాప్లువాయు కఫామయేచానిలఘోరశూలే
విలోమవాయావనులోమవాయౌ స్తంభేధనుర్వాత ఇతిప్రశస్తమ్.

ద్రవ్యములు:—నువ్వులనూనె, ఆముదము, నిమ్మరసము, విష ముష్టిగింజల సారము గలవు

గుణము:—వాతహరము.

ప్రయోగములు:—(బ॥రా॥) దీనిని నిత్యము శరీరమునకు లేపన మర్దనలు చేయుచుండిన సర్వాంగవాతము, సంధివాతము, అస్థివాతము, ఆప్లువాతము, కఫవాతము, వాతపునొప్పులు, విలోమ, అనులోమ వాతములు, ఊరుస్తంభవాతము, ధనుర్వాతము మొదలగునవి హరించును.

## 225. సోమరాజీతైలము

భై॥ ర॥ (కుష్ఠాధికారః॥)

శ్లో॥ . . . నాడీదుష్ట వ్రణాపహం
అనేనాసు ప్రణమ్యంతి కుష్ఠాన్యష్టాదశైవతు
నీలికా పిడకావ్యంగో గంభీరంవాతశోణితం.

ద్రవ్యములు:-ఆవనూనె మఱియు బావంచాలు, పసుపు, ఆవాలు, గానుగ విత్తులు, తంటెపువిత్తులు మొదలగు ద్రవ్యములయొక్క సారములుగలవు.

గుణము:-వ్రణరోపణము, కుష్ఠహరము, క్రిమిహరము, త్వచ్యము, ఇంద్రలుప్తహరము.

ప్రయోగములు:-(భై॥ర॥) దీనిని లేపనమర్దనల కుపయోగించిన నాడీవ్రణములు, దుష్టవ్రణములు, పదునెనిమిది కుష్ఠములు, ప్రమేహ వ్రణములు, మంగు, గంభీరమైనవాతశోణితము, దురద, గజ్జి మొదలగు చర్మగత, రక్తగతవ్యాధులను హరింపజేయును.

(అ. భూ) దీనిని పైవిధముగా నుపయోగించిన ఇంద్రలుప్తము, (పేనుకొరుకుడు) విసర్పి, శ్విత్రము (బొల్లి) మరియు పైనవ్రాయబడిన వాటియందునూ అమోఘముగా పనిజేయును.

దీనిని పైవిధముగా నుపయోగించుచూ లోపలికి మధుస్నుహీ రసాయనము, గంధకరసాయనము, ఖదిరారిష్టము మొదలగు రక్తశుద్ధికరౌషధములు సేవించిన పైనవ్రాయబడిన వ్యాధులయందు బాగుగా పనిజేయును.

## 226. హింగుత్రిగుణతైలము (హింగుసైంధవాది యోగము)

అ॥ హృ॥ (చి॥ స్థా) గుల్మ॥ చి॥ 14 వ॥ అధ్యా॥

శ్లో॥ ... .. ... గుల్మోదర వర్ధ్మ శూలఘ్నమ్.

**ద్రవ్యములు:**—ఆముదము, సైంధవలవణము, ఇంగువ మరియు వెల్లుల్లిస్వరసము.

**గుణము:**—దీపనము, గుల్మోదరరోగహరము, శూలహరము, వాతానులోమనము.

**ప్రయోగములు:**—(అ॥ హృ॥) దీనిని 1, 2 ఔన్సుల గోరు వెచ్చని ఆవుపాలలో కలిపి సేవించినయెడల గుల్మము, ఉదరరోగము, అండవృద్ధులు, శూలవ్యాధులు, మలబద్ధము, స్త్రీలఋతుసంబంధ వ్యాధులుహరించును.

(ఆ. భూ) దీనిని వస్తియందువయోగించిన (అనగా వేడినీళ్ళ యందుకలిపి అనువాసనవస్తి 'ఎనిమా' చేయుట) యెడల పిల్లలకుకలుగు బాలపావచిన్నెలు (చిన్నబిడ్డగుణము) యకృత్ప్లీహా రోగములు హరించును. ఇట్లు అప్పుడప్పుడు చేయుచుండిన పైవ్యాధులను రాకుండా కాపాడును.

పిల్లలకు చిన్నబిడ్డగుణము వచ్చినవెంటనే పైనచెప్పినట్లు వస్తికర్మ చేసినయెడల వెంటనే తగ్గును. మరియు పెద్దలకు కూడా వాతవ్యాధులు వచ్చినవెంటనే దీనిని వస్తికర్మచేసిన యెడల వాతమును అనులోమస్థితిని జెందించి వ్యాధిని తగ్గించును.

ఈ తైలమును వెచ్చచేసి చెవులలో పోసినయెడల నీరుకారుట, చీముకారుట, పోటు మొదలగు కర్ణరోగములు హరించును.

## 227. క్షీరబలా తైలము (సప్తావర్తితము)

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ రసాయనంముఖ్యతమ మింద్రియాణాంప్రసాదనమ్
జీవనంబృంహణం స్వర్యం ... ... ...

ద్రవ్యములు:—నువ్వుల నూనె, పాలు, మరియు బలామూల సారము గలవు. (దీనిని ఏడుసార్లు ఆవర్తితములు చేయబడినది.)

గుణము:—రసాయనము, బల్యము, వాతహరము, క్షయ రోగ హరము, ధాతువృద్ధికరము.

ప్రయోగములు:—దీనిని గోరువెచ్చని ఆవుపాలయందు కలుపుకొని సేవించిన యెడల పక్షవాతము, అర్దితవాతము, శుష్కవాతము (ఎండిపోవుట) మొదలగు వాతవ్యాధులు, ధాతుక్షయమువలన ఎండిపోవుటను హరింపజేసి శరీరమునకు బలమును, నరములకు శక్తిని కలుగజేయును.

దీనిని లేపనమర్దనల కుపయోగించిన క్షయవ్యాధుల వలన శరీరము శుష్కించుట, వాతవ్యాధులవలన అవయవములు శుష్కించుటను పోగొట్టి శరీరమునకు, అవయవములకును బలమును జేకూర్చును.

పక్షవాతమునందు దీనిని పానాభ్యంగన లేపనములకు ముఖ్యముగా వాడదగినది.

## 228. క్షీరబలా తైలము (ఏకావర్తితము)

(యో॥ త॥)

శ్లో॥ ఎతత్ క్షీర బలా తైలం వాతాశీతివినాశనమ్.

ద్రవ్యములు:—నువ్వులనూనె, పాలు, మరియు బలామూల సారము. (ఇది ఒకసారి ఆవర్తితము మాత్రమే చేయబడినది)

గుణము:—వాతహరము.

ప్రయోగములు:—ఇదికూడా "క్షీరబలా తైలము (సప్తావర్తితము)" యొక్క గుణములనే కలిగియున్నందున దాని నుపయోగించినట్లే దీనిని కూడా వుపయోగించుకొనవలయును.

# చూ ర్ణ ము లు

## 229. అశ్వగంధాదిచూర్ణము

(అశ్వగంధాది లేహ్యమునకు చెప్పబడిన చూర్ణము)

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ అశ్వగంధోజరావ్యాధినాశకః । ధాతువృద్ధికరః బలదఃస్మృతః.

ద్రవ్యములు:—పెన్నేరు, నేలగుమ్ముడు, సుగంధిపాల, జీలకఱ్ఱ, ఫిరంగిచెక్క.

గుణము:—రసాయనము, బల్యము, రక్తశుద్ధికరము, వృష్యము, ఔపసర్గికరోగహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—దీనిని పంచదారకలిపిన ఆవుపాలతో ఉదయ సాయంత్రములయందు సేవించిన ధాతువృద్ధి, బలమును కలుగజేయును. మరియు రక్తదోషములు, ఔపసర్గికరోగములు, శుక్రనష్టములను హరింపజేయును.

దీనిని రజతచంద్రోదయము, పూర్ణచంద్రోదయము, సర్వవ్యాధి హరణరసము మొదలగు శుక్రవృద్ధి, రక్తదోషహరౌషధములకు అనుపానముగా నుపయోగించిన బాగుగా పనిజేయును.

## 230. అష్టచూర్ణము (హింగ్వష్టకచూర్ణమని కూడా వాడుదురు)

(త్రికటుకాది చూర్ణమనియున్నది.)

అ॥ హృ॥ (చి॥ స్థా) గుల్మ॥ చి॥ 14 వ. అధ్యా.

శ్లో॥ ప్రథమకబళభోజ్య సర్పిషాచూర్ణకోయం
జనయతిభృశమగ్నిం వాతగుల్మం నిహంతి.

ద్రవ్యములు:—త్రికటుకములు, వాము, సైంధవలవణము, జీరకద్వయము, ఇంగువ.

గుణము:—దీపనము, పాచనము, గుల్మరోగహరము, శూలహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ¼ తులమువరకు.

ప్రయోగములు:—(అ॥ హృ॥) దీనిని భోజనమందు మొదటి కబళము (ముద్ద) నందు నేతితో కలిపి భుజించినయెడల మిక్కుటమైన ఆకలిని వృద్ధిజేయును. మరియు వాతగుల్మములను హరింపజేయును.

(అ. భూ.) దీనిని మజ్జిగ, వేడినీళ్ళతో సేవించిన అజీర్ణము, గుల్మరోగములు, కడుపుబ్బరము, శూలలు, రజోదోషము, ఋతుశూలలు హరించును.

ఋతుశూలలయందుపయోగించునప్పుడు దీనిలో కాసీససిందూరమును కలిపి అశోకారిష్టముతో వాడిన బాగుగా పనిజేయును.

దీనిని మజ్జిగతో సేవించిన గ్రహణి అతిసారములు హరించును.

## 231. అర్కలవణము

భై॥ ర॥ (యకృత్ప్లీహాధికారము)

శ్లో॥ మస్తునాతత్పిబేత్ క్షారం ప్లీహాగుల్మోదరాపహం.

ద్రవ్యములు:—అర్కపత్రము, సైంధవలవణము.

గుణము:— లేఖనము, పాచనము, యకృత్ప్లీహారోగహరము.

ప్రమాణము:— 1/32 తు. మొదలు 1/16 తులము వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని పెరుగుమీఁది తేటతో సేవించిన ప్లీహవ్యాధులు, గుల్మవ్యాధులు, ఉదరములు హరించును.

(అ. భూ.) దీనిని ఆవుపంచితముతో సేవించిన ఉదరగుల్మవ్యాధులు హరించును.

## 232. ఐన్ద్రిలవణము

(అనుభూతము)

ద్రవ్యములు:—చేదుపుచ్చకాయలు, సైంధవలవణము.

గుణము:— రేచనము, లేఖనము, యకృత్ప్లీహారోగహరము, గుల్మరోగహరము.

ప్రమాణము:—⅛ తు. మొదలు ¼ తులము వరకు.

ప్రయోగములు:—దీనిని రాత్రిపూట పరుండబోవునప్పుడు వేడి నీళ్ళతో సేవించినయెడల విరేచనముకలుగజేసి ప్రేగులయందుండు జిగురు పదార్థమును వెడలగొట్టును.

మరియు దీనిని పైవిధముగానే సేవించిన యకృత్ప్లీహరోగములు, గుల్మరోగములు, ఉదరవ్యాధులు హరించును.

దీనిని గర్భిణీస్త్రీలు వాడకూడదు.

## 233. కర్పూరాదిచూర్ణము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ ... ... ... వాతార్శోనాశనం పరమ్
హృద్రోగం కటిరోగంచ కాసంహిక్కాంచపీనసమ్.

ద్రవ్యములు:—కర్పూరము, ఏలకులు, నాగకేసరములు, జాజికాయలు, తవాక్షీరి, చందనము, పంచదార మొదలగుద్రవ్యములుగలవు.

గుణము:— అర్శోరోగహరము, హృద్యము, కఫహరము, కాసశ్వాసహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—దీనిని ఉదయ సాయంత్రములయందు తేనెతోగాని, నేతితోగాని, గోరువెచ్చని ఆవుపాలతోగాని సేవించిన వాతార్శస్సులు, హృద్రోగము, కటిరోగము, దగ్గు, ఎక్కిళ్లు, పీనసము, ఉబ్బసము, అతిసారము, బలహీనము, ప్రమేహము, గ్రహణీవ్యాధులను హరింపజేయును. మరియు వృష్యము, బలము వీనిని వృద్ధిజేయును.

## 234. కంపిల్లము

శ్లో॥ పిత్తవ్రణాధ్మాన విబంధహారీ శ్లేష్మోదరార్తి క్రిమిగుల్మహారీ
మూలామశోఫ జ్వరశూలహారీ కంపిల్లకోరేచ గదాపహారీ.

ఇది ఒక ప్రత్యేక ద్రవ్యము. యిదిఎఱ్ఱగా ఇటుకపొడివలె యుండును.

గుణము:—పిత్తహరము, రేచనము, క్రిమిహరము, గుల్మోదర రోగహరము.

ప్రమాణము:— ⅛ తు. మొదలు ¼ తులము వరకు.

ప్రయోగములు:—దీనిని రాత్రి పరుండబోవునప్పుడు గాని, ఉదయమునగాని పంచదారతో కలిపిగాని లేక కేవలము దీనినివేడి నీళ్ళతో సేవించిన సుఖముగా విరేచనము కలుగజేసి క్రిములనునశింపజేయును.

మరియు యిది పిత్తరోగములను, ఆధ్మాన, శ్లేష్మములను, ఉదర రోగములను, గుల్మములను, మూలరోగములను, శూలలను హరింప జేయును.

దీనిని ప్రతి ఔషధమునందు విరేచన నిమిత్తము అనుపానముగా చేర్చుకొన వచ్చును.

## 235. గంగాధర చూర్ణము (మధ్యమము)

ఆ॥ భై॥ ర. (కృష్ణపండితీయం) చూర్ణమాల

శ్లో॥ నానావర్ణామతీసారం చిరజంబహురూపిణమ్
దూర్వారాంగ్రహణీంహన్తి తృష్ణాంకాసంచదుర్జయమ్.

ద్రవ్యములు:—మారేడు, కర్కాటకశృంగి, దానిమ్మయిగుల్ల, గుగ్గిలము, త్రికటుకములు, నేరేడుపప్పు, కొడిశపాలవిత్తులు, బూరుగ బంక, గంజాయియాకు, కొడిశపాలపట్ట మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—గ్రాహి, దీపనము, పాచనము, రక్తబంధనము, కాసహరము.

ప్రమాణము:—1/16 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:— (ఆ॥ భై॥ ర॥) దీనిని మేకపాలతోగాని, మజ్జిగతోగాని, తేనెతోగాని సేవించిన నానావర్ణములు కలిగినట్టియు, చిరకాలమైనట్టియు, అనేకవిధములైనట్టియు అతిసారములు, అసాధ్యమైన గ్రహణీవ్యాధులు హరించును. మరియు వీటివలన కలుగు దగ్గు, జ్వరము, నంజు, పాండురోగములను హరింపజేయును.

(అ. భూ.) దీనియందు కర్పూరాదివటినిగాని, అష్టాక్షరీగుటికను

గాని కలిపి కర్పూరాద్యరిష్టముతో సేవించిన నదీప్రవాహమువంటి అతిసారములు తగ్గును.

N B దీనిలో గంజాయియాకు యున్నది. ఇది చాలా తక్కువభాగముగా యున్నందున భయపడక వాడుకొనవచ్చును.

## 236. గోక్షురాదిచూర్ణము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ గోక్షురః శీతలంస్వాదు ర్బలకృత్ వస్తిశోధనః
మధురోదీపనోవృష్యః పుష్టిదశ్చాశ్మరీహరః
ప్రమేహశ్వాసకాసార్శః కృచ్ఛ్రహృద్రోగ వాతనుత్.

ద్రవ్యములు:—పల్లేరుకాయలు, సర్జక్షారము, యవక్షారము, చలవమిరియాలు, రేవల్‌చిన్ని, సురేకారము, వెలిగారము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—వస్తిశోధనము, మూత్రలము, దీపనము, అశ్మరీరోగ హారము, శోఫహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—దీనిని ఉదయ సాయంత్రములయందు వేడినీళ్ళతో సేవించిన మలమూత్రములను జారీచేసి ఉదరము, నంజువ్యాధులను, మూత్రకృచ్ఛ్రమూత్రాఘాతములను,అశ్మరీరోగములనుహరింపజేయును.

(అ.భూ) దీనిలో స్వర్ణవంగమునుకలిపి చందనాసవముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, శెగవ్యాధులు, మూత్ర మందలిమంట మొదలగు మూత్రరోగములయందు మూత్రమును జారీ చేసి సుఖమును చేకూర్చును.

## 237. చందనాదిచూర్ణము

వై॥ ర॥ (స్త్రీరోగాధికారము)

శ్లో॥ చతుర్ప్రకారంప్రదరం రక్తాతీసార ముల్బణమ్
రక్తార్శాంసి నిహన్త్యాశు భాస్కర స్తిమిరం యథా.

ద్రవ్యములు:—చందనము, జటామాంసి, వట్టివేళ్లు, మారేడు, తుంగ

గడ్డలు, తిప్పసత్తు, కొడిశపాలవిత్తులు, ఆరెపువ్వు, మామిడిజీడి, నేరేడు గింజలపప్పు, యాలకులు, దానిమ్మబెరడు మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:—రక్తపిత్తహరము, ప్రదరరోగహరము, రక్తాతిసార హరము, ఉష్ణశమనము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని బియ్యపు కడుగులో కలిపి అందు తేనెను వేసి సేవించినయెడల నాలుగు విధములైన ప్రదరములు, అధికమైన రక్తాతిసారములు, రక్తార్శస్సులు, రక్తపిత్తములు హరించును.

(అ. భూ.) దీనిలో పంచామృత పర్పటిని కలిపి కుటజారిష్టముతో సేవించిన రక్తాతిసారములయందు బాగుగా పనిజేయును.

## 138. జాతీఫలాదిచూర్ణము

(అనుభూతము)

ద్రవ్యములు:—జాజికాయలు, వెలిగారము, లవంగములు, జీలకఱ్ఱ.

గుణము:—శామకము, గ్రాహి, నిద్రాప్రదము, స్తంభనము.

ప్రమాణము:—1/16 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—దీనిని తేనెతోగాని, మజ్జిగతోగాని సేవించిన గ్రహణి, అతిసారము, రక్తపిత్తము, అరోచకము, అగ్నిమాంద్యము లను హరింపజేయును. మరియు శుక్రస్తంభన జేయును.

రోగులకు నిద్రపట్టనప్పుడు దీనిని పైవిధముగా సేవించిన బాధలను తగ్గించి నిద్రపట్టించును.

## 239. తాళీసాది చూర్ణము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 6 వ. అధ్యా॥

శ్లో॥ తాళీసాద్యమిదంచూర్ణం రోచనంపాచనం స్మృతమ్
కాసశ్వాసజ్వరహరం ఛర్ద్యతీసార నాశనమ్
శోషాధ్మానహరం ప్లీహ గ్రహణీ పాండురోగజిత్.

ద్రవ్యములు:— తాళిసపత్రి, త్రికటుకములు, వంశలోచనము, (తవాక్షీరి) ఏలకులు, దాల్చినచెక్క, పంచదార గలవు.

గుణము:—దీపనము, రుచ్యము, కఫహరము, జ్వరహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—దీనిని నిత్యము తేనెతో సేవించిన అరుచి, కాసము, శ్వాసము, జ్వరము, వాంతులు, యకృత్ప్లీహవ్యాధులు, పీనసము, కడుపుబ్బరము, హరించును.

దీనిని వెన్నపూసతో సేవించిన క్షయ, హృద్రోగములు, హరించును.

దీనిని క్రమవృద్ధిలక్ష్మీవిలాసరసము, మహాకనకసుందరరసము మొదలగు కాసశ్వాసలకు, క్షయలకు పనికివచ్చు ఔషధములకు అనుపానముగా నుపయోగించవచ్చును.

## 240. త్రిఫలాచూర్ణము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 6 వ॥ అధ్యా.

శ్లో॥ త్రిఫలా మేహశోథఘ్నీ నాశయేద్విషమజ్వరాన్
దీపనశ్లేష్మ పిత్తఘ్నీ కుష్ఠహన్త్రీ రసాయనీ

ద్రవ్యములు:— కరక్కాయలబెరడు, తానికాయలబెరడు, ఉసిరికాయలబెరడు.

గుణము:—రసాయనము, ప్రమేహహరము, నేత్ర్యము, త్వచ్యము, రక్తదోషహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ¼ తులమువరకు.

ప్రయోగములు:—(శా॥ ధ॥) దీనిని తేనెతోగాని, నెయ్యితోగాని సేవించిన ప్రమేహము, వాపు, విషమజ్వరము, శ్లేష్మపిత్తరోగములు, కుష్ఠము, నేత్రరోగములు విషదోషములు హరించును. మరియు రసాయనముగా పనిజేయును.

దీనిని వేడిపాలతోగాని, వేడినీళ్ళతోగాని సేవించిన సుఖవిరేచనమును కలుగజేసి అగ్నిమాంద్యము, నేత్రరోగములను హరింపజేయును. వాతానులోమనము గావించును.

## 241. త్రికటుచూర్ణము (త్ర్యూషణచూర్ణము)

శా॥ ధ॥ సం. (మ॥ ఖం.) 6 వ. అధ్యా.

శ్లో॥ దీపనం శ్లేష్మమేదోఘ్నం కుష్ఠపీనసనాశనమ్
జయేదరోచకం సామం మేహగుల్మగళామయాన్.

ద్రవ్యములు:—శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు.

గుణము:—దీపనము, పాచనము, జ్వరహరము, కఫహరము.

ప్రమాణము:—1/32 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—(శా. ధ.) దీనిని తేనెతోగాని, వేడిపాలతో గాని సేవించిన ఆమమును పచనముజేసి ఆకలిని వృద్ధిజేసి జ్వరమును హరింపజేయును. మరియు కఫరోగములు, మేదోరోగములు, కుష్ఠము, పీనసము, అరుచి, ప్రమేహము, గుల్మము, గళరోగములను హరింప జేయును.

(అ. భూ.) దీనిని 2 గురిగింజలఎత్తు చూర్ణమును నీళ్ళలోనూరి వడియబోసి నస్యముజేసినయెడల కఫాధిక్యతచే స్మృతిలేకపడియుండుట, పీనసము, అపస్మారములు నివర్తించును.

## 242. తేకరాజమరిచము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ భక్షయేత్ ప్రాతరుత్థాయ కాసశ్వాసవినాశనమ్॥

ద్రవ్యములు:—మిరియాలు, కరక్కాయలు, పిప్పళ్ళు, గంటు భారంగి, సైంధవలవణము, పుష్కరమూలము, మరియు గుంటగల గరస్వరసము గలవు.

గుణము:—దీపనము, పాచనము, కాసశ్వాసహరము, కఫహరము.

ప్రమాణము:— 1/32 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—దీనిని తేనెతోగాని, వేడినీళ్ళలోగాని ప్రాతః కాలమున సేవించిన ఆమమును పచనముజేసి జ్వరమును, పీనసమును, కాస శ్వాసలను, శ్లేష్మప్రకోపములను, పురాణజ్వరములను హరింపజేయును. పడిశభారము ఎక్కువగాయున్నచో దీనిని నస్యముగా పీల్చవచ్చును.

## 243. దాడిమాష్టకచూర్ణము

అ। హృ॥ (చి। స్థా।) అతిసార॥ ప్ర॥ (9 వ. అధ్యా॥)

శ్లో॥ భోగ్యోవాతాతిసారార్తై ర్యథావస్థంఖలాదిభిః.

ద్రవ్యములు:—దానిమ్మపండ్లు, పంచదార, తవాక్షీరి, చాతుర్జాతకములు, వాము, ధనియాలు, జీలకఱ్ఱ, మోడి, త్రికటుకములు గలవు.

గుణము:—గ్రాహి, దీపనము, రక్తపిత్తహరము.

ప్రమాణము:—1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:–(అ।హృ) దీనిని వాతాతిసారరోగులకు దోషాద్యవస్థానుగుణ్యముగ జావలయందుకలిపి పానముజేయించిన వాతాతిసార రోగులకు మేలుకలుగజేయును.

(అ. భై.) దీనిని మజ్జిగతో సేవించిన గ్రహణి, అతిసారము, అగ్నిమాంద్యము, రక్తపిత్తములు హరించును.

దీనితో మహాగంధకపర్పటి, కర్పూరాదివటులను కలిపి తేనెతో గాని, మజ్జిగతోగాని సేవించిన పైవ్యాధులయందు బాగుగాపనిజేయును.

## 244. పామాహరచూర్ణము

(అనుభూతము)

ద్రవ్యములు:–ముపిణీఆకులు, మైలతుత్థము, నేలవేము గలవు.

గుణము:—త్వచ్యము, క్రిమిహరము, పామాహరము.

ప్రయోగములు.—ఇది పైపూతకుపయోగించు ఔషధము.

దీనిని కొబ్బరినూనెయందుగాని, వెన్నపూసయందుగాని కలిపి లేపనముగా నుపయోగించిన తీట, గజ్జి, తామర, వ్రణములు, దురద మొదలగు సమస్తచర్మవ్యాధులను నివర్తింపజేయును.

## 245. పుష్యానుగచూర్ణము

భై॥ ర॥ (స్త్రీరోగా॥ కా॥)

శ్లో॥ యోనిదోషం రజోదోషం శ్వేతం నీలం సపీతకమ్
స్త్రీణాం శ్యావారుణంయచ్చ తత్ప్రసహ్య నివర్తయేత్.

ద్రవ్యములు:—చిరుబొద్ది, కోడిసగింజలపప్పు, మామిడిజీడి, రసాంజనము, బూరుగబంక, మంజిష్ఠ, అతివస, మారేడు, గైరికము, ద్రాక్ష, కొడిశపాల, సుగంధిపాల, ధాతకీ, అతిమధురము, మద్దిచెక్క మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—గ్రాహి. రజశ్శుద్ధికరము. గర్భాశయరోగ హరము, ప్రదరరోగహరము, రక్తపిత్తహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ¼ తులమువరకు.

ప్రయోగములు:—(వై॥ ర॥) దీనిని తేనెతో కలిపి సేవించి బియ్యపుకడుగును అనుపానముగా సేవించిన మూలవ్యాధులు, అతిసారము, రక్తస్రావములు, శాలుకయొక్క దోషాగంతుకవ్యాధులు, స్త్రీలయొక్క యోనిదోషములు, రజోదోషములు, తెల్లని, నల్లని, పచ్చని, శ్యామ, ఎఱ్ఱని, వర్ణములుగల ప్రదరములు హరించును.

(అ. భూ.) దీనిలో అభ్రకభస్మమును కలిపి పంచదార బియ్యపు కడుగుతో సేవించి బబ్బులారిష్టమునుగాని, అశోకారిష్టమును గాని అనుపానముగా త్రాగినయెడల ప్రదరవ్యాధులయందు బాగుగా పనిజేయును.

## 246. భాస్కరలవణము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 6 వ॥ అధ్యా॥

శ్లో॥ వాతశ్లేష్మభవం గుల్మం ప్లీహానముదరం క్షయమ్
అర్శాంసి గ్రహణీం కుష్ఠం విబంధం చ భగందరమ్
శోఫం శూలం శ్వాసకాస మామవాతం చ హృద్రుజమ్
మందాగ్నిం నాశయేదేతద్ దీపనం పాచనం పరమ్.

ద్రవ్యములు:—సముద్ర, సౌవర్చ, సైంధవ, బిడాలవణములు, ధనియాలు, త్రికటుకములు, దానిమ్మకాయలు, చాతుర్జాతకములు, మొదలగు ద్రవ్యములుకలవు.

గుణము:—దీపనము, పాచనము, గుల్మప్లీహోదరరోగహరము, శూలహరము, అర్శశమనము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/4 తులమువరకు.

ప్రయోగములు:— (శా॥ ధ) దీనిని పెరుగుమీఁది తేటతోఁగాని, (చల్లతోఁగాని) మద్యముతోఁగాని సేవించిన యెడల వాతకఫములవలన కలుగు గుల్మరోగములు, ప్లీహరోగములు, ఉదరరోగములు, సంగ్రహణి, మలబద్ధము, వాపు, శూల, శ్వాసకాసములు, హృద్రోగములు, అగ్నిమాంద్యములు హరించుటయేగాక దీపన పాచనములను కలుగజేయును.

(అ. భూ.) దీనిని వేడినీళ్లతోఁగాని, మజ్జిగతేటతోఁగాని సేవించిన అగ్నిమాంద్యము, (ఆకలిలేకపోవుట) అజీర్ణము, కడుపుబ్బరము, త్రేనుపులు, ఆమ్లపిత్తము, ఆమాతిసారములను హరింపజేసి ఆకలిని వృద్ధిజేయును.

దీనిలో శంఖభస్మమునుకలిపి నిమ్మకాయరసముతో సేవించిన సమస్త ఉదరశూలలు, పిత్తప్రకోపములు హరించును.

## 247. మహాద్రాక్షాదిచూర్ణము

బ॥ రా॥ (వంధ్యా॥ ప్ర॥) 15 వ॥ అధ్యా.

శ్లో॥ క్షయంచరక్తపిత్తంచ పాదదాహమసృగ్దరమ్
మృతగర్భాచయానారీ యాచగర్భావసారణీ
సాపిసూతేసుతం తద్వ న్నారాయణపరాయణమ్.

ద్రవ్యములు:— ద్రాక్ష, ఖర్జూర, చాతుర్జాతకములు, త్రికటుకములు, సారపప్పు, కురువేరు, జాపత్రి, నేలగుమ్ముడు, దూలగొండివిత్తులు, జాజికాయ, కర్కాటకశృంగి, జీడిపప్పు, పంచదార మొదలగు ద్రవ్యములు కలవు. (పంచదార యితరవస్తువులకు సమభాగముగా యుండును.)

గుణము:—రసాయనము, వాజీకరణము, బల్యము, వంధ్యాదోషహరము.

ప్రమాణము:—1/8 తులము మొదలు 1/2 తులము వరకు.

ప్రయోగములు:—(బ॥ రా) దీనిని నిత్యము ఆవునేతితో గాని, ఆవుపాలతోఁగాని సేవించిన క్షయ, రక్తపిత్తము, పాదదాహము, ప్రమే

హములు, రసాదిధాతునాశనము, మందిమిగ్, మలమూత్రబంధము, వాంతి, ఆమ్లపిత్తములను హరింపజేయును.

దీనిని స్త్రీలు పైఅనుపానములతో ఋతుకాలము మొదలుకొని నాల్గుమాసములు సేవించిన పైనవివరించినవ్యాధులు మరియు అసృగ్దరము, సోమరోగము, మృతగర్భము, గర్భస్రావములను హరింపజేసి సంతాన ప్రాప్తి కలుగజేయును.

ఈ చూర్ణమును పిత్తహర, శుక్రవృద్ధికర, గర్భవృద్ధికర, స్త్రీ రోగహర ఔషధములకు అనుపానముగా నుపయోగించు కొనవచ్చును.

## 248. యష్టిచూర్ణము

(అనుభూతము)

ద్రవ్యము:—యష్టిమధుకము (అతిమధురము)

గుణము:—పిత్తహరము, త్వచ్యము, విష్యందికరము, నేత్ర్యము.

ప్రమాణము:—1/16 తు. మొదలు ¼ తులము వరకు.

ప్రయోగములు:—(అ. భూ.) దీనిని తేనెతో సేవించిన పిత్త ప్రకోపము, వాంతి, దప్పిక, రక్తపిత్తములు, రక్తప్రదరము, నేత్రరోగ ములు హరించును.

దీనిలో సూర్యావర్తి కలిపి తేనెతో సేవించిన పిత్తప్రకోపములు, జ్వరములయందు కలుగు వాంతులు, దప్పిక, నేత్రరోగములుహరించును.

## 249. రసోత్తమాదిచూర్ణము

ఆం॥ వై॥ ర॥ (మార్గ॥ ప్ర॥)

శ్లో॥ ... ... ... ఘృతమిశ్రితానామ్ । త్రిభిః ప్రలేపైరపయాతి పామా.

ద్రవ్యములు:—రసము, గంధకము, మణిశిల, గంగసిందూరము, జీరకద్వయము, మిరియాలు, పసుపు, మానుపసుపు గలవు.

గుణము:—త్వచ్యము, క్రిమిహరము, వ్రణరోపణము, ఇది పై పూతల కుపయోగించు చూర్ణము.

ప్రయోగములు:—దీనిని నేతిలోగాని, కొబ్బరి నూనెలోగాని,

కలిపి లేపనముగా నుపయోగించిన, గజ్జి, తామర, వ్రణములు, దురద, మూగతీట, పామాకష్టు మొదలగు చర్మగతవ్యాధులను హరింపజేయును.

తామరకు దీనిని నిమ్మకాయరసమునందు కలిపి రాసినయెడల బాగుగా పనిజేయును.

N B దీనిని స్వర్ణరజతాభరణములకు, నోటికి, నేత్రములకు తగలకుండా కాపాడుకొనవలెను.

## 250. లక్షాచూర్ణము

(వై॥ యో॥ ర.)

ద్రవ్యము:—లక్క.

గుణము:—గ్రాహి, రక్తస్తంభనము, రక్తపిత్తహరము, ప్రదర రోగహరము.

ప్రమాణము:—1/32 తు. మొదలు ⅛ తులము వరకు.

ప్రయోగములు:—దీనిని తేనె, వెన్నపూస, పంచదార, వీట్లలో దేనితోనైన సేవించిన శరీరమునందు ఏ మార్గమునుండి వచ్చుచున్న రక్తమునైననూ ఆపును. మరియు ఊర్ధ్వగత, అధోగత రక్తపిత్తములు, రక్తప్రదరములు, రక్తగ్రహణ్యాతిసారములు నివర్తించును.

దీనిలో అభ్రకభస్మము, గుగ్గిలచూర్ణములను కలిపి నెయ్యి పంచదారతో సేవించి నేరేడుచెక్కస్వరసము త్రాగిన పై వ్యాధులయందు బాగుగా పనిజేయును.

## 251. వాసాచూర్ణము

(అనుభూతము)

ద్రవ్యము:— అడ్డసరముసమూలము.

గుణము:—శీతలము, పిత్తకఫహరము, కాసశ్వాసహరము, రక్తపిత్తహరము, ప్రదరరోగహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులమువరకు.

ప్రయోగములు:—దీనిని తేనెతో సేవించిన కాసశ్వాసములు, కఫ సంబంధమైనవ్యాధులు, స్త్రీలకుకలుగుప్రదరవ్యాధులు, దప్పిక, తాపములు హరించును.

దీనిని వెన్నపూస పంచదారతో సేవించిన రక్తపిత్తములు, రక్త ప్రదరములు, క్షయయందు కలిగెడి రక్తపిత్తములు, పిత్తసంబంధమైన వ్యాధులు హరించును.

దీనిని నెయ్యితో సేవించిన ప్రమేహవ్యాధులు హరించును.

## 252. శాల్మలీచూర్ణము

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యము:—బూరుగబంక.

గుణము:—రక్తస్తంభనము, పిత్తహరము, గ్రాహి, ప్రదర రోగహరము.

ప్రమాణము:—1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—దీనిని తేనెతోగాని, నేతితోగాని సేవించిన రక్తపిత్తము, రక్తప్రదరము, రక్తాతిసారము, రక్తగ్రహణీ వ్యాధులను, పిత్తరోగములను హరింపజేయును.

దీనిని పంచదారకలిపిన శతావరిస్వరసముతో సేవించిన ఊర్ధ్వగత, అధోగత రక్తపిత్తములు, ప్రదరవ్యాధులు హరించును.

దీనిని జాతీఫలాదిచూర్ణమునందు కలిపి కుటజారిష్టముతో సేవించిన రక్తాతిసారములు, రక్తగ్రహణీవ్యాధులు నివర్తించును.

## 253. సర్పగంధ చూర్ణము

(అనుభూతము)

ద్రవ్యము:— "సర్పగంధ" అను మూలిక.

గుణము:—వాతహరము, హృదయబల్యము, మేధ్యము, శామకము, నిద్రాకరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు ⅛ తులమువరకు.

ప్రయోగములు:—దీనిని నిత్యము ఆవుపాలతోగాని, వెన్నపూస పంచదారతోగాని, తేనెతోగాని సేవించిన హృదయమునకు నరములకు బలము కలుగజేసి మూర్ఛ, ఉన్మాదము, అపస్మారము (హిస్టీరియా)

లను హరింపజేయును. మరియు పై వ్యాధులవలన కలుగు బాధలను హరింపజేసి నిద్రను కలుగజేయును.

దీనిని వంటసువర్ణసూత్యావర్తి, రసరాజరసములకు అనుపానముగా కలిపి సేవించిన పై వ్యాధులయందు బాగుగా పనిజేయును.

## 254. సితోపలాదిచూర్ణము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 6 వ॥ అధ్యా

శ్లో॥ శ్వాసకాసక్షయహరం హస్తపాదాంగదాహజిత్
మందాగ్నింసుప్తజిహ్వాత్వం పార్శ్వశూలమరోచకమ్
జ్వరమూర్ధ్వగతం రక్తం పిత్తమాశువ్యపోహతి॥

ద్రవ్యములు:—ఖండశర్కర, (పటికబెల్లము) వంశలోచనము, (తవాక్షీరి) పిప్పళ్ళు, ఏలకులు, దాల్చినచెక్క.

గుణము:—దీపనము, పాచనము, రుచ్యము, కఫహరము, కాస శ్వాసహరము, క్షయహరము, రక్తపిత్తహరము, పిత్తహరము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:—(శా॥ ధ।) దీనిని తేనెతోగాని, నెయ్యితో గాని సేవించిన కాసశ్వాసములు, క్షయ, కాళ్ళుచేతులు వీనియందలి తాపము, అగ్నిమాంద్యము, నాలుక మొద్దుగయుండుట, పార్శ్వశూల, అరుచి, జ్వరము, ఊర్ధ్వగత రక్తపిత్తములు హరించును.

(అ. భూ.) దీనిని క్రమవృద్ధిలక్ష్మీవిలాసరసము, మహాకనకసుందర రసము, లోకనాథరసములకు అనుపానముగాచేర్చి సేవించిన క్షయల యందును కాసశ్వాసలయందును బాగుగాపనిజేయును.

దీనిని ద్రాక్షారిష్టముతో సేవించిన అగ్నిమాంద్యము, అరుచి, పొడిదగ్గులు, పైత్యవ్యాధులు హరించును.

## 255. సుదర్శనచూర్ణము

శా॥ ధ॥ సం॥ (మ॥ ఖం॥) 6 వ॥ అధ్యా॥

శ్లో॥ ... ... ... దోషత్రయాపహమ్
జ్వరాంశ్చనిఖిలాన్ హన్యాన్నాత్ర కార్యావిచారణా

పృథగ్ద్వంద్వాగంతుకాంశ్చ ధాతుస్థాన్ విషమజ్వరాన్
సన్నిపాతోద్భవాంశ్చాపి మానసానపినాశయేత్

ద్రవ్యములు:— నేలవేము, త్రిఫలములు, పసుపు, త్రికటుకములు, తిప్పతీగె, కటుకరోహిణి, పర్పాటకము, గంటుభారంగి, చేదుపొట్ల, జాపత్రి మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:— జ్వరహరము, క్రిమిహరము, త్వచ్యము, దీపనము, పాచనము.

ప్రమాణము:— 1/16 తు. మొదలు 1/8 తులము వరకు.

ప్రయోగములు:— (శా॥ ధ) దీనిని శీతోదకముతో సేవించిన వాతపిత్తశ్లేష్మములవలనకలుగురోగములు, ద్వంద్వజ్వరములు, ఆగంతుక జ్వరములు, ధాతుగతజ్వరములు, విషమజ్వరములు, సన్నిపాతజ్వరములు, మానసికజ్వరములు, శీతజ్వరములు, ఏకాహికజ్వరములు హరించును.

దీనిని తేనెతో సేవించిన గజ్జి, తామర, దురద, మూగతీట మొదలగు చర్మవ్యాధులను హరింపజేయును.

(అ॥ భూ) దీనిని జ్వరహర ఔషధములయందు అనుపానముగా జేర్చి వుపయోగించిన బాగుగా పనిజేయును.

మరియు దీనిని కొబ్బరినూనెలోకలిపి లేపనముగానుపయోగించిన గజ్జి, తామర, దురద మొదలగు చర్మవ్యాధులు హరించును.

## 256. స్ఫటికాదిచూర్ణము

ఆం॥ వై॥ ర॥ (కృష్ణపండితీయం) పరిశిష్ట॥ ప్ర॥

ద్రవ్యములు:— పటిక, కాచు.

గుణము:— దంతరోగహరము, వ్రణరోపణము, రక్తస్తంభనము, ఆస్యపాకహరము.

ఉపయోగము:— దీనితో ప్రతినిత్యము పండ్లు తోముకొనుచుండిన, చిగుళ్ళు ఉబ్బుట, దంతములనుండి చీము, రక్తము స్రవించుట, దంతములపోటు, దంతములు కదలుట, నోటిపూత, దుర్గంధము మొద

లగు దంతజిహ్వారోగములను హరింపజేసి దంతములకు బలమును కలుగ జేయును.

మరియు వ్రణములను శుభ్రపరచి వాటిపైన ఈచూర్ణమునుచల్లు చుండిన వ్రణములను మాన్పును.

దీనిని ప్రదరములు నివర్తింపజేయు యితరౌషధములయందు అను పానముగా కలుపుకొని సేవించవచ్చును.

## 257. సురదారులేపచూర్ణము

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:— దేవదారు, శొంఠి, నవాసాగరము.

గుణము:—శోఫనిర్వాపణము, వ్రణపాచనము.

ఉపయోగములు:— ఈ చూర్ణమును గోమూత్రముతోగాని, మజ్జిగతోగాని, నిమ్మకాయరసముతోగాని, నీళ్ళతోగాని వుడికించి వాపులమీద పట్టువేయుచుండిన నవి తగ్గును. మరియు వ్రణశోఫలపైన పట్టువేసినయెడల ఆమావస్థయందున్నచో వాపు తగ్గును. పచ్యమానా వస్థయందున్నచో శీఘ్రముగా పక్వముజేయును.

పైవిధముగానే గ్రంథులయందును, శ్లీపదాదులయందును పట్టు వేయుచుండిన దుష్టరక్తమును పోగొట్టి వాటిని శమింపజేయును.

## 258. సోమకల్పచూర్ణము

(అనుభూతము)

ద్రవ్యము:— "సోమకల్ప" అను మూలిక.

గుణము.–స్రోతశ్శోధనము, కాసశ్వాసహరము, తమకశ్వాసహరము.

ప్రమాణము.— 1/16 తు. మొదలు1/8తులమువరకు.

ప్రయోగములు:—దీనిని వెన్నపూసతోగాని, తేనెతోగాని సేవించిన తమకశ్వాస (ఉబ్బసము), దగ్గు, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులను హరింపజేయును.

దీనిని వాతాగ్ని కుమారమునందు అనుపానముగా కలిపి పై విధ ముగా సేవించిన పై వ్యాధులయందు బాగుగా పనిజేయును.

# రసాయనములు

## 259. కూష్మాండరసాయనము

(అనుభూతము)

ద్రవ్యములు:—కూష్మాండస్వరసము, పంచదార మరియు చాతుర్జాతకములయొక్క సారములు గలవు.

గుణము:—దీపనము, రసాయనము, ఉష్ణశమనము, రక్తపిత్తహరము, అర్శోరోగహరము, ప్రదరరోగహరము.

ప్రమాణము:—1/4 ఔన్సు మొదలు 1 ఔన్సువరకు.

ప్రయోగములు:—(ఇది తియ్యగానుండు రసాయనము) దీనిని రెట్టింపు నీటియందు కలుపుకొని సేవించిన అత్యుష్ణము, కాళ్ళు చేతులయందుకలుగు మంటలు, కండ్లుమంటలు, శరీరకృశత్వము, రక్తార్శస్సులు, రక్తప్రదరములు, రక్తపిత్తములు, శుక్రనష్టములు హరించును.

దీనితోపాటు వంగభస్మము, అభ్రకభస్మములనుకూడా సేవించిన పైనవ్రాయబడిన వ్యాధులయందు బాగుగా పనిజేయును.

మరియు దీనిని పైవిధముగా సేవించిన వేసవికాలమందు కలుగు దాహము, తాపము, కండ్లమంట మొదలగు అధికఎండలవలన కలుగు బాధలను తగ్గించును.

## 260. గంధకరసాయనము (G O)

ర॥ యో॥ ర॥ (6 వ॥ అధ్యా॥)

ద్రవ్యములు:—గంధకము, పిప్పళ్లు, మోడి, లవంగములు, నాగకేసరములు, త్రిఫలములు, త్రికటుకములు, వాయువిడంగములు, నెయ్యి, బెల్లము, తేనె గలవు.

గుణము:— రక్తశోధనము, త్వచ్యము, వ్రణరోపణము, కుష్ఠహారము.

ప్రమాణము:—1/8 తు. మొదలు 1/2 తులము వరకు.

ప్రయోగములు:— (ర॥ యో॥ ర॥) దీనిని నిత్యము తిప్పతీగె కషాయముతోగాని, సుగంధిపాల చంద్రచెక్కల కషాయముతోగాని

సేవించిన వాతజనితగ్రంధులు, శూలలు, కష్టములు, చర్మరోగములు, భగందరములు, గళగ్రంధులు, సమస్త వ్రణములు హరించును.

(అ॥ భూ) దీనిని శారిబాద్యరిష్టముతోగాని, ఖదిరారిష్టముతోగాని సేవించిన దురదలు. గజ్జి, మూగతీట, మచ్చలు, విసర్పి, వ్రణములు హరించును. మరియు రసపట్లు తగ్గును.

## 261. జంబీరాదిరసాయనము (జంబీరాదిపానకము)

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—నిమ్మపండ్లస్వరసము, అల్లపు స్వరసము, పంచదార గలవు.

గుణము:—దీపనము, రుచ్యము, పిత్తహరము.

ప్రమాణము:—1/8 ఔన్సు మొదలు 1/2 ఔన్సు వరకు.

ఇది పుల్లగా, తియ్యగా, కారముగా యుండు రసాయనము.

ప్రయోగములు :— దీనిని రెట్టింపునీటియందు కలుపుకొని సేవించిన అజీర్ణము, వాంతి, కడుపుబోమంట, కళ్లుతిరుగుట, తలత్రిప్పుట, అరుచి మొదలగు పైత్యవ్యాధులను హరింపజేసి ఆకలి కలుగునట్లుజేయును.

గర్భిణులు సేవించిన గర్భవికారములు హరించును.

దీనిని లఘుసూత్రాజ్యావర్తి, పంటసువర్ణసూత్రాజ్యావర్తి మొదలగు పిత్తహర ఔషధములకు అనుపానముగా సేవించిన పైన వ్రాయబడిన వ్యాధులయందు బాగుగా పనిజేయును.

## 262. పంచతిక్తరసాయనము

(వై॥ యో॥ ర.)

ద్రవ్యములు:—పంచదార మరియు నేలవేము, చేదుపొట్ల, వేపచెక్క, వాకుడు, తిప్పతీగె మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:—జ్వరహరము, రక్తశుద్ధికరము, క్రిమిహరము, త్వచ్యము.

ప్రమాణము:—1/4 ఔ. మొదలు 1/2 ఔన్సు వరకు.

ప్రయోగములు:—దీనిని రెట్టింపు నీటియందు కలుపుకొని సేవించిన సర్వవిషమ (Malaria) జ్వరములు, విస్ఫోటము, చర్మగతవ్యాధులు, మలబద్ధము, పురాణజ్వరములు, సామాన్యజ్వరములు నివర్తించును. మరియు రక్తదోషములనుగూడా తగ్గించును.

ఇది విశేషముగా చలిజ్వరము (Malaria) లయందు బాగుగా పనిజేయును.

దీనిని విషమజ్వరవటి, శీతాంశురసములకు అనుపానముగా సేవించిన చలిజ్వరములయందు బాగుగా పనిజేయును.

## 263. బ్రాహ్మీరసాయనము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ మేధ్యాయురగ్ని జననీ కంఠశుద్ధికరీ, వ్యాఖ్యాస్మృతిదాచరసాయనీ,
శ్వాసం శోషం సర్వదోషం కఫవాతా మయాన్ జయేత్.

ద్రవ్యములు —సరస్వతీయాకుస్వరసము, పంచదార, మరియు త్రిజాతకములు, పిప్పళ్ళు వీట్లసారములు గలవు.

గుణము:—మేధ్యము, రుచ్యము, బల్యము, స్మృతిబుద్ధికరము.

ప్రమాణము:—1/4 ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ఇది తియ్యగా రుచిగా యుండు ఔషధము.

ప్రయోగములు:—దీనిని రెట్టింపునీటియందు కలుపుకొని సేవించిన బుద్ధిమాంద్యము, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదములను పోగొట్టి ఆయువును, వీర్యమును, ధైర్యమును, బలమును, కాంతిని వృద్ధిజేయును.

మరియు వాగ్విశుద్ధి (అనగా మాటలను స్పష్టముగా నపశబ్దములు లేకుండ నుచ్చరించునట్లు చేయుట) హృదయమునకు బలమును కలుగజేయును. యిది రసాయనౌషధముల యందు త్తమమైనది.

దీనిని చిన్నపిల్లలకుపయోగించిన నత్తిని, సోమరితనమును పోగొట్టి మంచిమాటలు వచ్చునట్లుగను, మేధావంతులుగను జేయును.

## 264 మధుస్నుహీరసాయనము

యో॥ త॥ (8 వ. అధ్యా.)

శ్లో॥ వాతపిత్తరూక్షజంచ, శ్లేష్మకం క్షయఘ్నకం
ప్రమేహహారి గుల్మశూల కుష్ఠజా వ్రణాన్పరమ్
సర్వధాతుకర్ధనం బలప్రదం సుఖప్రదం.

ద్రవ్యములు:—మధుస్నుహీ, (ఫిరంగిచెక్క) గుగ్గిలము, గంధకము, పంచదార, నెయ్యి, తేనె, త్రిఫలములు, త్రికటుకములు, త్రిజాతకములు, సుగంధిపాల, నేలతాడి, పెన్నేరు మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—రక్తశోధని, వాతహరము, త్వాచ్యము, ఫిరంగరోగహరము, కుష్టహరము, ఆమవాతహరము.

ప్రమాణము:— 1/8 తు. మొదలు 1/2 తులమువరకు.

ప్రయోగములు:—(యో॥ త॥) దీనిని ఉదయసాయంకాలముల యందు సేవించిన జఠరాగ్ని (ఆకలి) గల్గును. రుచిపుట్టును. వాత పిత్త శ్లేష్మవ్యాధులు, క్షయ, ప్రమేహము, గుల్మము, శూల, కుష్టములను హరింపజేయును. మరియు ధాతువృద్ధి, బలమును కలుగజేయును.

(అ. భూ.) దీనిని ఉదయసాయంకాలములయందు ఆవుపాలతో సేవించిన ఫిరంగ (సవాయిమేహ) రోగములు, (అనగా కొరుకుడు, పొక్కుసవాయి, వ్రణములు మొదలగునవి) కుష్టము, శ్విత్రము, భగందరము, మూలవ్యాధులు, గండమాల, వాతరక్తము, కీళ్ళవాపులు, చర్మవ్యాధు (అనగా గజ్జి, తామర, దురద, విసర్పి మొదలగునవి) లను హరింపజేసి బలమును, ధాతువృద్ధిని కలుగజేయును.

దీనిలో సర్వవ్యాధిహరణరసమును కలిపి సేవించుచూ ఖదిరారిష్టమును అనుపానముగా త్రాగుచుండిన పైనవ్రాయబడిన వ్యాధుల యందు విశేషముగా పనిజేయును.

## 265. మాదీఫలరసాయనము

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ రుచ్యం రసాగ్లం దీపనం లఘు
రక్తపిత్తహరం కంర్యం జిహ్వాహృచ్ఛోధనం పరమ్.

ద్రవ్యములు:–మాదీఫలములస్వరసము, నిమ్మకాయలస్వరసము, అల్లముస్వరసము, పంచదార మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:— దీపనము, పిత్తహరము, రుచ్యము, దౌహృదిని వాంఛాహరము, గర్భిణీవికారహరము.

ప్రమాణము:—1/8 ఔన్సు మొదలు 1/2 ఔన్సు వరకు.

ఇది తియ్యగా, పుల్లగా, కారముగాయుండు ఔషధము.

ప్రయోగములు:–దీనిని ప్రత్యేకముగాగాని రెట్టింపు నీళ్ళయందు కలుపుకొనిగాని ఉదయమున సేవించిన సమస్త పైత్యవ్యాధులు, అగ్నిమాంద్యము, అరుచి, అజీర్ణము, నోటనీళ్ళూరుట, కడుపులో మంట, తలతిరుగుట, వాంతి, దద్దుర్లను హరింపజేసి నోటికి రుచిని పుట్టించును.

దీనిని పిత్తహరఔషధములకు అనుపానముగా నుపయోగించిన పైన వ్రాసిన లక్షణములయందు బాగుగా పనిజేయును.

మరియు దీనిని గర్భిణులు సేవించిన గర్భిణులకుకలుగు వేవిళ్ళు, గర్భవికారములు తగ్గును.

గర్భవతులు దీనిని సువర్ణసింధూరభూషణము, వంటసువర్ణ సూర్యావర్తి మొదలగు పిత్తహర, బలకరౌషధములకు అనుపానముగా సేవించిన గర్భవికారములను హరింపజేసి బలమును కలుగజేయును. మరియు గర్భమును రక్షించును.

## 266. శారిబాదిరసాయనము (Summer tonic వేసవి టానిక్)

(వై॥ యో॥ ర॥)

శ్లో॥ కఫాతిసార తృద్దాహ రక్తపిత్త హరాపరా
వాతనాశకరీప్రోక్తా ఋషిభిః తత్వదర్శిభిః.

ద్రవ్యములు:-పంచదార మరియు సుగంధిపాల, వట్టివేళ్ళు, చందనము, ద్రాక్ష, ఖర్జూర, అతిమధురము, శతావరి వీట్లయొక్క-సారములుగలవు.

గుణము:—పిత్తశమనము, రసాయనము, ఉష్ణశమనము, రక్త శుద్ధికరము, దాహతాపహరము.

ప్రమాణము:— 1/2 ఔ. మొదలు 1 ఔన్సువరకు.

ఇది తియ్యగావుండు రసాయనము.

ప్రయోగములు:—దీనిని రెట్టింపు నీటియందు కలుపుకొని త్రాగిన వేసవికాలమందు కలుగు తాపము, దాహము, అత్యుష్ణము, కడుపులోమంట, నేత్రములమంట, వళ్ళుప్రేలుట, కురుపులు (ఉడుకు గడ్డలు) లేచుట మొదలగు ఉష్ణాధిక్యతవలన కలుగు బాధల నన్నింటిని తగ్గించును. మరియు వడదెబ్బతగిలినవారికి మంచి పని జేయును.

దీనిని గర్భిణీస్త్రీలు సేవించినయెడల గుండెదడ, నీరసము, కాళ్లు లాగుట, బలహీనము మొదలగు గర్భవికారము లను తగ్గించి గర్భమునకు బలము కలుగజేయును.

మరియు యిది శారిబాద్యాసవముయొక్క గుణములను కూడా కలిగియుండును.

## 267. సుఖరేచనీరసాయనము

(అనుభూతము)

ద్రవ్యములు:-పంచదార, మరియు తెగడ, సునాముఖి, గులాబీ పువ్వు, రేలగుజ్జు మొదలగు ద్రవ్యములయొక్క సారములు గలవు.

గుణము:— రేచనము, దీపనము, పాచనము, పిత్తహరము.

ప్రమాణము:—1/2 ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

ఇది తియ్యగా నుండుఔషధము.

ప్రయోగము :—దీనిని రెట్టింపు నీళ్ళయందు కలుపుకొని ఉదయమునగాని రాత్రిపూట పరుండబోవునప్పుడుగాని సేవించినయెడల సుఖముగా 1, 2 విరేచనములను కలుగజేయును.

దీనిని అప్పుడప్పుడు Laxative గా వుపయోగించుకొనవచ్చును. దీనిని గర్భిణీస్త్రీలుకూడా వాడవచ్చును.

# లేపనములు

## 268. తువరకాదిలేపము (తువరక లేపము)

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:— నీరుడుగింజలపప్పు, కొబ్బరినూనె.

గుణము:— రక్తశుద్ధికరము, త్వచ్యము.

ఉపయోగము:— దీనిని ప్రత్యేకముగగాని, మజ్జిగయందు గాని కలిపి లేపనముగా నుపయోగించిన శ్విత్రము, మంగు, దురద, చిడుము, గజ్జి, తామర, పొడలు, కురుపులు మొదలగు రక్తగత, చర్మగతవ్యాధులు తగ్గగలవు.

## 269. రసోత్తమాదిలేపము

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—రసోత్తమాదిచూర్ణము, మైనము, నూనె.

గుణము:—త్వచ్యము, క్రిమిహరము, పామాహరము.

ఉపయోగము:—దీనిని కొబ్బరినూనెయందుగాని, నిమ్మకాయ రసమునందుగాని కలిపి లేపనముగా నుపయోగించిన తామర, దురద, గజ్జి, కురుపులు, మూగతీట, గజచర్మము మొదలగు చర్మవ్యాధులను, వ్రణములను హరింపజేయును.

N B. దీనిని స్వర్ణరజితాభరణములకు, నోటికి, నేత్రములకు తగలకుండా కాపాడుకొనవలెను. రసోత్తమాదిచూర్ణములోని ద్రవ్యములను చూర్ణప్రకరణమున గల "రసోత్తమాది చూర్ణము" అనుచోట వ్రాయబడినవి.

## 270. రక్తలేపము

(అనుభూతము)

ద్రవ్యములు:—నువ్వులనూనె, గంగసిందూరము, మైనము.

ఉపయోగములు:— కేవలము దీనినిగాని, దీనిని కొబ్బరినూనెలో కలిపి గాని లేపనముగా నుపయోగించిన కాలిపగుళ్ళు, కురుపులు, వ్రణములు, కాలివ్రేళ్ళమధ్యలయందు గలుగు వరిపిడి తగ్గును.

## 271. వ్రణహరలేపము

(అనుభూతము)

ద్రవ్యములు:—ఇంగిలీకము, రసకర్పూరము, వెన్నపూస.

గుణము.—వ్రణరోపణము, దగ్ధవ్రణరోపణము, క్రిమిహరము.

ఉపయోగములు:—దీనిని లేపనముగా నుపయోగించిన కాలిన వ్రణములు, ప్రమేహవ్రణములు, వ్రణములయందుకలుగు తాపము, కురుపులు, కాలిపగుళ్ళు తగ్గును.

దీనిని కాలినపుండ్లయందు తరుచుగా రాయుచుండిన మంటలను తగ్గించి పుండ్లను మాన్పునటులజేయును.

## 272. సింధూరాదిలేపము

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—గంగసింధూరము, రససింధూరము, రసకర్పూరము, మృద్దారుశృంగి, మైనము, నూనె.

గుణము:—త్వచ్యము, క్రిమిహరము, వ్రణరోపణము.

ఉపయోగములు:—దీనిని కొబ్బరినూనెయందుగాని, నిమ్మకాయరసమునందుగాని కలిపి లేపనముగా నుపయోగించిన తామర, దద్దుర్లు, గజచర్మము, దురద, గజ్జి, కురుపులు, మూగతీట మొదలగు సమస్త చర్మరోగములు, సవామేహవ్రణములు హరించును.

దీనిని ఇతరవాటియందు కలపక, కేవలము దీనినే లేపనముగా గూడ నుపయోగించ వచ్చును.

# అంజనములు

## 273. గరుడాంజనము

వై॥ చిం॥ (నేత్ర॥ రోగప్ర॥)

శ్లో॥ తిమిరపటలకాచం ధూమదృక్చాంధకారం
కుకున కుసుమక్లేదం, సిందురం నేత్రపాకం.

ద్రవ్యములు:—ఏలకగింజలు, మిరియాలు, మైలతుత్థము, పటిక, ఇంగిలీకము, మనుష్యులపుఱ్ఱెపెంకు, పచ్చకర్పూరము, చిల్లగింజలు, రసాంజనము మొదలగు ద్రవ్యములు కలవు.

గుణము:— నేత్ర్యము, తిమిరహారము, లేఖనము, పటలరోగ హారము, నేత్రపాకహారము, దృష్టికరము.

ప్రయోగములు:-(వై॥చిం॥)దీనిని ఉదయ సాయంత్రములయందు ఉదకముతో పెసరగింజంత అరగతీసి నేత్రములయందు బెట్టుచున్న యెడల తిమిరము, పొరలు, కాచము, పొగగప్పినకన్నులు, కనుపించని కన్నులు, కూనలు, కంటిపువ్వులు, కంటిపుసి, కంటిఎరుపు, నేత్రపాకములనుహరింప జేసి గరుడునితో సమానమైన దృష్టినిర్మలత్వమును కలుగజేయును.

(అ॥ భూ) దీనిని చనుపాలతో నరగతీసి అందు తేనె కలిపి నేత్రములయందు పెట్టుచుండిన దుర్మాంసములు, తిమిరములు, పటలములు, రేచీకటి, కండ్లమసకలను హరింపజేయును.

మోదుగపువ్వురసముతో చాది కనులయందు పెట్టుచుండిన కండ్లలోనిపువ్వులు, కుదపలు తగ్గును.

## 274. చంద్రోదయవర్తి

భై॥ ర॥ (నేత్ర॥ రో॥)

శ్లో॥ నాశయేత్తిమిరం కండూం పాటలాన్యర్బుదానిచ
అధికానిచ మాంసాని యచ్చరాత్రౌ నపశ్యతి
అపిద్వివార్షికం పుష్పం మాసేనైకేన నశ్యతి.

ద్రవ్యములు:—కరక్కాయబెరడు, మిరియాలు, వస, చంగల్వకోష్టు, పిప్పళ్ళు, తానికాయబెరడు, శంఖనాభి మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—లేఖనము, నేత్ర్యము, తిమిర పటలరోగహరము, సికతావర్త్మహరము (Granular conjunctivities)

ప్రయోగములు:—(భై॥ ర॥) దీనిని తేనెతోగాని, నీటితోగాని, చనుపాలతోగాని పెసరగింజంత అరగతీసి నేత్రములయందు వేయు చుండిన తిమిరము, దురద, పటలములు, అర్బుదములు, దుర్మాంసములు, రేచీకటి వీటెని హరింపజేసి నిర్మలమైన దృష్టిని కలుగజేయును.

మరియు నేత్రములయందు కలుగు పువ్వులను కూడ హరింప జేయును.

## 275. తిలపుష్పాంజనము

వై॥ చిం॥ (నేత్ర॥ రో॥ ప్ర॥)

శ్లో॥ నాశయేత్తిమిరంకండూ పటలాన్యర్బుదానిచ
అతిరక్తానిమాంసాని హ్యేకరాత్రేణనాశయేత్.

ద్రవ్యములు:—మిరియాలు, కఫరి, తిలపుష్పములు.

గుణము:— నేత్ర్యము, తిమిరహరము, లేఖనము మరియు దుర్మాంసములను హరింపజేయును.

ప్రయోగములు:—(వై॥ చిం॥) దీనిని నిత్యము ఉదయ సాయం కాలములయందు నీటితో అరగదీసి పెసరగింజంత నేత్రములయందు పెట్టు చుండిన తిమిరములు, దురదలు, కంటిపొరలు, అర్బుదము, కంటిఎరుపు, దుర్మాంసములను హరింపజేయును.

## 276. నారికేళాంజనము (మహానారికేళాంజనము)

వై॥ చిం॥ (నేత్ర॥ రో॥ ప్ర॥)

శ్లో॥ "షడధిక నవతిం నిహన్త్యాశు".

ద్రవ్యములు:—అతిమధురము, త్రిఫలములు, మానుపసుపు వీట్లసారములు మరియు కొబ్బరినీళ్ళు, పచ్చకర్పూరము తేనె, మైలతుత్థము, రసాంజనము మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—నేత్రరోపణము, నేత్రాభిష్యందము, సర్వనేత్రరోగహరము.

ప్రయోగములు:—దీనిని నిత్యము ఉదయసాయంకాలముల యందు పెసరగింజంత నేత్రములకు కాటుకవలె పెట్టుచుండిన దురదలు, వేడివలన కలుగుమంటలు, నీరుకారుట, ఎరుపులు, పోట్లు, తిమిరములు, వర్త్మరోగములు, దుర్మాంసములు, నేత్రములయందుండు వ్రణములు, పువ్వులు మొదలైన సమస్త నేత్రరోగములు హరించును.

## 277. సిద్ధనాగార్జునవర్తి (నాగార్జునాంజనము)

శా॥ ర॥ (నేత్ర॥ రో॥ కా॥)

శ్లో॥ నాశనీతిమిరాణాంచ పటలానాంవిశేషతః

సద్యః ప్రకోపం స్తన్యేన స్త్రియా విజయతే ధ్రువమ్.

ద్రవ్యములు:—త్రిఫలములు, త్రికటుకములు, సైంధవలవణము, మైలతుత్థము, రసాంజనము, తామ్రభస్మము మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—వర్త్మలేఖనము, రోపణము, నేత్రబలకరము, నేత్ర సద్యః ప్రకోపరోగహరము, తిమిరరోగహరము.

ప్రమాణము:—పెసరగింజంత.

ప్రయోగములు:—(శా॥ ర॥) దీనిని చనుపాలతో అరగదీసి నేత్రములయందు వేసుకొనినయెడల కండ్ల ఎరుపులు, కండు నీరుకారుట, మంటలు మొదలగు అప్పుడుకప్పుడు కలుగుబాధలు హరించును.

మోదుగపువ్వు రసముతో అరగదీసి వేసుకొనినయెడల పైల్యము, పువ్వులు, కుదపలు, హరించును.

లొద్దుగచెక్క స్వరసముతో అరగతీసి వేసుకొనినయెడల ఆసన్న (రాబోవు) తిమిరరోగములను హరింపజేయును.

మేకపోతుయొక్క మూత్రముతో అరగతీసి వేసుకొనుచుండిన తిమిరములు, పటలములు మొదలగు నేత్రరోగములవలన చిరకాలము నుండి మూతలు పడియున్న నేత్రములను తెఱచునట్లు జేయును.

N B. ఈ యోగము సిద్ధనాగార్జును డనబడు వైద్యశేఖరునిచే కనిపెట్టబడి పాటలీపుత్ర (పాట్నా) నగరమందలి యొక స్తంభముపై చెక్కబడెను. ఇది యిప్పటి కిని గలదని చెప్పెదరు.

# పరిశిష్టములు

## 278. అమరప్రభ

(అనుభూతము)

ద్రవ్యములు:—హారతికర్పూరము, పిప్పరమెంటుపువ్వు మొదలగు ద్రవ్యములు గలవు.

గుణము:—గ్రాహి, అజీర్ణహరము, శూల, క్రిమి, శ్వాసకాస, దంతరోగ, పీనస, హృద్రోగహరము, విషహరము, ఔపసర్గికరోగహరము.

ప్రమాణము:— 5 మొదలు 10 చుక్కలవరకు.

ప్రయోగములు:—దీనిని వాములరసమునందుగాని, తమలపాకుల యందుగాని, నీళ్ళయందుగాని, వేసుకొని సేవించిన అజీర్ణవిరేచనములు, ఉదరశూలలు, హృదయశూలలు, అజీర్ణము, కడుపుబ్బరము, దగ్గు, ఆయాసము మొదలగు అజీర్ణశ్లేష్మవ్యాధులను హరింపజేయును.

దీనిని పంచదారయందుగాని నీళ్ళయందుగాని వేసుకొని సేవించిన ఎక్కిళ్లు, వాంతులు, హృద్రోగములు హరించును.

దాచినచెక్క, గసగసాలరసమునందు వేసుకొని సేవించిన అన్నివిధములైన గ్రహణీవ్యాధులు హరించును.

వెన్నపూసయందు వేసుకొని సేవించిన పరిణామశూలలు, అన్నద్రవశూలలు, అజీర్ణము, కడుపుబ్బరము హరించును.

దీనిని బ్రాందిలో కలిపి సేవించిన విషూచి (కలరా), విరేచనములు, వాంతులు, నీరసము, కాళ్లు చేతులు కొంకర్లుపోవుటను హరింపజేయును.

దీనిని లేపనముగా నుపయోగించిన తలనొప్పి, పడిశము, అంటువ్యాధులు, దగ్గు, ఆయాసము, కీళ్ళనొప్పులు, కొండనాలుక,(ఉపజిహ్వ) విషజంతువుల కాట్లవలన కలిగెడి బాధలు, పీనసవ్యాధులు, హరించును. మరియు అంటువ్యాధులను రాకుండా కాపాడును.

దూదిపింజను దీనితో తడిపి పిప్పిపన్నుగల తొఱ్ఱలో పెట్టిన పిప్పి పండ్లవలన కలుగుబాధలు, దంతములకు రాయుచుండిన చిగుర్లుబ్బుట, పండ్లతీపు, పండ్లనుండి క్రిములు, చీము పడుచుండుట మొదలగు దంత బాధలను హరింపజేయును.

దీనికి సమము కొబ్బరినూనెను కలిపి చెవులయందు పోసిన యెడల చెవిలో చీముకారుట, పోటు, వాపు, చెముడు మొదలగు కర్ణబాధలను హరింపజేయును.

## 279. కస్తూరి (Musk)

ఇది కస్తూరిమృగమునకు నాభివద్దగల తిత్తిలోయుండుద్రవ్యము.

గుణము:—కఫవాతహరము, హృద్యము, శీతహరము, సన్నిపాతజ్వరహరము, పుష్టికరము, క్రిమిహరము, యోగవాహి.

ప్రమాణము:— 1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—దీనిని తమలపాకులయందుంచి నమలిమ్రింగినను, లేక తమలపాకురసముతో సేవించిననూ వాతరోగములు, కఫరోగములు, సూతికావాతములు, వాతకఫోల్బణసన్నిపాతములు, పడిశము, జ్వరములను హరింపజేయును.

మరియు పైవ్యాధులయందు కలుగు కరపాదశీతలమును, ధాతువు (నాడి) క్షీణించుటను తగ్గించి హృదయమునకు బలమును, శరీరమునకు ఉష్ణమును కలుగజేయును.

మరియు దీనిని అవసరమునుబట్టి పై వ్యాధులయందు యితరౌషధములతో కలిపి వాడుటగూడ ఆచారముగలదు. కనుక వాడవచ్చును.

ఇట్లు వాడుటవలన కస్తూరి తన సహజశక్తిని కలుగజేయుటయే గాక దీనితో కలిపిన యితరౌషధములయొక్క గుణములను గూడా త్వరగా శరీరమునకు కలుగునట్లు జేయును.

## 280. కర్ణామృతము

(అనుభూతము)

గుణము:—కర్ణరోగహరము.

ఉపయోగము:—చెవులను శుభ్రపరచిన పిమ్మట, దీనిని 5, 6 చుక్కలు చెవులలో పోయుచుండిన ఉష్ణాధిక్యతవలన కలుగు చెవిపోటు, చెవులలో హోరుమని కలుగు శబ్దము, దురద హరించును. మరియు చీముకారుట, దుర్గంధములను గూడా పోగొట్టును.

## 281. కుంకుమపువ్వు (Saffron)

ఇది కాశ్మీర దేశమునందును, హీరా దేశమునందును జనించు సుగంధ ద్రవ్యము.

గుణము:—వాతకఫరోగహరము, బల్యము, పుష్టికరము, సంతోషకరము, విషహరము, ఊర్ధ్వజత్రుగత రోగహరము, త్వచ్యము, హృద్యము, నిద్రాకరము, యోగవాహి.

ప్రమాణము:—1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—దీనిని తమలపాకులయందుంచి సేవించిన యెడల వాతరోగములు, కఫరోగములు, విషదోషములు, పురాణ జ్వరములు, మూర్ఛ, అపస్మారము, ఊర్ధ్వజత్రుగత రోగములు, దురదలు, మచ్చలు, వ్రణములు, పొక్కులు, నీరసము మొదలగు రోగములను హరింపజేయును.

పంచదార కలిపిన వెన్నపూసతో సేవించిన వీర్యవృద్ధిని, ధాతుపుష్టిని, దేహకాంతిని, బుద్ధిబలమును, నిద్రను కలుగజేయును.

(చ॥ చి॥) దీనిని ద్రాక్షరసముతో కలిపి త్రాగిన సర్వమూత్రకృచ్ఛ్రములు, అశ్మరులు శమించును.

(చక్రదత్త) దీనిని పంచదారలో కలిపి ఆవునేతితో మర్దించి రసమును పిండినపిమ్మట, ఆ రసమును నస్యముచేసిన యెడల కనుబొమ్మల మధ్యను, కణతలు, నేత్రములు, చెవులయందును కలుగు శూలలు, సూర్యావర్తకమను శూలయు హరించును.

(అ. భూ.) దీనిని అవసరమును బట్టి పైన వివరించిన లక్షణ ములకుపయోగించు యితరౌషధములయందు కలిపి వాడుటాచారము గలదు కనుక వాడుకొనవచ్చును.

దీనిని వసంతకుసుమాకరము, సిద్ధమకరధ్వజము, రజిత చంద్రో దయము మొదలగు బృంహణ, శుక్రవృద్ధికరౌషధములకు అనుపానముగా చేర్చి సేవించిన ఔషధముయొక్క గుణములను త్వరగా శరీరమునకు వ్యాపింప జేయును.

## 282. గోరోజనము: (Bılary Calculus of Cow or Ox)

ఇది ఆవు లేక ఎద్దుయొక్క పిత్తకోశమందలి రసము లేక చేదు.

గుణము:—వాతకఫహరము, క్రిమిహరము, అజీర్ణహరము, వృష్యము, విషహరము, హృద్యము.

ప్రమాణము:— 1/2 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—(వ॥ గు॥ దీ.) దీనిని తమలపాకులయందుంచి సేవించిన, శైత్యతాపము, పైత్యమూర్ఛ, క్రిమి, వాతకఫజ్వరములు, కఫపైత్యము, అజీర్ణము, అగ్నిమాంద్యము, విషదోషములను హరింప జేయును.

దీనిని చనుపాలలోగాని, లేక జీలకఱ్ఱ తేలికకషాయములోగాని అరగతీసి బిడ్డలకు పోసిన అజీర్ణము, జ్వరములు తగ్గును.

(వ॥ గు॥ ప్ర॥) దీనిని పసుపును తెల్లగరికెరసముతోగాని జామ చెక్క రసముతోగాని కలిపి పాము కరచినచోట, తేలుకుట్టినచోట రాసి గుడ్డపాగ వేసినయెడల విషవికారములు తగ్గును.

మిరియాలు, జీలకఱ్ఱ కలిపి రసము తీసి ఆ రసముతో దీనిని లోనికిచ్చిన మరిడీ (కలరా) జాడ్యము తగ్గును.

(వ॥ గు॥ దీ॥) దీనిని నేతిలోవేసి కాచి ఆ నేతిని నస్యము జేసిన తలనొప్పులు, పార్శ్వపునొప్పులు హరించును.

నేతిలోగాని, వెన్నలోగాని దీనిని కలిపినూరి దానితో మర్దన జేసినయెడల పట్లుతప్పిన కాళ్ళనరములకు బలముకలుగజేసి నడుచు శక్తిని కలుగజేయును.

దీనిని వాతకఫహరౌషధములయందు జేర్చి ఆయూరోగముల యందు వాడుకొనవచ్చును.

## 283. జున్ను (Gall of Cro-codile)

ఇది మొసలియొక్క పిత్తకోశమ (చేదుకట్టు)ను ద్రవ్యము.

గుణము:—ఉష్ణవీర్యము, పిత్తకరము, వాతహారము, సూతికా వాతహారము, జ్వరహారము, గర్భిణీవాతహారము.

ప్రమాణము:— 1/2 మొదలు 1 గురిగింజ ఎత్తువరకు.

ఉపయోగములు:—(వ॥ గు॥ ప్ర॥) దీనిని సర్వసాధారణముగా వాడకూడదు. దీనిలోగూడ నొకవిధమైన విషపదార్థము గలదు.

దీనిని ఔషధయోగములలోగాని, యితర ద్రవ్యములతోగాని కలిపి సేవించిన చెడుగు జేయదు.

ప్రత్యేకముగా నుపయోగించునప్పుడు మాత్రము జాగ్రత్తగా వాడవలెను.

దీనిని గర్భిణీ స్త్రీలకు కలుగు నొప్పులకు వాడుదురు. అట్లు వాడి నందువలన కొంత చెడుకలుగజేయును. యిది అమితమైన పిత్తప్రకోప మును జేయును. కనుక గర్భమునకు తేజము కలిగి కొన్ని బాధలు కలుగ వచ్చును.

(వ॥ గు॥ దీ.) దీనిని శొంఠి, పిప్పలి, మిరియములతో నూరి మాత్రలుగా చేసి వాటినిగాని, తాంబూలమునందుంచిగాని సేవించిన

గర్భిణీస్త్రీలవాతము, జ్వరము, కడుపునొప్పి, నడుమునొప్పి. ఆకస్మికముగా పడినందున కలుగు నొప్పులు హరించును. మరియు సూతికారోగములు, సూతికావాతములు గూడ తగ్గును.

(వ॥ గు॥ ప్ర॥) ప్రసవించిన స్త్రీలు వెంటనే దీనిని తమలపాకుల యందుంచి సేవించిన యెడల ప్రసవాయాసము, బాధలు, సూతికా వాతములు హరించును.

దీనిని వాతహరఔషధములయందు కలుపుకొని నుపయోగించిన వాతరోగములయందు బాగుగా పనిజేయును.

## 284. నేత్రబిందు

(వై॥ యో॥ ర॥)

ద్రవ్యములు:—జింకు సల్ఫేట్, బోరిక్ పౌడరు, వీటి సారములు గలవు. మరియు కాచిననీరు.

గుణము:—నేత్రరోపణము, వర్త్మలేఖనము, రక్తనేత్రహరము.

ఉపయోగము:—దీనిని బిందుకూపీ (Drop Bottle)యందుంచి యుపయోగించవలెను.

దీనిని 4, 5 చుక్కలు చొప్పున ఉదయ సాయంత్రములయందు నేత్రములయందు వేయుచుండిన కండ్లు మంటలు, ఎరుపులు, పుసులు కట్టుట, నీరుకారుట, కండ్లకలకలు హరించును.

నేత్రములయందు దుమ్ము మొదలగునవి పడియున్నచో వెంటనే దీనిని కండ్లయందు వేసిన కంటిని శుభ్రముగా కడిగి యా పదార్థమును బయటికి వెడలగొట్టును.

ఇతర కలికములేవైన వేయుటచే కన్ను లెట్టబాటి బాధపెట్టు నప్పుడు దీనినుపయోగించిన ఆమెఱుపంతయు తగ్గి బాధ నివృత్తియగును.

దుమ్ము మొదలైనవి పడిగాని మరి యేయితర కారణములవల్లగాని కన్నులు వాచియున్నప్పుడు దీనినుపయోగించిన వాపులు తగ్గును.

దీనిని ఉదయసాయంత్రములయందు నేత్రములలో 4, 5 బిందువులు చొప్పున వేసి ఒకనిమిషముంచి వంచివేయవలెను. తరువాత దూదిని మంచినీటిలో తడిపి నీరును పిండివేసి యాదూదితో నేత్రములను తుడుచుకొనవలెను.

## 285. పచ్చకర్పూరము (Refined sort of camphor)

ఇది హారతికర్పూరమునుండి తయారుజేయు ద్రవ్యము.

గుణము:—శీతవీర్యము, లఘుగుణము, నేత్ర్యము, క్రిమిహరము, పిత్తహరము, శుక్రవృద్ధికరము, యోగవాహి.

ప్రమాణము:— 1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—(వ॥ గు॥ దీ.) దీనిని మంచిగంధమునందు కలుపుకొనిగాని, వెన్నపూసయందు కలుపుకొనిగాని, తమలపాకులయందుంచిగాని సేవించిన ఉష్ణాధిక్యత, భ్రమ, చెమట, పైత్యవికారము, రక్తపిత్తము, క్రిమిరోగములు, నేత్రరోగములు, దాహము, తాపము, శుక్రనష్టము, మూత్రవ్యాధులను హరింపజేయును. మరియు విరేచనము జేయును. వీర్యపుష్టిని, బుద్ధిబలమును, దేహపుష్టిని, వడిశమును కలుగజేయును.

దీనిని రతికాలమునందును, ఎండదెబ్బతగిలినప్పుడు, క్షుత్పిపాసలధికముగా కలిగినప్పుడు, తాపమునందును దీనిని సేవించుట చాలా మంచిది.

దీనిని యితరౌషధములయందనుపానముగా చేర్చి సేవించిన ఔషధముయొక్క శీతోష్ణములను శరీరమునకు కలుగజేయుట సౌమ్య

ముగా నడుచునట్లు జేయును. మరియు ఔషధముయొక్క గుణమును శరీరమునకు తొందరగా వ్యాపించునట్లు జేయును.

దీనిని బృంహణ, వీర్యవృద్ధిక రౌషధములయందును, నేత్రరోగ హరౌషధములయందును కలుపుకొని వుపయోగించుకొనిన బాగుగా పనిజేయును.

## 286. పావుదారు (Camel's gall)

ఇది ఒంటెయను జంతువుయొక్క శరీరములోయుండు చేదు (పిత్తకోశము) యనెడి ద్రవ్యము.

గుణము:—పిత్తకరము, శీతహరము, వాతకఫహరము, సన్నిపాత జ్వరహరము.

ప్రమాణము:— 1 మొదలు 2 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—దీనిని తమలపాకులు లేక తులసియాకు రసమునందు కలిపి సేవించిన సమస్త వాతరోగములు, కఫరోగములు, సూతికావాతములు, సన్నిపాత జ్వరములు హరించును.

మరియు వాతరోగములయందును, సన్నిపాతజ్వరములయందును మరియు యితరరోగములయందును కలుగు కరపాద శీతలమును హరింప జేసి శరీరమునకు ఎక్కువ ఉష్ణమును కలుగజేయును. పైత్యమును వృద్ధిజేయును.

దీనిని వాతకఫహరౌషధములయందు కలిపి నుపయోగించిన వాతకఫరోగములయందును, వాతకఫోల్బణ యితరరోగములయందును బాగుగా పనిజేయును.

## 287. భావనకరక్కాయ

ఆం॥ వై॥ ర॥ (కృష్ణపండితీయం) పరిశిష్ట॥ ప్ర॥

శ్లో॥ ఖాదయే దభయామేకాం సర్వాజీర్ణవినాశనమ్
చతుర్విధ మజీర్ణంచ వహ్నిమాన్ద్యం విషూచికామ్.

ద్రవ్యములు:— కరక్కాయ బెరళ్లు, పంచలవణములు, త్రికటుకములు, వాము, నిమ్మకాయరసము, అల్లపురసము మొదలగునవి గలవు.

గుణము:—దీపనము, పాచనము, మృదు రేచనము, పిత్తహరము.

ప్రమాణము:— 1/4 తు. మొదలు 1 తులమువరకు.

ఉపయోగములు:—దీనిని ఉదయ సాయంకాలములయందు నోటిలో వేసుకొని చప్పరించుచుండిన అజీర్ణము, అరుచి, అగ్నిమాంద్యము (ఆకలి లేకపోవుట), కడుపుబ్బరములను, నోట నీరూరుట, వాంతి, తలతిరుగుట మొదలగు పైత్యవికారములను నివర్తింపజేసి మృదువిరేచనమును కలుగజేయును.

## 288. రోయ్యిపీత (Gall of fish)

ఇది సముద్రములోనుండు, యొకవిధమగు చేపయొక్క పిత్తకోశ (చేదుకట్టు)మను ద్రవ్యము.

గుణము:—కఫవాతహరము, శీతహరము, రేచనము, సూతికావాతహరము, సన్నిపాతహరము, పిత్తకరము.

ప్రమాణము:— 1 మొదలు 4 గురిగింజల ఎత్తువరకు.

ఉపయోగములు:—దీనిని తమలపాకులయందుంచి సేవించిన కఫవాతరోగములు, పడిశము, సన్నిపాత జ్వరములు, సూతికావాతములు, సన్నిపాతజ్వరములయందుగాని యితర రోగములయందుగాని కలుగు కరపాదశీతలములు హరించును. శరీరమునకు మంచివేడిని కలుగజేయును. విరేచనమును కలుగజేయును. పైత్యమును వృద్ధిజేయును.

దీనిని వాతకఫహరౌషధములయందు కలుపుకొని నుపయోగించిన వాతకఫోల్బణ రోగములయందు బాగుగా పనిజేయును.

## 289. తేనె

గుణము:—స్వాదు కషాయరసములు గలది, శీతవీర్యము, లఘురూక్షగుణములుగలది, పిత్తశ్లేష్మహరము, వ్రణరోపణము, క్రిమిహరము, నేత్ర్యము.

ప్రమాణము:— 1 తు. మొదలు 4 తులముల వరకు.

ఉపయోగములు:—దీనిని సేవించిన రుచిగాయుండును. మరియు పైత్యము, సన్నిపాతములు, కడుపునొప్పి, ఎక్కిళ్ళు, వాంతులు, మూర్ఛ, క్రిమిరోగములు, విషదోషములు, దాహము, రక్తపిత్తము, ఊపిరిగుట్టు నొప్పి, వాతము, శ్లేష్మము, దగ్గు, ఆయాసము, ప్రమేహము, అతిసారము, పక్షవాతము, మూత్రరోగములను, నేత్రరోగములను, వ్రణములను హరింపజేయును.

దీనిని కొద్దిగాసేవించిన విరేచనము బంధించును. అధికముగా సేవించిన విరేచనము జేయును.

దీనికి 4 రెట్లు నీళ్ళుకలిపి సేవించిన దాహము తగ్గును. యిట్లు వేసవికాలమందు సేవించిన మిక్కిలి సౌఖ్యముగా యుండును.

దీనిలో రెట్టింపు నీళ్ళుకలిపిత్రాగిన తాంబూలచర్వణమందు కలుగు తిక్క, నొప్పులుతగ్గును.

దీనిలో అడ్డసరపాకులరసము కలిపి సేవించిన దగ్గులును, మామిడి చిగుళ్ళరసము కలిపి సేవించిన ఉష్ణమువలన కలుగు దగ్గులు, వాంతులు తగ్గును.

నెమలి యీకలు కాల్చినమసినిగాని, పట్టుగుడ్డలు కాల్చిన మసినిగాని దీనితో కలిపి సేవించిన వాంతులు తగ్గును.

ప్రాతఃకాలమున తేనెకు 4 రెట్లు నీళ్ళుకలిపి సేవించిన ఊబశరీరము (స్థౌల్యము) తగ్గును.

దీనిలో నిమ్మకాయరసము కలిపి సేవించిన పైత్యోద్రేకము, అరుచి తగ్గును.

దీనిని నిత్యము నేత్రములయందు వేసుకొనుచుండిన యెడల నేత్రరోగములు హరించును.

దీనిని కురుపులకు, వ్రణములకు, అభిఘాతవ్రణములకు పైన రాయుచుండిన వ్రణములను శోధించి మానునటుల జేయును.

తేనెకు త్రిదోషహరకత్వము:—లఘుగుణము కలదగుట వలన కఫమును, పిచ్ఛిలమాధుర్యగుణములు కలదగుటవలన వాతపైత్యములను శమింపజేయును. మరియు కషాయరసము కలదగుటవలన పిత్తమును కూడా శమింపజేయును.

తేనెయొక్క విరుద్ధయోగములు:— తేనె నెయ్యిగాని, తేనె నూనెగాని, తేనె నీళ్ళుగాని సమానభాగములుగా కలిపిన విరుద్ధమగును.

వేడి తత్వముగలవారుగాని, వేడిగా యుండునప్పుడుగాని, వేడివస్తువులతో కలిపిగాని వుపయోగించకూడదు. ఉపయోగించిన విరుద్ధమగును.

కాని విరేచనౌషధములు సేవించునప్పుడు మాత్రము వేడిగా యుండు యితరపదార్థములతో జేర్చి సేవించిననూ విరుద్ధము జేయదు. కారణమేమనగా అది జీర్ణముకాకుండగనే విరేచనౌషధములతో బయటికి పోవును. కనుక విరుద్ధము జేయదు.

## పథ్యాపథ్యవిధిః

ఔషధసేవ చేయుచూ పథ్యము నాచరించుచుండిన యెడల శీఘ్రముగా రోగములు నివర్తించి ఆరోగ్యము చేకూరును.

ఎట్లనగా—

శ్లో॥ "వినాపి భేషజై ర్వ్యాధిః పథ్యాదేవ విలీయతే
నతు పథ్యవిహీనస్య భేషజానాం శతైరపి".

తా॥ ఒకొక్కరోగము ఔషధసేవనము చేయకపోయిననూ రోగానుగుణ్యమగు పథ్యాచారముచేతనే శమించుటయుగలదు. కాని పథ్యాచరణము లేక నూరౌషధములను సేవించిననూ రోగనివృత్తి కానేరదు.

కనుక పై ఋషివాక్యముల ననుసరించి రోగము కలిగినప్పుడు ప్రతి మనుజుడు జఠరాగ్ని బలము ననుసరించి పథ్యము నాచరించుట వలన ఆరోగ్యము కలుగునట్లు శాస్త్రము చెప్పుచున్నది. అందువలన వ్యాధివలన బాధపడువారు ఔషధసేవచేయుచూ పథ్యము నాచరించకున్నయెడల వ్యాధులు నివర్తించవు. పథ్యము వర్జించి నూరుఔషధములు సేవించిననూ రోగములు శమింపవు. అందువలన ప్రతిమనుజుడు (రోగి) ఔషధము సేవించుచూ ప్రకృతి కనుగుణ్యములకు పథ్యములను నాచరించుటవలన త్వరలో స్వాస్థ్యమును పొందుటకు సందేహమెంత మాత్రముయుండదు. కనుక రోగులు పథ్యములను తప్పక నాచరించవలెను.

## లంఘన క్రమము

వాతాది దోషములు ఆమయుక్తములై ఆమాశయమందుండి జఠరాగ్నిని బహిర్గతమొనర్చి స్రోతోమార్గముల నడ్డగించి జ్వరమును కలుగజేయును. అప్పుడు లంఘనము చేయవలెను.

దోషములల్పములుగ యున్నయెడల లంఘనము, దోషములు మధ్యమావస్థను బొందినయెడల లంఘనపాచనక్రియలు, దోషములు

హెచ్చుగా యున్నయెడల మలములను మూలమునుండి వెడలగొట్టు శోధన చికిత్సయు చేయవలెను.

వాతము ఏడుదినములలోను, పిత్తము పదిదినములలోను, శ్లేష్మము పన్నెండుదినములలోను పక్వముజెందును. లంఘనాదులవలన పక్వము కాగా మిగిలిన స్వల్పదోషములు పాచనమగుటకై దోషహార ద్రవ్యములతో తయారుచేసిన యవాగు (జావ)ను యిప్పించవలెను.

లంఘనము జేసినవానికి పంచకోలములు (పిప్పళ్ళు, పిప్పలికట్టె, చవ్యము, చిత్రమూలము, శొంఠి) వీనితో తయారైన యవాగును త్రాగించవలెను. లంఘనమెక్కువగా జేయించిన వానికి తర్పణము (అనగా పుష్టికర ఆహారములు) చేయించవలెను.

## చక్కగా లంఘనము జరిగినప్పుడు కలుగు ఫలితములు

వాతము, మూత్రములు చక్కగా వెలువడుట, మనస్సు ఇంద్రియములు నిర్మలముగా వుండుట, చమటపట్టుట, ముఖమున కాంతి కలుగుట, ఆకలి దప్పికలు కలిగి శరీరము లాఘవమును చెందుట యివి చక్కగా లంఘనము పూర్తి చేసినవానికి కలుగు లక్షణములు.

## జ్వరపథ్యములు

ప్రాతబియ్యపు అన్నము, గోధుమపిండితోగాని ప్రాతబియ్యపు పిండితోగాని చేసిన రొట్టెలు, ప్రాతవడ్లు వేయించిన పేలాలు, కాచి చల్లార్చిన నీళ్ళు, మేకపాలు, పెసలు, చిరుశనగలు, శనగలు, ఉలవలు, అలచందలు, బార్లీగింజలు వీట్ల యూషములు, వంకాయలు, వరగోగు, దోసకాయ, పొట్లకాయ, కాకరకాయ, వీనిని నెయ్యి మొదలగు స్నేహ పదార్థములను జేర్చకుండ పక్వముజేసిన కాయకూరలు, చిట్టి కూర, చక్రవర్తికూర, లేతముల్లంగి, పర్పాటకము, పొట్లఆకు, తిక్త శాకము, (ఉలిమిరిఆకు) తిప్పతీగె, కరివేపాకు, వేపపువ్వు, మనుబాల, పులిచింత, చుక్కకూర మొదలగు ఆకుకూరలు, తిత్తిరిపిట్ట, కౌజు, లేడి, కుందేలు, శరభము, అన్నివిధములైన జింకలు, వీనియొక్క మాంసరస

ములు, ద్రాక్ష, దానిమ్మ, నారింజ, బత్తాయి మొదలగు పక్వములగు ఫలములు సేవించుట పథ్యకరము.

## జీర్ణజ్వర పథ్యములు

విరేచనము, వమనము, అంజనము, నస్యము, ధూమపానము, అనువాసనవస్తి, సిరావ్యధనము, శమనౌషధము, అభ్యంగనము, స్నానము, శైత్యోపచారము, లేడి, పిచ్చుక, దుప్పి, నెమలి, లావకపిట్ట, కుందేలు, తీతువుపిట్ట, కోడి, క్రౌంచపక్షి, జింక, దుప్పి, చకోరపక్షి, కౌజు, వర్తకపక్షి మొదలగు వానిమాంసములు, ఆవునెయ్యి, మేకపాలు, మేకనెయ్యి, కరక్కాయలు, ఊటనీరు, ఆముదము, శ్రీగంధలేపనము, వెన్నెల, స్త్రీఆలింగనము యివి సమయోచితముగ జీర్ణజ్వరితులకు హితకరములు.

## విషమజ్వర పథ్యములు

విష్ణుసహస్రనామ స్తోత్రపారాయణము, వేదశ్రవణము, దేవబ్రాహ్మణ, గురుపూజనము, బ్రహ్మచర్యము, తపో, హోమ, దాన, నియమ, జప, సత్పురుష సందర్శనము, రత్నములను ధరించుట, ఔషధములను సేవించుట, ఓషధులను ధరించుట మొదలగునవి మరియు జ్వరమునకు వ్రాయబడినవి పథ్యకరములు.

## ఆగంతుకజ్వర పథ్యములు

ఆగంతుక జ్వరమునందు లంఘనము చేయకూడదు. అభిఘాత జ్వరమునందు నెయ్యిత్రాగుట, అభ్యంగనము, రక్తమోక్షణము, మద్యపానము, మాంసయుక్తమగు భోజనము చేయవలెను. క్షతజ్వరము వ్రణజ్వరములయందు క్షత, వ్రణములకు జేయదగు చికిత్సలను జేయవలయును. క్రోధజ్వరమునందు పిత్తహర చికిత్సలజేసి మంచిమాటలు జెప్పవలయును. ఔషధిజ్వరము, గంధజజ్వరము వీటియందు పిత్తశాంతి చికిత్సలను జేయవలయును. అభిచారము, అభిశాపము, వీటివలన బుట్టిన జ్వరమునందు జపము, హోమము మొదలగు క్రియలను జేయవలయును.

ఉత్పాతము, గ్రహపీడ పీటివలన కలిగిన జ్వరములకు దానము, పుణ్యా హవాచనము మొదలగు క్రియలను జేయవలెను. కామము, శోకము, భయము వీట్లవలన కలిగిన జ్వరములయందు వాతనాశనకరములగు సర్వక్రియలు జేయుచు యూరడించుట, హర్షదాయక పదార్థములు సేవించుట మరియు కామము, క్రోధము వీనిని కలుగజేయుచుండవల యును. భూతాభిషంగజ్వరమునందు వానిదేహమునందు ఆవేశము, తాడనము మొదలగు చికిత్సల జేయవలెను. మార్గాయాసమువలన కలిగిన జ్వరమునందు అభ్యంగనము, దివానిద్ర వీనిని జేయవలెను. మనశ్చింతచే కలిగిన జ్వరమునందు మనస్సును శాంతిపరచునట్టి చికిత్స లను జేయవలయును. ఈ విధముగా ఆగంతుక జ్వరములందు ఆవశ్యక ములగు చికిత్సావిధానములే పథ్యములుగ నుండును. గనుక ఆవశ్యక మగు చికిత్సల జేయుచూ రోగికి సరిపడునట్టి ఆహారములు యిచ్చు చుండవలెను.

## తరుణజ్వర పథ్యములు

వమనము, లంఘనము, యవాగు, స్వేదనము, కటుతిక్తరస ములు, మరియు జ్వరమునకు వ్రాయబడిన పథ్యములు యివియన్నియు తరుణజ్వరుతులకు పథ్యములు.

## తరుణజ్వరములకు అపథ్యములు

స్నానము, విరేచనము, మైథునము, కషాయము, సంచరించుట, అభ్యంగనము, పగటినిద్ర, పాలు, నెయ్యి, పప్పు, మాంసము, మజ్జిగ, మద్యము, తియ్యని పదార్థములు, గురుపదార్థములు, ద్రవపదార్థ ములు, అన్నము, విశేషమైన గాలిలో తిరుగుట, క్రోధము వీనిని తరుణ జ్వరితులు వర్జింపవలెను.

## సర్వజ్వరములకు అపథ్యములు

వమనము, పుల్లతో దంతధావనము జేయుట, విరుద్ధములగు పదా ర్థములు భక్షించుట, మిగులదాహమును కలుగజేయు గురుపదార్థము

లను సేవించుట, దుష్టమైన ఉదకపానము, క్షారములు, పులుసు, ఆకు కూరలు, మొలకల్లు, వాచినీళ్ళు, తాంబూలము, పనసకాయ, చలి పదార్థములు, మత్స్యములు, గానుగపిండి, కొత్తధాన్యములు, పిండి వంటలు, దుంపకూరలు భుజించుట, శ్రమకరమగు పనిచేయుట, స్త్రీసంగ మము, స్నానము, పుష్పములు, శ్రీగంధము ధరించుట, చంద్రునవలో కించుట, ఎఱ్ఱని వస్త్రములు ధరించుట, నెయ్యి, బెల్లము, నూనె పరిమళ ద్రవ్యభోజనము, దూదిపరుపు, నూతనవస్త్రము, స్త్రీలను స్పర్శించుట, చూచుట మొదలగునవి అపథ్యకరములు. మరియు స్త్రీసంగమము, వ్యాయామము, క్రీడ మొదలగునవి జ్వరవిముక్తుడై ననూ దృఢమైన శక్తికలుగునంతవరకు విసర్జింపవలయును.

## గ్రహణ్యతిసారములయందు పథ్యము

లంఘనము, వమనము, నిదురబోవుట, ప్రాతబియ్యపుగంజి, వరిపేలాలు, పేలాలుజావ, చిరుసెనగలు, కంది పీట్లకట్టు, కుందేలు, జింక, లేడి, కౌజు, వీనిమాంసరసములు, సన్న జాతిగల మత్స్యములు, తైలము, మేక ఆవు ఈ జంతువులయొక్క నెయ్యి, పాలు, పెరుగు, మజ్జిగ, వెన్నతీసిన మజ్జిగ, అరటిపువ్వు, లేతఅరటికాయ, తేనె, నేరేడు పండు, మారేడుపండు, అల్లము, శొంఠి, తామరగడ్డలు, రేగుపండ్లు, వెలగకాయ, పొగడపండ్లు, తుమికిపండ్లు, దానిమ్మపండు, బూరుగ, పులి చింతాకు, గంజాయిఆకు, మంజిష్ట, జాజికాయ, నల్లమందు, జీలకఱ్ఱ, కొడిశపాల, ధనియాలు, వగరు పదార్థములు, అగ్నిదీప్తిని కలిగించు పదార్థములు, లఘువుగనుండు పదార్థములు, నాభికి రెండుఅంగుళముల క్రిందను వెన్నెముకకు మొదటను అర్ధచంద్రాకారముగ రక్షలను వేయుట మొదలగునవి గ్రహణ్యాతిసారములయందు పథ్యకరములు.

## గ్రహణ్యతిసారములయందపథ్యములు

స్వేదనము, అంజనము, రక్తమోక్షణము, స్నానము, సంభో గము, జాగరణము, అధికజలపానము, ధూమపానము, నస్యము,

అభ్యంగనము, మలమూత్రాది వేగముల నడ్డగించుట, విరుద్ధాన్నపాన ములు, గోధుములు, మినుములు, యవలు, చక్రవర్తికూర, మునగ కాయ, మామిడికాయ, గుమ్మడికాయ, సొరకాయ, గురుత్వముచేయు అన్నపానములు, తాంబూలము, చెరుకు, బెల్లము, మద్యము, బచ్చలి కూర, ద్రాక్షపండ్లు, తెల్లగడ్డలు (వెల్లుల్లి), ఉసిరికపండ్లు, చెడ్డనీరు, కొబ్బరికాయ, స్నేహకర్మ, కస్తూరి, ఆకుకూరలు, పాలు, సరగుణము గల (అనగా కొంచెము విరేచనము జేయు) ద్రవ్యములు, గలిజేరుఆకు, దోసకాయ, ఉప్పు, పులుసు, కోపము, నీటిలో మునుగుట, స్నిగ్ధపదార్థ ములను భుజించుట, వ్యాయామము, నిప్పుసెగనుండుట, ఆమమును వృద్ధిజేయు పదార్థములు మొదలగునవి గ్రహణ్యాతిసారముల యందప థ్యములు.

## అర్శోరోగములందు పథ్యములు

ఉలవలు, యవలు, గోధుమలు, ఎఱ్ఱవడ్లు, గలిజేరు, కందగడ్డ, మజ్జిగ, ఉసిరికాయలు, వెలగపండు, వెన్న, చక్రవర్తికూర, పొట్లకాయ మిరియాలు, జింకమాంసము, మేకపాలు, వంకాయ, కాంజికము, బూడిదగుమ్మడికాయ, మలబద్ధమును పోగొట్టు ప్రక్రియలు, యివి యన్నియు అర్శోరోగులకు పథ్యకరములు. నీరుల్లిపాయను కాల్చి తినిన మంటలు, బాధ వెంటనే ఉపశమించును.

## అర్శోరోగములందపథ్యములు

మలమూత్రాదివేగముల నడ్డగించుట, స్త్రీసంభోగము, మిక్కిలి శీతకరద్రవ్యములు, శీతోదకము, పప్పు, విరుద్ధాన్నపానములను సేవిం చుట, హెచ్చుతగ్గులుగా యుండుచోటకూర్చుండుట, గుఱ్ఱము, ఒంటె, త్రొక్కుడుబండ్లు మొదలగువానినెక్కి స్వారిచేయుట, విరేచన బద్ధము చేయు పదార్థములను సేవించుట మొదలగునవి అర్శోరోగము నందపథ్య ములుగా యుండును.

## అజీర్ణమునందు పథ్యము

వమనము; మృదురేచనము, స్వేదనము, వ్యాయామము, దీపన లఘుకర శాకాదికములు, పాతబియ్యము, గోధుములు, పేలాల జావ, చక్రవర్తికూర, లేతముల్లంగి, వెల్లుల్లి, పండిన గుమ్మడికాయ, పచ్చి అరటికాయ, మునగకాయ, పొట్లకాయ, వంకాయ, నక్కదోస కాయ, కాకరకాయ, అల్లము, గోంగూరగోరుకూర, పులిచింత, ఉసిరి కాయ, శొంఠి, దానిమ్మ, యవలు, పుల్లప్రబ్బలి, నిమ్మపండు, మాదీ ఫలము, తేనె, వెన్న, నెయ్యి, మజ్జిగ, రేగుపండు, లవణములు, కారము, ఇంగువ, నూనె, వాము, మిరియాలు, మెంతులు, జీలకఱ్ఱ, తాంబూలము, వేడినీరు, కలి, చేదు వగరుగల రసములు, జింక, నెమలి, కుందేలు వీట్ల మాంసరసములు మొదలగునవి అజీర్ణరోగులకు పథ్య కరములు.

## అజీర్ణములందపథ్యములు

విరేచనము, మలమూత్రాది వేగముల నిరోధించుట, రక్త స్రావము, అధికముగ భుజించుట, జాగరణము, మత్స్యమాంసము, బచ్చలికూర, అధికజలపానము, గుమ్మడికాయ, కంద మొదలగు దుంపకూరలు, పప్పుదినుసులు, పిండివంటలు, నేరేడుపండ్లు, విరిగిపోయిన (చెడిపోయిన) పదార్థములు, జున్ను, విరిగినపాలు, దుష్టమైననీరు, విరుద్ధ మైన అసాత్మ్యమైన అన్నపానములు, మలబద్ధకరద్రవ్యములు, గురుకర పదార్థములు మొదలగునవి అజీర్ణరోగులకు అహితములుగా యుండును.

## క్రిమిరోగములందు పథ్యములు

శరీరశోధనము, శరీరము, శిరస్సు మొదలగు వాటియందు పిచి కారితో శుభ్రపరచుట, ధూపము, కఫనాశకరపదార్థములు, పాత వెదురుబియ్యము, ఎఱ్ఱవడ్లబియ్యము, చేదుపొట్ల, వెదురు మొలకలు, వెల్లుల్లి, చకోరపుకూర, చిత్రమూలము, మందారఆకులు, ఆవాలు, చేదుగాయుండు పదార్థములు, ఎలుకచెవికూర, వాయువిడంగములు,

నువ్వులనూనె, ఆవనూనె, కాంచకము, తేనె, వెల్లుల్లిపండు, గోమూత్రము, తాంబూలము, మద్యము, కస్తూరి, ఇంగువ, క్షారములు, వాము, చంద్ర, కొడిశపాల, నిమ్మపండ్లరసము, నల్లజీలకఱ్ఱ, అగరు, వగరు, కారము రసములుగల పదార్థములు మొదలగునవి క్రిమిరోగులకు పథ్యములు.

## క్రిమిరోగములందపథ్యములు

వాంతి, వాంతివచ్చునప్పుడు ఆపుట, విరుద్ధాన్నపానములు, పగటినిద్ర, ద్రవపదార్థములు, పిష్టాన్నము, అజీర్ణభోజనము, నెయ్యి, మినుములు, పెరుగు, ఆకుకూరలు, మాంసము, పాలు, పులుసు, మధుర రసముగల పదార్థములు మొదలగునవి క్రిమిరోగులు వర్జింపవలయును.

## పాండుకామిలారోగములందు పథ్యములు

వమనము, విరేచనము, పాతబియ్యము, గోధుమలు, పెసలు, కందులు, చిరుసెనగలు వీట్లయూషములు, అరణ్యజంతువుల మాంస రసములు, పొట్లకాయ, బూడిదగుమ్మడికాయ, లేతఅరటికాయ, పాలకూర, చెరుకు, పొన్నగంటికూర, తిప్పతీగె, చిట్టికూర, వెల్లగలిజేరు ఆకు, వంకాయ, వెల్లుల్లి, ఎఱ్ఱవుల్లి, మామిడిపండు, కరక్కాయ, దొండకాయ, చేపలు, గోమూత్రము, ఉసిరికాయ, మజ్జిగ, నెయ్యి, నూనె, పులికడుగు, ఉష్ణోదకము, వెన్న, పసుపు, నాగకేసరములు, యవక్షారము, లోహభస్మము, వగరుగాయుండు పదార్థములు, కుంకుమపువ్వు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుపండ్లు మొదలగునవి పాండుకామిలా రోగములందు పథ్యములుగా యుండును.

## పాండుకామిలారోగములందపథ్యములు

రక్తమోక్షణము, ధూమపానము, వాంతి, మలమూత్రాదివేగ నిరోధము, చెమటతీయుట, మైథునము, శింబిపత్రము (కారుపెసర,) చిత్రమూలము, ఇంగువ, మినుములు, ఉదకపానము, తాంబూలము,

గానుగపిండి, ఆవాలు, సారాయి, పులుపురసముగల ద్రవ్యములు, దుష్టమైనట్టియు, విరుద్ధమైనట్టియు అన్నపానములు, గురకరపదార్థములు, విదాహకరమైన పదార్థములు మొదలగునవి పాండుకామిలారోగులు వర్జింపవలయును.

## రక్తపిత్త ప్రదరరోగములకు పథ్యములు

రక్తపిత్తము అధోముఖముగ వెడలుచుండిన వమనము, ఊర్ధ్వముగ వెడలుచుండిన విరేచనము, ఉభయమార్గముల వెడలుచుండిన లంఘనము చేయవలెను. ప్రాతబియ్యము, కాచిచల్లార్చినపాలు, బటాణీగింజల కట్టు, శాలిధాన్యము, షష్టికధాన్యము, పెసలు, చిరుశనగలు, శనగలు, అడవిపెసలు, కందులు వీట్లయొక్క యూషములు, చామలు, కొఱ్ఱలు, దానిమ్మ, ఉసిరికపండ్లు, మారేడు, పొట్లకాయ, వేపపూత, వేపయిగుళ్లు, వెదురుమోవులు, జువ్వి, చిఱ్ఱికూర, చక్రవర్తికూర మొదలగు ఆకుకూరలు, బఱ్ఱెనెయ్యి, పావురాయి, లావుకపిట్ట, అడవిపావురాయి, చకోరములు, తీతువుపిట్ట, కౌజు, కుందేలు, లేళ్ళు, జింకలు వీనిమాంసరసములు, సైంధవలవణము, బీరకాయ, సొరకాయ, బూడిదగుమ్మడికాయ, ద్రాక్ష, ఖర్జూరపండ్లు, కొబ్బరి, పేలపిండి, చన్నీటిస్నానము, ఉద్యానవనవిహారము, చిత్రకథలను వినుట, వైఢూర్యము, ముత్యములను ధరించుట మొదలగునవి రక్తపిత్త ప్రదరరోగులకు పథ్యకరములు.

రోగి ఆమ్లార్థియైనచో పైయూషములయందుగాని, మాంసరసములయందుగాని దానిమ్మపులుసు లేక ఉసిరికపులుసునైననూ చేర్చి యివ్వవలెను. కఫముతోకూడిన రక్తపిత్తప్రదర వ్యాధులయందు పైన చెప్పిన శాకముల యూషములును, వాతముతోకూడిన రక్తపిత్తప్రదర వ్యాధులయందు పైన చెప్పిన జంతువుల మాంసరసమును యివ్వవలెను.

## రక్తపిత్త ప్రదరరోగములందపథ్యములు

శరీరపరిశ్రమ, మార్గమునడచుట, సూర్యకిరణములుసోకుట, తీక్ష్ణగుణములుగల పదార్థములు సేవించుట, తీక్ష్ణమైనపనులు,

మనస్సంక్షోభము, మలమూత్రాది వేగనిరోధము, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగువానిపై స్వారిచేయుట, స్వేదకర్మ, రక్తమోక్షణము, మైథునము, ధూమపానము, క్రోధము, ఉలవలు, బెల్లము, వంకాయలు, నువ్వులు, మినుములు, ఆవాలు, పెరుగు, క్షారపదార్థములు, తాంబూలము, వెల్లుల్లి, దొండపండు, దుమ్ముగలచోట నివసించుట, మద్యము, విరుద్ధాహారములు, కారము, పులుసు, ఉప్పు, విదాహికరపదార్థములు మొదలగునవి రక్తపిత్తప్రదరరోగులకు అపథ్యకరములు.

## క్షయరోగములందు పథ్యములు

పాలు, మాంసరసము, మాంసము, సుగంధపుష్పధారణము, పుష్పములయొక్క సువాసనను నాఘ్రాణించుట, స్నిగ్ధములు, అగ్నిదీప్తికరములు, లఘుగుణము కల పదార్థములు మరియు మధురరసములును శీతలములగు పదార్థములను సేవించుట, సంతోషము, సుఖముగ కూర్చుండుట, విశ్రాంతినొందుట, ప్రాతబియ్యము, యవలు, గోధుములు, పెసలు మొదలగు ధాన్యములు, ద్రాక్షపండ్లు, పురాణమద్యము ముల్లంగిదుంపలు, ఉలవలు, నెయ్యి, ఉసిరికపండ్లు, శొంఠి, దానిమ్మ, చతుష్పాద జంతువులలో స్త్రీజాతియొక్కయు, పక్షులలో పురుషజాతియొక్క మాంసము, మేకమాంసము, మేకపాలు, పంచదార, మేకనెయ్యి, మేకలమధ్య నివసించుట, ఆవుపాలు, ఆవుమజ్జిగ, సూర్యరశ్మి, మంచిగాలి సేవించుట, చక్రవర్తికూర, చిఱ్ఱికూర, పొట్లకాయ, బీరకాయ, సొరకాయ, తోటకూర, రామములగపండ్లు, ఖర్జూరపుకాయలు, నారింజ, బత్తాయి, సువర్ణముక్తాద్యలంకారము, హోమము, దానము, రోగి బలముగాయుండి దోషప్రకోపము కలిగియున్న యెడల వమనము, విరేచనము చేయించుట మొదలగునవి క్షయరోగమునందు పథ్యకరములు.

## క్షయరోగములందపథ్యములు

వంకాయలు, కాకరకాయలు, నువ్వులనూనె, మారేడుపండు, ఆవాలు, మైథునము, పగటినిద్ర, కోపము, మనస్సునకు శాంతి లేకుండుట,

మలమూత్రాది వేగనిరోధము, శ్రమ, ఉపవాసము, స్వేదము, రూక్షాన్న పానములు, అంజనము, తాంబూలము, పులుసు, కారము, వగరు, చేదు యిట్టిరసములు, క్రొత్తబియ్యపు వంటకములు, ఆకుకూరలు, క్షారపదార్థములు, విరుద్ధాన్న భోజనము, దొండకాయ, దోసకాయ, దుంపకూరలు, ఇంగువ, వెల్లుల్లి, పెరుగు, ఉష్ణకరపదార్థములు అజీర్ణకరపదార్థములు మొదలగునవి క్షయరోగములందపథ్యములు.

## కాసరోగములకు పథ్యములు

గోధుములు, ప్రాతబియ్యము, శాలిధాన్యము, షష్టికధాన్యము, మినుములు, పెసలు, ఉలవలు, మేకపాలు, మేకనెయ్యి, దొండపండ్లు, వంకాయలు, లేతముల్లంగి, కసివింద, చక్రవర్తికూర, కొయ్యతోటకూర, మాదీఫలము, గుంటగలగర, ద్రాక్షపండ్లు, వెల్లుల్లి, వరిపేలాలు, వేడినీరు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, తేనె మొదలగునవి కాసరోగులకు పథ్యకరములు.

## కాసరోగములయందపథ్యములు

మైధునము, చమురుగల పదార్థములు, మధురపదార్థములు, పగటినిద్ర, గేదెపాలు, పెరుగు, పిండితోచేయబడిన పదార్థములు, మత్స్యములు, పాయసాది కఫకరపదార్థములు, పొగలోనుండుట, మొదలగునవి కాసరోగములందపథ్యములుగా యుండును.

## హిక్క (ఎక్కిళ్లు)ల యందు పథ్యములు

స్వేదనము, వమనము, నస్యకర్మ, ధూమపానము, విరేచనము, నిదుర, స్నిగ్ధములును, మృదువులును, లవణమిశ్రితములగు పదార్థములు, ప్రాతబియ్యము, ఉలవలు, గోధుములు, శాలిధాన్యము, షష్టికధాన్యము (బుడమబియ్యము అనగా 2 నెలలలో పంట తయారగుధాన్యము) జింక, తిత్తిరిపక్షి, లావుకపిట్ట మొదలగుజాంగలములగు మృగములయొక్కయు, పక్షులయొక్కయు మాంసము, ఉష్ణోదకము, మాదీఫలము, పొట్లకాయ,

లేతముల్లంగి, వెలగపండు, వెల్లుల్లి, తేనె, పీతకన్నములయందలి నీరు మొదలగునవి హిక్కారోగులకు పథ్యములు.

## హిక్క (ఎక్కిళ్లు)ల యందపథ్యములు

అనుములు, మినుములు, గనుగపిండి, జలజంతువులయొక్క మాంసము, గొఱ్ఱెపాలు, దంతకాష్టముచే దంతధావనముచేయుట, వస్తికర్మ, మత్స్యములు, ఆవాలు, ఆమ్లపదార్థములు, సొరకాయ, నూనెతో చేసిన పదార్థములు, ఉచ్చెలికూర, గురుత్వమును, శైత్యమును చేయు అన్నపానములు మొదలగునవి హిక్కారోగులకు అపథ్యములుగా యుండును.

## శ్వాసలయందు పథ్యములు

విరేచనము, స్వేదకర్మ, ధూమపానము, వమనము, పగటినిద్ర, ప్రాతవియగు షష్టికధాన్యము, ఎఱ్ఱవడ్లు, ఉలవలు, కందులు, నెమలి, తీతువుపిట్ట, లావుకపిట్ట, కోడి, చిలుక మొదలగు పక్షులయొక్కయు, జాంగల జంతువులయొక్కయు మాంసము, పురాణఘృతము, మేక నెయ్యి, మేకపాలు, సారాయి, తేనె, పొట్లకాయ, వంకాయ, వెల్లుల్లి, దొండకాయ, నిమ్మపండ్లు, చిఱ్ఱికూర, చక్రవర్తికూర, ద్రాక్ష, ఏలకులు, వేడినీరు, వాకుడుకాయలు మొదలగునవి శ్వాసరోగులకు

## శ్వాసలయందపథ్యములు

రక్తమోక్షణము, తూర్పుగాలి, ఎక్కువనీరుత్రాగుట, గొఱ్ఱెపాలు, గొఱ్ఱెనెయ్యి, దుష్టములగు అన్నపానములు, చేపలు, దుంపకూరలు, ఆవాలు, నూనె, రూక్షకరములైనట్టియు, అజీర్ణకరమైనట్టియు పదార్థములు, కాష్టముతో దంతధావనము, శ్రమ, వేగములనడ్డగించుట మొదలగునవి శ్వాసలయందపథ్యములుగా యుండును.

## స్వరబేదమునకు పథ్యములు

స్వేదకర్మ (చమటతీయుట), వస్తికర్మ, ధూమపానము, విరేచనము, కబలగ్రహము (పుక్కిలిపట్టుట), నస్యకర్మ, ఫాలభాగమున సిరావ్య

ధనము, యవలు, ప్రాతఎఱ్ఱబియ్యము, హంస, అడవికోడి, నెమలి వీనిమాంసరసములు, సారాయి, గోకణ్టకః (వాకుడుకాయ), కామంచి, మనుబాల, లేతముల్లంగి, ద్రాక్ష, కరక్కాయలు, మాదీఫలము, వెల్లుల్లి, సైంధవలవణము, అల్లము, తాంబూలము, మిరియాలు, నెయ్యి మొదలగునవి స్వరభేదరోగమునందు పథ్యములుగా యుండును.

## స్వరభేదమునకు అపథ్యములు

మామిడిపండు, వెలగపండు, పోగడపండు, తామరతూండ్లు, నేరేడుపండ్లు, విషముష్టి, వగరుగలపదార్థములు, వమనము, పగటినిద్ర, అధికసంభాషణ, విరుద్ధాన్నపానములు, చేమదుంపలు, బెండకాయ, నూనె, మినుములు మొదలగునవి స్వరభేదరోగమునందు అపథ్యములుగా యుండును.

## అరుచికి పథ్యములు

గోధుములు, పెసలు, ఎఱ్ఱవడ్లు, షష్టికధాన్యము, పంది, మేక, కుందేలు, జింక, వీనిమాంసములు, చేగు, ఝషాండము, (ఒకవిధమైన చేపయొక్క గుడ్లు) మధురాలిక, లిశము, ప్రోష్టి, ఖలేశము, కవరి, రోహితము (యివియన్నియు మత్స్యభేదములు) అనుమత్స్యములు, తక్కలిఆకు, వేముయిగుళ్ళు, లేతముల్లంగి, వంకాయ, అరటికాయ, దానిమ్మపండు, నారదబ్బకాయలు, పొట్లకాయ, సౌవర్చలవణము, పాలు, నెయ్యి, లేతతాటిముంజలు, వెల్లుల్లి, కందగడ్డ, ద్రాక్ష, తియ్యమామిడిపండ్లు, వట్టివేరుతో పరిమళించునీరు, కాంజికము, రేగుపండ్లు, పెరుగు, మజ్జిగ, అల్లము, పంచదార, తీపి, పులుపు, చేదుగలపదార్థములు, స్నానాదులచే శరీరమును మార్జనము చేయుట మొదలగునవి అరుచి రోగులకు పథ్యములుగా యుండును.

## అరుచికి అపథ్యములు

దప్పి, త్రేనుపు, ఆకలి, కంటినీరు వీనియొక్క వేగములను నిరోధించుట, అయిష్టమగు ఆహారము, రక్తమోక్షణము, కోపము, లోభము

భయము, దుఃఖము, దుర్గంధము, జలప్రాయమగు ప్రదేశములయందు నివసించుట, వికారముగా నుండువాటిని చూచుట మొదలగునవి అరుచి రోగులకు అహితములుగా యుండును.

## ఛర్దిరోగములందు పథ్యములు

విరేచనము, లంఘనము, స్నానము, జపము, వరిపేలాలు, మండము, పాతబియ్యము, పెసలు, గోధుములు, పొట్లకాయ, బీరకాయ, దోసకాయ, ధనియాలు, నిమ్మపండ్లు, ఉసిరికాయ, మామిడిపండ్లు, రేగుపండ్లు, ద్రాక్షపండ్లు, వెలగపండు, దానిమ్మపండు, మాదీఫలములు, నెయ్యి, తేనె, పంచదార, తిప్పసత్తు, పేలపిండి, పమిడిపత్తి గింజలపప్పు, నెమలిఈకలమసి, నెమలి, తీతువుపిట్ట, లావుకపిట్ట మొదలగు పక్షులయొక్క మాంసము, అడవిజంతువుల మాంసము, సువాసనద్రవ్యములు, మనోల్లాసము కలిగించునట్టి హితకరపదార్థములు మొదలగునవి ఛర్దిరోగులకు పథ్యములుగా యుండును.

## ఛర్దిరోగములం దపథ్యములు

నస్యము, వస్తికర్మ, స్వేదనము, రక్తస్రావము, వ్యాయామము, దంతకాష్టముచే దంతధావన, పలచని అన్నము, వేడిమి, భయము, అప్రియము, అరుచి పుట్టినికలుగజేయు భోజనము, సొరకాయ, దొండకాయ, బీరకాయ, ముల్లంగి, ఆవాలు, నూనె, పిండివంటకములు, ఇప్పకాయలు, వెట్టిపుచ్చ, దేవదాళి, ప్రకృతి విరుద్ధములగు అన్నపానములు మొదలగునవి ఛర్దిరోగములందపథ్యములుగా యుండును.

## తృష్ణారోగమునందు పథ్యములు

షష్టికధాన్యము, శాలిధాన్యము, పేయ, విలేపి, అన్నమండము (అన్నము నీరును కలిపి ఉడికించి మెతుకులులేకుండునటుల వడియకట్టిన గంజి), జాంగలజంతువుల మాంసరసము, పంచదార, వేయించిన పెసలు, చిరుశనగలు వీట్లయొక్క యూషము (జావ)లు, అరటిపువ్వు, తక్రకూర్చిక (మజ్జిగపాలు వీటికలియకతో చేయబడినవంట), బూడిదగుమ్మడి

కాయ, బచ్చలి, ఖర్జూరపండ్లు, దానిమ్మపండు, ఉసిరికపండు, మాదీఫలములు, ఆవుపాలు, నిమ్మపండ్లు, వేముపండ్లు మొదలగునవి తృష్ణారోగమునందు పథ్యములుగా యుండును.

## తృష్ణారోగమునందపథ్యములు

స్నేహపానము, అంజనము, స్వేదనము, ధూమపానము, వ్యాయామము, నస్యకర్మ, ఎండలోతిరుగుట, దంతకాష్టముచే దంతధావనచేయుట, అజీర్ణముచేయు పదార్థములు, పులుసు, ఉప్పు, వగరు, కారము ఈ రసములు గల ద్రవ్యములు, త్రికటుకములు, చెడిననీరు, తీక్ష్ణపదార్థములు మొదలగునవి తృష్ణారోగమునందు అపథ్యములుగా యుండును.

## మూర్ఛారోగమునందు పథ్యములు

ప్రాతవియగు యవలు, ఎఱ్ఱవడ్లు, పెసలు, బటానీలు వీట్లయూషములు. అడవిజంతువుల మాంసరసములు, ఆవుపాలు, చక్కెర, బూడిదగుమ్మడిపండు, పొట్లకాయ, అరటికాయ, దానిమ్మపండు, కొబ్బరి, ఇప్పపూలు, చిఱ్ఱికూర, బచ్చలి, లఘువైన ఆహారములు, ధ్వని, అద్భుతమును కలిగించు వస్తువులను చూచుట, మనోహరములైన గానములు, వాద్యములు వీనినివినుట, వ్యాయామము, పూర్వవిషయములను జ్ఞప్తికి తెచ్చుకొనుటయు, ఆలోచించుటయు, ఆత్మవిచారము, ధైర్యము కలిగియుండుట, ముక్కునోరు వీటినుండి వెడలువాయువులను అడ్డగించుట, వమనము, విరేచనము, నస్యము, లంఘనము, ఎల్లప్పుడు నీడనుండుట, వర్షోదకము, తీక్ష్ణములగు మద్యములు, (సారాయి కల్లు మొదలగునవి) మొదలగునవి మూర్ఛారోగులకు హితకరములుగ యుండును.

## మూర్ఛారోగమునందపథ్యములు

తాంబూలము, ఆకుకూరలు, దంతకాష్టముతో దంతధావనము, ఎండలో తిరుగుట, విరుద్ధములగు అన్నపానములు, మైథునము, స్వేదకర్మ, కారము ఎక్కువగా యుండుపదార్థములు, మలమూత్రాది వేగ

ముల నిరోధించుట, మజ్జిగ మొదలగునవి మూర్ఛారోగులకు అపథ్యము లుగా యుండును.

## దాహరోగమునందు పథ్యములు

శాలిధాన్యము, షష్టికధాన్యము, పెసలు, చిరుశెనగలు, శెనగలు, యవలు, జాంగల జంతువుల మాంసరసము, పేలాలజావ, పేలపిండి, చక్కెర, పాలు, వెన్న, బూడిదగుమ్మడికాయ, దోసకాయ, అరటికాయ, పనసకాయ, తియ్యదానిమ్మ, పొట్లకాయ, ఖర్జూరపండ్లు, సొరకాయ, దొండకాయ, ద్రాక్షపండ్లు, పక్కెరగడ్డలు మొదలగునవి దాహరోగులకు పథ్యములుగా యుండును.

## దాహరోగమునందపథ్యములు

శరీర పరిశ్రమ, ఎండలోనుండుట, తిరుగుట, మజ్జిగ, తాంబూలము, తేనె, ఇంగువ, మైథునము, కారము చేదుగల పదార్థములు, ఉష్ణ పదార్థములు మొదలగునవి దాహరోగులకు అపథ్యములుగా యుండును.

## ఉన్మాదరోగమునందు పథ్యములు

స్నేహపానము, విరేచనము, వమనము, అంజనము, నస్యము, గోధుమలు, పెసలు, ఎఱ్ఱవడ్లు, ధారోష్ణముగా యుండుపాలు, అప్పుడు కాచిన నెయ్యి, పురాణఘృతము, తాబేటిమాంసము, అడవిజంతువుల మాంసరసము, బూడిదగుమ్మడిపండు, పొట్లకాయ, వల్లారెఆకు, చక్రవర్తికూర, చిఱ్ఱికూర, ద్రాక్ష, వెలగపండ్లు, పనసపండ్లు మొదలగునవి ఉన్మాదరోగులకు పథ్యములుగా యుండును.

## ఉన్మాదరోగములందపథ్యములు

మద్యము, విరుద్ధాన్న పానములు, ఉష్ణకరపదార్థములు, నిద్ర, ఆకలి, దప్పిఅను వేగములను అడ్డగించుట, చేదుగనుండు పదార్థములు, ఉష్ణముగాయుండు పదార్థములు మొదలగునవి ఉన్మాదరోగులకు అపథ్యములుగా యుండును.

## అపస్మారరోగమునందు పథ్యములు

వమనము, విరేచనము, వస్తికర్మ, అంజనము, నస్యము, ధూపము, అభ్యంగనము, ఉద్వర్తనము, (నలుగుపెట్టుట) ఎఱ్ఱవడ్లు, పెసలు, గోధుములు, పురాణఘృతము, తాబేటిమాంసము, అడవిజంతువుల మాంసరసము, పాలు, సరస్వతీఆకు, వస, పొట్లకాయ, బాగుగాపండిన బూడిదగుమ్మడిపండు, (వృద్ధకూష్మాండం) చక్రవర్తికూర, తియ్యదానిమ్మపండు, మునగకాయలు, కొబ్బరినీరు, ద్రాక్ష, ఉసిరికపండ్లు, చిట్టీతపండ్లు మొదలగునవి అపస్మారరోగమునందు పథ్యములుగా యుండును.

## అపస్మారరోగమునందపథ్యములు

మద్యము, చేపలు, విరుద్ధాన్నము, తీక్ష్ణఉష్ణ గురుగుణములుగల పదార్థములు, మైథునము, శరీరశ్రమ, సమస్త ఆకుకూరలు, దొండకాయ, మినుములు, కందులు, దప్పి నిద్ర ఆకలి అను వేగములను అడ్డగించుట మొదలగునవి అపస్మారరోగమునందు అపథ్యములుగా యుండును.

## వాతరోగమునందు పథ్యములు

అభ్యంగనము, స్వేదనము, (చమటతీయుట) వస్తి, నస్యము, తైలలేపమర్దనములు, స్నేహవిరేచనము, తైలపానము, రక్తవేయుట, మధురామ్ల లవణరసములుగల పదార్థములు, బలము కలుగజేయు పదార్థములు, స్నిగ్ధములుగను ఉష్ణముగనుండు పదార్థములు, పెరుగు, ఉష్ణోదకము, కాంజికము, వెల్లుల్లి, ఇంగువ, తేనె, నెయ్యి, ఆవుపాలు, ఆముదము, తిలతైలము, అల్లము, బెల్లము, ఉలవలు, మినుములు, గోధుములు, ఎఱ్ఱబియ్యము, పొట్లకాయ, మునగకాయ, వంకాయ, దానిమ్మపండ్లు, చిట్టీతపండ్లు, కలకండ, రేగుపండ్లు, ద్రాక్ష, తాంబూలము, లవణము, ఊరపిచ్చుక, కోడి, నెమలి, తీతువుపిట్ట, పావురము వీట్ల మాంసములు, పుట్టకొక్కులు, పర్వతమత్స్యము, మొసలి, గర్గరము, (మత్స్యవిశేషము) ఖుడిశమను మత్స్యము మొదలగువానిని వాతవ్యాధులయందు దోషములయొక్క స్థానము, అవస్థ, గమనము వీనిననుసరించి యథాయోగ్యముగ పథ్యమునందొసంగవలెను.

## వాతరోగములందపథ్యములు

చింత, జాగరణము, మలమూత్రాదివేగ నిరోధము, వమనము, శ్రమ, ఉపవాసము, శనగలు, బటానీలు, చామలు, జొన్నలు, అనుములు, కొఱ్ఱలు, పెసలు, చెరువునీరు, ఏటినీరు, వగరు చేదు కారము గల పదార్థములు, స్త్రీసంభోగము, ఏనుగులు గుఱ్ఱములు మొదలగు వానిపై స్వారిచేయుట, విశేషముగా తిరుగుట, బియ్యపువంటకములు, శీతోదకము, దోసకాయ, సొరకాయ, దొండకాయ, చేపలు, మంచము పైపరుండుట మొదలగునవి వాతరోగములందు అపథ్యములుగా యుండును. మరియు ఆధ్మానవాతము, అర్దితవాతరోగులకు స్నానము, పుల్లతో దంతధావనము అనునవి రెండును మిక్కిలి అహితకరములు.

## వాతరక్తరోగమునందు పథ్యములు

విరేచనము, వస్తికర్మ, స్నేహపానము, లేపనము, అభ్యంగనము, రక్తమోక్షణము, వమనము, యవలు, షష్టికధాన్యము, వరిధాన్యము, రాజనాలు, ఎఱ్ఱవడ్లు, గోధుములు, శనగలు, పెసలు, కందులు, గొఱ్ఱె, మేక, బఱ్ఱె, ఆవు వీట్లపాలు, బచ్చలికూర, కామంచిఆకు, వేము యిగుళ్లు, చెంచలికూర, చక్రవర్తికూర, కాకరకాయ, చిఱ్ఱికూర, పొట్లకాయ, ఉసిరికపండ్లు, అల్లము, కందగడ్డ, చక్కెర, ద్రాక్ష, గుమ్మడిపండు, క్రొత్తవెన్న, అప్పుడుకాచిననెయ్యి, లావకపిట్ట, తీతువుపిట్ట, కోడి, చిలుక, భరతపక్షి, పావురము, పిచ్చుక, వర్తికమనుపిట్ట వీట్ల మాంసములు, దేవదారుకూర, సరళదేవదారు, తైలమర్దనము, చేదుగనుండు పదార్థములు మొదలగునవి వాతరక్తరోగములయందు పథ్యములుగా యుండును.

## వాతరక్తరోగములందపథ్యములు

పగటినిద్ర, నిప్పుసెగనుండుట, దేహపరిశ్రమ, ఎండలోనుండుట, స్త్రీసంభోగము, మినుములు, ఉలవలు, అనుములు, బటానీలు, క్షారయుక్తములగు పదార్థములు, మత్స్యములు, ఆనూపజంతువులమాంసము విరుద్ధాన్నపానములు, పెరుగు, చెరుకురసము, ముల్లంగిదుంపలు, మద్యము

తాంబూలము, పుల్లగంజి, నువ్వులు, కటురసము ఉష్ణకరము గురుగుణముగల పదార్థములు, లవణరసముగల పదార్థములు, పేలపిండి మొదలగునవి వాతరక్తరోగములందు అపథ్యములుగా యుండును.

## ఊరుస్తంభరోగమునందుపథ్యములు

లంఘనము, రూక్షకరపదార్థసేవనము, రూక్షస్వేదము, ఆరుకలు, ఎఱ్ఱవడ్లు, యవలు, ఉలవలు, చామలు, అడవిఆరుకలు, మునగకాయలు కాకరకాయ, పొట్లకాయ, చక్రవర్తికూర, చెంచలికూర, కాచికూర, వేముయిగుళ్లు, వేడినీళ్లు, ఘృతముచేర్చని జాంగల మాంసరసములు, ఉప్పులేనికూరలు మొదలగునవి ఊరుస్తంభరోగులకు పథ్యములుగాయుండును.

## ఊరుస్తంభరోగమునందపథ్యములు

విరేచనము, వమనము, స్నేహకర్మ, రక్తమోక్షణము, వస్తికర్మ, విరుద్ధాన్నపానములు, గురుగుణముగల పదార్థములు, ద్రవపదార్థములు, స్నిగ్ధములుగా యుండు పదార్థములు, శీతలముగా యుండు పదార్థములు మొదలగునవి ఊరుస్తంభరోగులకు అపథ్యములుగా యుండును.

## ఆమవాతరోగములందుపథ్యములు

లంఘనము, స్వేదనము, స్నేహపానము, వస్తికర్మ, విరేచనము, రూక్షస్వేదము, యవలు, ఉలవలు, చామలు, కొఱ్ఱలు, ఎఱ్ఱవరిబియ్యము, గోధుములు, చక్రవర్తికూర, మునగకాయ, గలిజేరు, కాకరకాయ, పొట్లకాయ, అల్లము, ఉష్ణోదకము, వెల్లుల్లి, ఆముదము, తైలపానము, జాంగల జంతువుల మాంసరసము, వగరుగల పదార్థములు, దీపనకర ద్రవ్యములు , శ్లేష్మవాతహర పదార్థములు మొదలగునవి ఆమవాత రోగులకు పథ్యములుగా యుండును.

## ఆమవాతరోగములందపథ్యములు

పెరుగు, చేపలు, బెల్లము, పాలు, బచ్చలికూర, మినుములు, చెడిననీరు, ఎక్కువగాలి, విరుద్ధాన్నపానము, వేగములనడ్డగించుట, రాత్రి జాగరణము, మితిమీరి భుజించుట, గురుపదార్థములు, చెడిపోయినపదార్థములు మొదలగునవి ఆమవాత రోగములందపథ్యములుగా యుండును.

## శూలరోగములందుపథ్యములు

వమనము, లంఘనము, స్వేదనము, పాచనౌషధములు, క్షార యుక్తమైన పదార్థములు, స్నేహపానము, విరేచనము, గోధుమలు, పొట్లకాయ, కాకరకాయ, చక్రవర్తికూర, మునగకాయ, ఉప్పు, వెల్లుల్లి, పాతబియ్యము, ఆముదము, గోమూత్రము, ఉష్ణోదకము, నిమ్మ పండ్లరసము, చెంగల్వకోష్టు, లఘువైన పదార్థములు, వేడినీళ్ళు మొదలగునవి శూలరోగములందు పథ్యములుగా యుండును.

## శూలరోగములందపథ్యములు

విరుద్ధాన్నపానములు, నిద్రమేల్కొని యుండుట, విషమాశనము, రూక్షకరములైన పదార్థములు, తిక్తరసముగల పదార్థములు, శీతలముగా యుండు పదార్థములు, గురుగుణముగల పదార్థములు, వ్యాయామము, మైథునము, మద్యపానము, పప్పులు, కారముగల పదార్థములు, వేగ ముల నడ్డగించుట, దుఃఖము, క్రోధము. మినుములు మొదలగు కాయ ధాన్యములు, ఎండలోతిరుగుట, ఆమ్లపదార్థములు, అజీర్ణకరపదార్థ ములు, నువ్వులు మొదలగునవి శూలరోగములందపథ్యములుగా యుండును.

## గుల్మరోగములందు పథ్యములు

లంఘనము, స్నేహము, స్నేహపానము, స్వేదము, విరేచనము, వస్తికర్మ, ఇంగువ, లవణము, తిత్తిరిపక్షులు, నెమలి, కోళ్ళు, క్రౌంచ పక్షి వీట్ల మాంసరసములు, ఘృతము, శాలిధాన్యము, ద్రాక్ష, ఉసిరిక పండ్లు, ఆవుపాలు, మేకపాలు, పొట్లకాయ, దానిమ్మపండ్లు, పంచదార ఉలవలు, ప్రాతవడ్లు, షష్టికధాన్యము, యవలు, జాంగలజంతుమాంస రసము, మద్యము, తైలము, మజ్జిగ, పాతరాజనాలబియ్యము, ఎఱ్ఱవరి బియ్యము, ఆముదము, వెల్లుల్లి, లేతముల్లంగి, పొన్నగంటికూర, చక్ర వర్తికూర, మునగకాయ, మాదీఫలము, వాతమును అనులోమగతిని చెందించు ద్రవ్యములు మొదలగునవి గుల్మరోగములందు పథ్యములు.

## గుల్మరోగములందపథ్యములు

మినుములు, పెసలు, కందులు మొదలగు ద్విదళధాన్యములు, యవలు మొదలగు శూకధాన్యములు, ఎండుమాంసము, ముదురు ముల్లంగి, మత్స్యములు, మధురములగు ఫలములు, అపానవాతము మలము మూత్రము కన్నీరు వీనివేగముల నిరోధించుట, వమనౌషధము సేవించుట, అధికజలపానము, విరుద్ధాన్నపానములు, మలబద్ధకర గురుకరాన్నపానములు మొదలగునవి గుల్మరోగములందపథ్యములుగా యుండును.

## హృద్రోగములయందుపథ్యములు

స్నేహపానము, వమనము, విరేచనము, స్వేదము, లంఘనము, శాలిధాన్యము, పెసలు, యవలు, మిరియాలపొడి కలిపిన జాంగల జంతువుల మాంసరసము, పొట్లకాయ, కాకరకాయ, ఉలవకట్టు, అరటి పండ్లు, గుమ్మడిపండ్లు, తియ్యమామిడిపండ్లు, దానిమ్మపండ్లు, రేలఆకు, లేతముల్లంగి, ఆముదము, వర్షోదకము, సైంధవలవణము, ద్రాక్షపండ్లు, మజ్జిగ, పాతబెల్లము, శొంఠి, వాము, వెల్లుల్లి, ధనియాలు, అల్లము, కాంజికము, మద్యము, తేనె, కస్తూరి, చందనము, పానకము, తాంబూలము, శీతలోపచారములు మొదలగునవి హృద్రోగములయందు పథ్యములుగా యుండును.

## హృద్రోగములయందపథ్యములు

నువ్వులనూనె, పులుపురసము, పుల్లనిమజ్జిగ, గురుత్వముచేయు పదార్థములు, వగరుగలపదార్థములు, శ్రమ, ఎండలోతిరుగుట, రోషము స్త్రీసల్లాపము, చింత, పెద్దగమాట్లాడుట, మలమూత్రాది వేగనిరోధము గొఱ్ఱెపాలు, దుష్టజలము, విరుద్ధాన్నపానములు, ఉష్ణపదార్థములు, తిక్తరసముగల పదార్థములు, పత్రశాకములు, క్షారములు ఇప్పపూలు, పుల్లతో పండ్లుతోముట, రక్తమోక్షణము మొదలగునవి హృద్రోగములయందపథ్యములుగా యుండును.

## మూత్రకృచ్ఛ్రరోగములయందు పథ్యములు

అభ్యంగనము, స్నేహకర్మ, స్వేదము, వస్తికర్మ, ఉత్తరవస్థి విరేచనము, లేపనము, శైత్యోపచారములు, ద్రాక్ష, ఆవుపాలు, పెరుగు, చెరుకురసము, కలకండ, నెయ్యి, కొబ్బరినీళ్ళు, "క్షారయుక్తములును, ఉష్ణవీర్యములును, తీక్ష్ణగుణములును గల ఔషధాన్నములు, వమనము, యివి శ్లేష్మజమూత్రకృచ్ఛ్రమునందు మాత్రమే" మజ్జిగ, బెల్లము, శతావరిస్వరసము, ప్రాతవియగు ఎఱ్ఱవడ్లు, జాంగల జంతుమాంసరసములు, పెసరకట్టు, చక్కెర, బూడిదగుమ్మడిపండు, పొట్లకాయ, దోసకాయ, ఖర్జూరపండ్లు, చిట్టికూర, ఉసిరికాయలు, నదీజలము, పచ్చకర్పూరము మొదలగునవి మూత్రకృచ్ఛ్రరోగములందు పథ్యములు.

## మూత్రకృచ్ఛ్రరోగములందపథ్యములు

మద్యము, శ్రమ, మైథునము, గుఱ్ఱములమీద ఏనుగులమీద ఎక్కి స్వారిచేయుట, విరుద్ధాన్నపానము, విషమాశనము, తాంబూలము, చేపలు, ఉప్పులు, అల్లము, నూనె, ఇంగువ, నువ్వులు, ఆవాలు, మూత్ర శుక్ర మలవేగముల నడ్డగించుట, మినుములు, అతితీక్ష్ణకరమైనట్టియు విదాహకరమైనట్టియు పదార్థములు, రూక్షకరమైన ద్రవ్యములు, ఆమ్లరసద్రవ్యములు మొదలగునవి మూత్రకృచ్ఛ్రరోగములందపథ్యములుగా యుండును.

## మూత్రాఘాతరోగములందుపథ్యములు

స్నేహము, స్వేదము, స్నేహయుక్తమైనవిరేచనము, ఉత్తరవస్థి, నూనె, నెయ్యి, చక్కెర, కలకండ, శతావరిస్వరసము, బ్రహ్మచర్యము పాతవియగు ఎఱ్ఱవడ్లు, జాంగలజంతు మాంసరసము, మద్యము, మజ్జిగ, పాలు, పెరుగు, మినుములకట్టు, బూడిదగుమ్మడిపండు, పొట్లకాయ, దోసకాయ, ఖర్జూరపుకాయలు, లేతటెంకాయ, తాటిగుంజు, (బుఱ్ఱగుంజు) మొదలగునవి మూత్రాఘాతరోగములందు పథ్యములు.

## మూత్రాఘాతరోగములందపథ్యములు

పరస్పర విరుద్ధమైన పదార్థములు, శరీరపరిశ్రమ, త్రోవనడచుట రూక్షకరమైనట్టియు విదాహకరమైనట్టియు మలమూత్ర బంధమును కలిగించునట్టి పదార్థములు, స్త్రీసంభోగము, వేగధారణము, వెదురు మోపులు మొదలగునవి మూత్రాఘాత రోగములందపథ్యములుగా యుండును.

## అశ్మరీరోగములందు పథ్యములు

ఉలవలు, పెసలు, గోధుమలు, పాతబియ్యము, యవలు, మరియు మూత్రకృచ్ఛ్ర మూత్రాఘాత రోగములకు వ్రాయబడిన పథ్యములే యీ రోగమునందు కూడా సామాన్యముగా ఆచరించవలెను.

## అశ్మరీరోగములందపథ్యములు

మూత్రకృచ్ఛ్ర మూత్రాఘాతరోగములకు వ్రాయబడిన అపథ్యములనే ఈ రోగమునందు ఆచరించవలెను.

## ప్రమేహ (మేహ) రోగములందు పథ్యములు

ప్రాతబియ్యము, గోధుమలు, ఆరుకలు, అడవిఆరుకులు, శనగలు, కందులు, యవలు, ఉలవలు, పొట్లకాయ, చిట్టికూర, చక్రవర్తి కూర, పొన్నగంటిఆకు, బీరకాయ, దోసకాయ, ఉసిరికాయ, పెసరకట్టు, లేతఅరటికాయ, అరటిపువ్వు, కాకరకాయ, వెలగపండు, చేదుగనుండు పదార్థములు, జాంగలజంతు మాంసరసములు, సైంధవలవణము, మిరియాలు, సంచారము, అభ్యంగనము మొదలగునవి మేహరోగులకు పథ్యకరములుగా యుండును.

## ప్రమేహ (మేహ) రోగమునందపథ్యములు

ఎల్లప్పుడు పనులు చేయక పూరకకూర్చొని యుండుట, పగటి నిద్ర, కొత్తబియ్యపుఅన్నము, పాలు, పెరుగు, మూత్రవేగము నిరోధించుట, ధూమపానము, స్వేదనముచేసుకొనుట, రక్తమోక్షణము,

సారాయి, నూనె, క్షారపదార్థములు, నెయ్యి, బెల్లము, పులుసు, చెరుకురసము, పిండితో చేయబడిన పదార్థములు, అనూపజంతువుల మాంసరసములు, ఇంగువ, వెల్లుల్లి, స్త్రీసంగమము, నువ్వులు, టెంకాయ నీరు, మునగకాయ, పనసపండు, కందగడ్డ, వంకాయ మొదలగునవి మేహరోగములందపథ్యములుగా యుండును.

## మేదోరోగములందు పథ్యములు

ఉద్వర్తనము (నలుగుపెట్టుట) స్నానము, ప్రాతబియ్యము, పెసలు, ఉలవలు, అడవిఆరుకులు, కొఱ్ఱలు, జొన్నలు, గోధుములు, కందులు, కారము చేదుగల ద్రవ్యములు, లేఖనవస్తి, దేహపరిశ్రమ, జాగరణము, మైథునము, లంఘనము, చింత, గుఱ్ఱము ఏనుగు మొదలగు జంతువులపై ఎక్కితిరుగుట, దారినడచుట, విరేచనము, వాంతి, తేనె, యవలు, చామలు, మజ్జిగ, మద్యము, ఆకుకూరలు, ఉష్ణోదకము మొదలగునవి మేదోరోగులకు పథ్యములుగా యుండును.

## మేదోరోగములందపథ్యములు

శాలిబియ్యము, సౌఖ్యమునొందుట, పాలు, మధురపదార్థములు మినుములు, తృప్తికర భక్షణములు, మాంసములు, సంతోషము, దివానిద్ర, సుగంధపదార్థములు మొదలగునవి మేదోరోగులకుఅపథ్యములుగా యుండును.

## ఉదరవ్యాధులయందు పథ్యములు

రేచనము, లంఘనము, సంవత్సరమునాటి ఉలవలు, పెసలు, ఎఱ్ఱబియ్యము, యవలు, జాంగలములగు మృగములు పక్షులు వీట్ల యొక్క మాంసములు, మద్యము, తేనె, సైంధవలవణము, మజ్జిగ, వెల్లుల్లి ఆముదము, అల్లము, పొట్లకాయ, కాకరకాయ, గలిజేరుఆకు, మునగ కాయ, తాంబూలము, ఏలకులు, కరక్కాయలు, యవక్షారము, మేక, ఆవు, ఒంటె, బఱ్ఱె వీట్లయొక్కపాలు, మూత్రములు, తీక్ష్ణకరమైనట్టియు,

అగ్నివృద్ధికరమైనట్టియు పదార్థములు మొదలగునవి ఉదరరోగములందు పథ్యములుగా యుండును.

## ఉదరవ్యాధులయందపథ్యములు

స్నేహము, ధూమపానము, అతిజలపానము, శిరావేధనము, వాంతి, ఎక్కువదూరము నడచుట, శరీరశ్రమ, పగటినిద్ర, వ్యాయామము, పిండివంటకములు, ఉదకమునందుండు జంతువుల మాంసములు, ఆకుకూరలు, నువ్వులు, అనుములు, విదాహకరపదార్థములు, పప్పుదినుసులు, క్షీరమత్స్యాది విరుద్ధాన్నపానములు, గురుకరాన్నము, లవణయుక్తమగు అన్నము, చెమట బంధించుట, మలముబంధించుట, మొదలగునవి ఉదరరోగములందు అపథ్యములుగా యుండును.

## శోఫరోగములందు పథ్యములు

లంఘనము, శిరోవిరేచనము, విరేచనము, వమనము, స్నేహపానము, నిరూహవస్థి, ఘృతము, గోమూత్రము, పాలు, క్షారద్రవ్యములు, రూక్షకరపదార్థములు, కటురసపదార్థములు, ఉష్ణవీర్యముగల పదార్థములు, దంచినపాతబియ్యము, శాలిధాన్యము, గోధుములు, యవలు, ఉలవలు, పెసలు, ఉడుము, ముండ్లపంది, నెమలి, తీతువుపిట్ట, కోడి, లావుకపిట్ట మొదలగు జాంగల పక్షులయొక్కయు, తాబేలు, శృంగి యను మత్స్యముయొక్కయు మాంసరసములు, పురాణఘృతము, సారాయి, మజ్జిగ, తేనె, అనుములు, కాకరకాయ, ఎఱ్ఱమునగ, వెల్లుల్లి, దోసకాయ, లేతముల్లంగి, గలిజేరిఆకు, కాజరగడ్డ, పొట్లకాయ, వేము చిగురు, ఉసిరికపండ్లు మొదలగునవి శోఫరోగములందు పథ్యములుగా యుండును.

## శోఫరోగములందపథ్యములు

గ్రామ్యజంతువులు, ఆనూపజంతువులు వీనిమాంసరసములు. ఉప్పు, ఎండిపోయినకూరలు, చిక్కుడుకాయ, బెండకాయ, కారము, పులుసు, కొత్తబియ్యపు అన్నము, బెల్లముతో చేసిన పిండివంటలు, పెరుగు, పులగము, నీళ్లుకలియని మద్యము, పుల్లని పదార్థములు, వేవుడు

గింజలు, ఎండినమాంసము, విరుద్ధాన్నపానము, గురుపదార్థములు, అజీర్ణపదార్థములు, పగలునిద్ర, మైథునము, మృద్భక్షణము మొదలగు నవి శోఫరోగములందు అపథ్యములుగా యుండును.

## అండవృద్ధి ఆంత్రవృద్ధిరోగములయందు పథ్యములు

విరేచనము, వస్తికర్మ, రక్తముతీయుట, స్వేదకర్మ, పట్టువేయుట ఎఱ్ఱవరిబియ్యము, ఆముదము, గోమూత్రము, జాంగల జంతుమాంస రసము, మునగకాయ, పొట్లకాయ, గలిజేరుకూర, పల్లేరుఆకు, తక్కిలి ఆకు, తాంబూలము, దేవదారుకూర, వెల్లుల్లి, లేతవంకాయ, గాజర గడ్డ, తేనె, పాతనెయ్యి, వేడినీరు, మజ్జిగ, అర్ధచంద్రాకృతిగ గజ్జల యందు రక్షవేయుట, వాపు కుడిప్రక్కనయున్న ఎడమచేతియందును, వాపు ఎడమప్రక్కనయుండిన కుడిచేతియందును శిరావ్యధనము చేయుట, అవస్థాభేదము ననుసరించి శస్త్రకర్మ, స్త్రీసంగమము మొదలగునవి అండ వృద్ధి ఆంత్రవృద్ధి రోగములయందు పథ్యములుగా యుండును.

## అండవృద్ధి ఆంత్రవృద్ధిరోగములందపథ్యములు

ఆనూపజంతువుల మాంసరసము, పెరుగు, మినుములు, పిండి పదార్థములు, చెడిపోయిన పదార్థములు, విరుద్ధాన్నపానములు, బచ్చలి కూర, గురుకరపదార్థములు, శుక్రవేగధారణము, గుఱ్ఱము మొదలగు వానిపై నెక్కి స్వారిజేయుట. దేహపరిశ్రమ, అతిమైథునము, అతిభోజ నము, ఎక్కువదూరము నడచుట, ఉపవాసము మొదలగునవి అండవృద్ధి ఆంత్రవద్ధి రోగములందపథ్యములుగా యుండును.

## గళగండ, గండమాల, అపచి, గ్రంథి, అర్బుదరోగములందుపథ్యములు

స్వేదము, లేపనము, వమనము, నస్యము, విరేచనము, స్నేహ పానము, సిరావ్యధనము, శస్త్రకర్మ, పురాణఘృతము, ప్రాతవియగు ఎఱ్ఱవరిబియ్యము, యవలు, పెసలు, పొట్లకాయ, ఎఱ్ఱమునగకాయ, కాకరకాయ, వేముయిగుళ్ళు, రూక్షగుణముగల పదార్థములు, కటురస ముగల పదార్థములు, అగ్నిదీప్తిని కలిగించు పదార్థములు, గుగ్గులు మొద

లగునవి గళగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుదరోగులకు పథ్యములుగా యుండును.

## గళగండ,గండమాల,అపచి, గ్రంధి, అర్బుదరోగములందపథ్యములు

క్షీరము, క్షీరముతోచేయబడు యితరపదార్థములు, పాలను చెడగొట్టు పదార్థములు, చెరుకురసము, చక్కెర, బెల్లము, ఆనూప జంతుమాంసరసము, పిండితోచేయబడిన పదార్థములు, ఆమ్లపదార్థములు, మధురపదార్థములు, గురుపదార్థములు, స్రోతస్సుల నడ్డగించు జిడ్డుపదార్థములు మొదలగునవి గళగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుదరోగములందు అపథ్యములుగా యుండును.

## శ్లీపదరోగములందు పథ్యములు

లంఘనము, స్వేదము, విరేచనము, రక్తమోక్షణము, స్నేహము లేపనము, రక్షకర్మ, పాతబియ్యము, యవలు, ఉలవలు, వెల్లుల్లి, పొట్లకాయ, వంకాయ, మునగకాయ, కాకరకాయ, గలిజేరు, ముల్లంగి, బచ్చలి, ఆముదము, గోమూత్రము, కారము, చేదుగల పదార్థములు అగ్ని దీప్తికర పదార్థములు మొదలగునవి శ్లీపదరోగులకు పథ్యములుగా యుండును.

## శ్లీపదరోగములందపథ్యములు

పిండివంటలు, క్షీరవికృతులైన (అనగా పెరుగు, లవణము మొదలగునవి) ద్రవ్యములు, బెల్లము, ఆనూపజంతు మాంసరసము, మధురామ్లరసములుగల పదార్థములు, పర్వతములయందు పుట్టిన నదీజలము, అధికజలపానము, జిగటగల పదార్థములు, గురుకర అజీర్ణకరపదార్థములు మొదలగునవి శ్లీపదరోగములందపథ్యములుగా యుండును.

## విద్రధిరోగమునందు పథ్యములు

రక్తమోక్షణము, మృదువిరేచనము, లఘ్వాహారము, స్వేదకర్మ, లేపనము, పాతవియగు చామలు, ఉలవలు, వెల్లుల్లి, ఎఱ్ఱమునగకాయ, అనుములు, కాకరకాయ, గలిజేరు, పెద్దగుమ్మడి, చిత్రమూ

లము, తేనె, మరియు శోఫరోగమునందు జెప్పబడిన పథ్యములు యివి యున్నియు విద్రధిఆమావస్థయందున్నప్పుడు హితకరములుగా యుండును.

మరియు శస్త్రప్రయోగము, ప్రాతఎఱ్ఱ వరిబియ్యము, నెయ్యి, నూనె, పెసరకట్టు, విలేపి, జాంగలజంతువుల మాంసరసము, అరటి కాయ, పొట్లకాయ, పచ్చకర్పూరము, చందనము, కాగిచల్లారిననీళ్ళు, వ్రణరోగమునందు చెప్పిన పథ్యవర్గము మొదలగునవి యన్నియు విద్రధి పక్వమైనప్పుడు హితకరములుగా యుండును.

## విద్రధిరోగమునందపథ్యములు

విద్రధి ఆమావస్థయందున్నప్పుడు శోఫరోగమునకు చెప్పబడిన ఆచరించవలెను.

౧

## సర్వవ్రణములయందు పథ్యములు

విమ్లాపనము (అణగిపోవునటులజేయుట) రక్తమోక్షణము, కట్టు కట్టుట, శస్త్రకర్మ, వ్రణశోధనము, వ్రణరోపణము, లేపనము, ధూపము విరేచనము, వమనము, స్నేహపానము, స్వేదనము, స్నేహవస్థి, ప్రాత యవలు, షష్టికధాన్యము. గోధుమలు, బియ్యము, కందులు వీట్ల యూషములు, తేనె, చక్కెర, జాంగలములగు మృగములు, పక్షులు వీట్లమాంసములు, నెయ్యి, నూనె, పొట్లకాయ, పేముకొనలు, లేత ముల్లంగి, వంకాయ, కాకరకాయ, దోసకాయ, చిఱ్ఱికూర మొదలగు వానిని దోషానుగుణ్యముగను, ప్రకృత్యనుగుణముగను సర్వవ్రణముల యందు పథ్యములుగా యుండును.

## సర్వవ్రణములయందపథ్యములు

రూక్షము, పులుపు, లవణము, శీతములగు పదార్థములు, మైథు నము, శ్రమ, పెద్దగమాట్లాడుట, స్త్రీలను చూచుట, పగటినిద్ర, రాత్రి జాగరణము, దుముకుట, శోకము, విరుద్ధాన్నపానములు, అధికజలపా నము, తాంబూలము, ఆకుకూరలు, ఆనూపజంతు మాంసరసము, అసాత్మ్యాహారము, పెరుగు, గురుత్వము చేయు పదార్థములు మొదలగు నవి సర్వవ్రణములయందు అపథ్యములుగా యుండును.

## భగందరరోగమునందు పథ్యములు

భగందరపిటికలు పక్వముగాక మునుపు శోధనచికిత్సలు, లేపములు, లంఘనము, *రక్తమోక్షణము, ఆనునవియును, భగందరపిటికలు పక్వమైనయెడల శస్త్రక్షారాగ్నికర్మలు హితకరముగ యుండును. మరియు శాలిధాన్యము, పెసలు, విలేపి, జాంగలజంతువుల మాంసరసము, పొట్లకాయ, మునగ, వేముయిగుళ్ళు, ఉమ్మెత్త, లేతముల్లంగి, నూనె, ఆవనూనె, తిక్తరసము గల పదార్థములు, నెయ్యి, తేనె మొదలగునవి భగందర రోగమందు దోషానుగుణ్యముగ పథ్యములుగా యుండును.

## భగందరరోగమునందపథ్యములు

శరీరపరిశ్రమ, మైథునము, యుద్ధము, గుఱ్ఱము, ఏనుగులు మొదలగువానిపై నెక్కి స్వారిజేయుట, గురుపదార్థములు మొదలగువానిని భగందరరోగి వ్రణముమానినను ఒకసంవత్సరకాలము విడువవలయును.

## ఉపదంశరోగమునందు పథ్యములు

స్నేహము, స్వేదము, రక్తమోక్షము, వమనము, విరేచనము, లేపము, ప్రక్షాళనము, శాల్యన్నము, పాతబియ్యము, కందిపప్పు, నెయ్యి, తేనె, గోధుములు, సైంధవలవణము, మునగకాయ, దొండకాయ, బీరకాయ, అల్లము, వేడినీళ్లు మొదలగునవి ఉపదంశరోగమునందు పథ్యములుగా యుండును.

## ఉపదంశరోగమునందపథ్యములు

పగటినిద్ర, మూత్రవేగమునడ్డగించుట, గురుకరపదార్థములు, సంభోగము, బెల్లము, దేహపరిశ్రమ, పుల్లనిపదార్థములు, మజ్జిగ మొదలగునవి ఉపదంశరోగులకు అపథ్యములుగా యుండును.

## కుష్ఠురోగమునందు పథ్యములు

పదిహేను దినములకొకసారి వమనము, మాసమున కొకసారి విరేచనము, ఆరునెలలకొకసారి రక్తమోక్షణము, మూడుదినములకొక

సారి లేపము చేసుకొనుచుండవలెను. స్నేహపానము, ఉద్వర్తనము (నలుగుపెట్టుట) తెల్లావాలు, పసుపు, సైంధవలవణము, ఆవనూనె, బావంచాలు, ఉసిరికపండ్లరసము, తేనె, వేపాకు, వేపపువ్వు, చండ్రచేవ పట్ట, జీడిగింజలు, కానుగవేరు, నీరుడువిత్తులు, ప్రాతబియ్యము, పెసలు, కందులు, చిరుశనగలు, యవలు, పొట్లకాయ ములకపండ్లు, తగిరిసచెట్టు యిగుళ్లు, బొద్దికూర, బీరకాయ, వేమయిగుళ్ళు, తాటిపండు, గలిజేరు, ఆవు, గాడిద, ఒంటె, గుఱ్ఱము, బఱ్ఱె వీట్లయొక్క మూత్రములు, నెయ్యి, తిక్తరసద్రవ్యములు మొదలగునవి కుష్ఠురోగమునందు పథ్యములుగా యుండును.

## కుష్ఠురోగమునందపథ్యములు

పులుపు, ఉప్పు, కారముగల అన్నపానములు, పాలు, పెరుగు, బెల్లము, నువ్వులు, మినుములు, చమటతీయుట, జలమునందుండు జంతువులమాంసరసము, స్త్రీసంగమము, మద్యము, ఎండయందు సంచరించుట, జాగరణము మొదలగునవి కుష్ఠురోగమునందు అపథ్యములుగాయుండును.

## ఆమ్లపిత్తరోగమునందు పథ్యములు

వమనము, విరేచనము, రక్తమోక్షణము, లేపము, స్నేహపానము, వస్తికర్మ, యవలు, గోధుమలు, పెసలు, ప్రాతవెఱ్ఱివడ్లు, కాచి చల్లారిన నీళ్ళు, చక్కెర, తేనె, పేలపిండి, దోసకాయ, కాకరకాయ, అరటిపువ్వు, చక్రవర్తికూర, వేమయిగుళ్లు, బూడిదగుమ్మడిపండు, పొట్లకాయ, దానిమ్మపండు, కఫపిత్తహరములగు అన్నపానములు మొదలగునవి ఆమ్లపిత్తరోగులకు హితకరములుగా యుండును.

## ఆమ్లపిత్తరోగమునందపథ్యములు

వాంతిని నిరోధించుట, నువ్వులు, మినుములు, ఉలవలు, నువ్వులతో చేసిన పిండివంటలు, గొఱ్ఱెపాలు, పుల్లగంజి, ఉప్పు, పులుసు, కారముగల పదార్థములు, గురుత్వము చేయుపదార్థములు, పెరుగు, మద్యము వీనిని ఆమ్లపిత్తరోగులు వర్జింపవలయును.

## విసర్పరోగమునందు పథ్యములు

విరేచనము, వమనము, లేపములు, లంఘనము, రక్తమోక్షణము, ప్రాతవియగు యవలు, గోధుమలు, కొఱ్ఱలు, షష్టికధాన్యము, శాలిధాన్యము, పెసలు, చిరుశనగలు, శనగలు, కందులు, జాంగలజంతువులమాంసరసము, వెన్న. నెయ్యి, ద్రాక్ష, దానిమ్మపండు, వేపయిగుళ్లు, పొట్లకాయ, ఉసిరికాయ, చంద్రచేవ, నాగకేసరములు, కర్పూరము, చందనము, నువ్వులునూరిపట్టువేయుట మొదలగునవి విసర్పరోగములందు పథ్యములుగా యుండును.

## విసర్పరోగమునందపథ్యములు

శరీరపరిశ్రమ, పగటినిద్ర, మైథునము, గాలిలోతిరుగుట, క్రోధము దుఃఖము, వమనమునిరోధించుట, గురుత్వము చేయు అన్నపానములు, వెల్లుల్లి, ఉలవలు, మినుములు, నువ్వులు, ఆనూపజంతువుల మాంసరసము, స్వేదకర్మ, అజీర్ణముకలుగజేయు పదార్థములు. కారము, పులుసు లవణరసముగల పదార్థములు, మద్యము, ఎండ మొదలగునవి విసర్పరోగమునందపథ్యములుగా యుండును.

## విస్ఫోటవ్యాధియందు పథ్యములు

విరేచనము చేయించుట, లంఘనము, వమనము, లేపము, ప్రాతవియగు శాలిధాన్యము, యవలు మొదలగువాని అన్నము, పెసలు కందులు, చిరుశనగలు వీట్లయూషములు. శొంఠి, చెంచలికూర, వేపయిగుళ్ళు, చిట్టికూర, కాకరకాయ, పొట్లకాయ, పిల్లిగడ్డలు, పర్పాటకము, వేపయిగుళ్ళు, వేపపూత, మారేడుయిగుళ్ళు, మారేడుపూత, తిక్తరసద్రవ్యములు మొదలగునవి విస్ఫోటవ్యాధియందు పథ్యములుగా యుండును.

## విస్ఫోటవ్యాధియందపథ్యములు

నువ్వులు, మినుములు, ఉలవలు, ఉప్పు, పులుసు, కారము, విదాహికర పదార్థములు, రూక్షకరపదార్థములు, ఉష్ణపదార్థములు మొదలగునవి విస్ఫోటవ్యాధియందు అపథ్యములుగా యుండును.

## మసూరికారోగమునందు పథ్యములు

వమనము, విరేచనము, వేపమండలతో ఈగలను తోలుట, చల్లనినీరు, మనోహరము, శీతలము, ఏకాంతముగ నుండు ప్రదేశముల యందు నివసించుట, నిద్ర, జపము, హోమము, దేవతారాధనము, ప్రాతవియగు షష్టికధాన్యము, శాలిధాన్యము, శనగలు, పెసలు, చిరుశన గలు, యవలు, పావురము, పిచ్చుక, గ్రుడ్డికొంగ, భరతపక్షి వీట్ల మాంసరసములు, దోసకాయ, అరటికాయ, మునగకాయ, కాకర కాయ, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, రేగుపండ్లు, మేధాజనకములగు, బృంహణములగు అన్నపానములు, నేత్రములందు సత్తగుల్లలలో నుండు నీటిని వేయుచుండుట, పచ్చకర్పూరము రెప్పలపై రాచుచుండుట, పెసరకట్టు, జాంగలజంతువుల మాంసరసము, నెయ్యి, పొగవేయుట, పరి శుభ్రముగా యుండుట, గోమయ భస్మమును శరీరమంతయు రాచుట, మరియు కుష్టురోగమునందు చెప్పిన లేపనాది యితర చికిత్సలు, వ్రణప్ర కరణమున చెప్పిన యితరచికిత్సలు, వీనిని దేశ, కాల, దోషాదులనెఱింగి, ఆచరించన మసూరికా రోగమునందు పథ్యములుగా యుండును.

## మసూరికారోగమునందపథ్యములు

అపవిత్రులగువారు రోగికడకేగుట, స్పృశించుట, వేడినీరు, గాలిలోతిరుగుట, స్వేదకర్మ, శ్రమ, నువ్వులనూనె, గురుత్వముచేయు పదార్థములు, క్రోధము, ఎండలో తిరుగుట, కారము, పులుసు, వేగనిరో ధము మొదలగునవి మసూరికారోగమునందు అపథ్యములుగాయుండును.

## పైత్యరోగములందు పథ్యములు

విరేచనము, ప్రాతవడ్లబియ్యము, గోధుమలు, ఘృతము, దోస కాయ, సొరకాయ, చిర్రికూర, ఉసిరికాయ, పొన్నగంటికూర, చేతలాసి కూర, ద్రాక్షపండ్లు, అల్లము, మాదీఫలము, చందనము, చక్కెర, శీతలోపచారములు, శీతకరద్రవ్యములు, తీపి చేదు కషాయరసములుగల ద్రవ్యములు మొదలగునవి పైత్యరోగములందు పథ్యములుగా యుండును.

## పైత్యరోగములందపథ్యములు

పెరుగు, పాలు, బెల్లము, మినుములు, అనుములు, ఆవాలు, వెల్లుల్లి, పులుపు కారము లవణరసములుగల ద్రవ్యములు, సంచారము, వంకాయ, గోంగూర, ఎండయందు తిరుగుట, కోపము, గురుకరద్రవ్యములు, ఉష్ణకరపదార్థములు మొదలగునవి పైత్యరోగములందపథ్యములుగా యుండును.

## క్షుద్రరోగములందు పథ్యాపథ్యములు

క్షుద్రరోగములు అనేక రోగలక్షణములను కలిగి యుండును. కాబట్టి దోషము, దూష్యము, అవస్థ వీనినెఱింగి బుద్ధిమంతులగువారు ఆయారోగములకు దగిన పథ్యాపథ్యముల నాచరించవలయును.

## శుక్రమేహమునందు పథ్యములు

పాతబియ్యము, పొట్లకాయ, బీరకాయ, దోసకాయ, సొరకాయ, మదనానబకాయ, అరటికాయ, వంకాయ, నీరుల్లిపాయ, పొన్నగంటికూర, చిట్టికూర, సపోటాపండ్లు, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపుపండ్లు, మామిడిపండ్లు, బత్తాయిపండ్లు, అరటిపండ్లు, ఆవుపాలు, మజ్జిగ, నెయ్యి, మీగడ, వెన్న, తేనె, పంచదార, అరణ్యజంతువుల మాంసరసములు, పక్షులమాంసములు, మధురపదార్థములు, శుక్రమునువృద్ధిజేయు ఆహారపదార్థములు, సత్పురుషుల సహవాసము, మంచికథలు, శాంతి ప్రధానమగు గ్రంథపఠనము, దైవభక్తి, మొదలగునవి శుక్రమేహమునందు పథ్యములుగాయుండును.

## శుక్రమేహమునందపథ్యములు

క్రొత్తబియ్యపు వంటకములు, కాకరకాయ, చిక్కుడుకాయ, బెండకాయ, నూనె, ఆవాలు, గుమ్మడికాయ, బచ్చలికూర, వెల్లుల్లి, కంద మొదలగు శ్లేష్మవర్ధకమైనట్టియు, ఉష్ణప్రధానమైనట్టియు, అన్నపానీయములను, అగ్నియొక్కయు సూర్యునియొక్కయు వేడిమి, స్త్రీసంగమము, మలమూత్రవేగ నిరోధము, జాగరణము, కోపము, దుఃఖము, లంఘనము, పగటినిద్ర, మిక్కిలి ఆలోచనము, మందత్వము, దుష్టసహవాసము మొదలగునవి శుక్రమేహమునందు అపథ్యములుగా యుండును.

## సవాయివ్యాధులయందు పథ్యములు

వమనవిరేచనములజేయించుట, పాతబియ్యము, గోధుములు, మేకపాలు, అడవిజంతువుల మాంసములు, పెసరకట్టు, నెయ్యి, కాకరకాయ, మునగకాయ, పొట్లకాయ, లేతముల్లంగి, బచ్చలికూర, తోటకూర, పులిచింత, కందిపప్పు, చేదు, వగరు, తీపిగల పదార్థములు, బావినీళ్ళు మొదలగునవి సవాయి వ్యాధులయందు పథ్యములుగా యుండును.

## సవాయివ్యాధులయందపథ్యములు

పగలు నిద్రించుట, మూత్రవేగము నడ్డగించుట, జడాన్నమును సేవించుట, మైథునము, పులుసు, మజ్జిగ, బెల్లము మొదలగునవి సవాయి వ్యాధియందపథ్యములుగా యుండును.

## శెగవ్యాధులయందు పథ్యములు

పాతబియ్యము, గోధుములు, పొట్లకాయ, బీరకాయ, వంకాయ బూడిదగుమ్మడికాయ, మదనానపకాయ, దోసకాయ, సొరకాయ, నీరుల్లిపాయ, పెసరకట్టు, ఆవుమజ్జిగ, అరటిపండ్లు, నెయ్యి, పంచదార మొదలగు మధురపదార్థములు, శీతలకరద్రవ్యములు, ఉత్తరవస్థి మొదలగునవి శెగవ్యాధులయందు పథ్యములుగా యుండును.

## శెగవ్యాధులయందపథ్యములు

కొత్తబియ్యపు వంటకములు, నూనె, పులుసు, ఆవాలు, వెల్లుల్లి రాత్రి జాగరణము, పాలు, పప్పాదినుసులు, గోరుచిక్కుడుకాయ, కంద దుంపలు, పిండివంటకములు, శ్లేష్మవర్ధకమైనట్టియు, మిక్కిలి తీక్ష్ణగుణము కలిగినట్టియు, అన్నపానములు, సూర్యునియొక్కయు అగ్నియొక్కయు వేడి, కోపము, దుఃఖము, లంఘనము, స్త్రీసంగమము మొదలగునవి శెగవ్యాధులయందపథ్యములుగా యుండును.

## విషూచి (కలరా) యందు పథ్యములు

వ్యాధియొక్క ఉద్ధృతమునుబట్టి పలచని గోధుమజావనుగాని, బార్లీజావనుగాని, ఆహారముగా నిచ్చుచుండవలయును. కాచిచల్లార్చిన నీళ్లు, నిమ్మకాయ, బ్రాందీ, జీలకఱ్ఱ, వాము, వెల్లుల్లి, ఆవాలు మొదలగు ఉష్ణకరద్రవ్యములు, బాగుగా పక్వముచేయబడిన పదార్థములు

లఘుకర పదార్థములు సేవించుట, శుచిగానుండుట, వేళకు నిద్రించుట మొదలగునవి విషూచిరోగులకు పథ్యములుగా యుండును.

## విషూచి (కలరా) యందపథ్యములు

కందిపప్పు మొదలగు పప్పుదినుసులు, కంద, చేమ మొదలగు దుంప కూరలు, గోంగూర, తోటకూర మొదలగు ఆకుకూరలు, సగము ఉడికిన పదార్థములు, పిండివంటకములు, ఆరినఅన్నము, వేళతప్పి భుజించుట, జాగరణము మొదలగునవి విషూచిరోగములందపథ్యములుగా నుండును.

## ముఖరోగములందు పథ్యములు

స్వేదకర్మ, విరేచనము, వమనము, గండూషము, ప్రతిసారణము రక్తమోక్షణము, నస్యకర్మ, ధూమపానము, శస్త్రకర్మ, అగ్నికర్మ, తృణధాన్యములు, యవలు, పెసలు, ఉలవలు, జాంగలజంతువులమాంస ములు, పొట్లకాయ, కాకరకాయ, లేతముల్లంగి, దోసకాయ, పాలు, చక్కెర, తేనె, ఉసిరికపండ్లు, కారము చేదుగల ద్రవ్యములు, కర్పూర వాసితజలము, తాంబూలము, కాచిచల్లార్చిననీళ్ళు, నెయ్యి మొదలగు నవి ముఖరోగములందు పథ్యములుగా యుండును.

## ముఖరోగములందపథ్యములు

దంతకాష్ఠముతో దంతధావనము, స్నానము, పులుపు, మత్స్య ములు, ఆనూపజంతుమాంసము, పెరుగు, పాలు, బెల్లము, మినుములు, రూక్షగుణముగల ఆహారములు, కఠినములగు భక్ష్యాదులు, బోర్లపండు కొనుట, గురుపదార్థములు, అభిష్యంది పదార్థములు, పగటినిద్ర మొద లగునవి ముఖరోగములందపథ్యములుగా యుండును.

## కర్ణ (చెవు)రోగములందు పథ్యములు

స్వేదము, విరేచనము, వమనము, నస్యము, ధూమపానము, శిరావ్యధనము, గోధుములు, శాలిధాన్యము, పెసలు, యవలు, పురాణ ఘృతము, లావుకపిట్ట, నెమలి, జింక, తీతువు, అడవికోడి వీటిమాంస ములు, పొట్లకాయ, మునగకాయ, చెంచలికూర, వంకాయ, కాకర కాయ, బ్రహ్మచర్యము, మాటలాడకుండుట మొదలగునవి దోషాను గుణ్యముగ కర్ణరోగులకు పథ్యములుగా యుండును.

## కర్ణ (చెవి) రోగములందపథ్యములు

పుల్లతో దంతధావనము, శిరస్నానము, దేహపరిశ్రమ, కఫవర్ధకరద్రవ్యములు, గురుత్వముచేయు పదార్థములు సేవించుట, పుల్లలు మొదలగువానితో చెవులయందు గోకుకొనుట, మంచులోనుండుట మొదలగునవి కర్ణరోగములందపథ్యములుగా యుండును.

## నాసారోగములందు పథ్యములు

స్నేహపానము, స్వేదకర్మ, శిరోభ్యంగనము, పాతగోధుములు, పాతబియ్యము, ఉలవకట్టు, పెసరకట్టు, గ్రామ్యములగు జాంగలజంతువుల మాంసరసములు, వంకాయ, పొట్లకాయ, వెల్లుల్లి, మునగకాయ, బీరకాయ, కాకరకాయ, పెరుగు, వేడినీరు, మద్యము, పాలు, బెల్లము, తేనె, ధూమపానము, త్రికటుకములు, కారము పులుసు లవణరసములు గల పదార్థములు, స్నేహయుక్తముగను, ఉష్ణముగను యుండు లఘువైనభోజనము మొదలగునవి నాసారోగములందుపథ్యములుగాయుండును.

## నాసారోగములందపథ్యములు

స్నానము, క్రోధము, మలమూత్ర అపానవాతవేగముల నడ్డగించుట, దుఃఖించుట, ద్రవపదార్థముల నధికముగ భుజించుట, భూమిపై పరుండుట, జిగురుగల పదార్థములు మొదలగునవి నాసారోగములందపథ్యములుగా యుండును.

## నేత్రరోగములందు పథ్యములు

ఆశ్చోతనము (ద్రవపదార్థములను నేత్రములయందు పోయుట) లంఘనము, అంజనము, స్వేదనము, విరేచనము, ప్రతిసారణము, స్వరసాదులను పోయుట, నస్యము, రక్తమోక్షణము, శస్త్రప్రయోగము, పట్టువేయుట, ఘృతపానము, మనశ్శాంతి, పెసలు, యవలు, ఎఱ్ఱవడ్లు, ప్రాతనెయ్యి, ఉలవకట్టు, పేయ, విలేపి, అడవికంద, పొట్లకాయ, వంకాయ, దోసకాయ, కాకరకాయ, లేతఅరటికాయ, లేతముల్లంగి, గలిజేరు, గుంటగలగర, కామంచిఆకు, కలబంద, ద్రాక్ష, ధనియాలు, సైంధవలవణము, తేనె, పాదరక్షలు ధరించుట, చనుబాలు, చందనము,

కర్పూరము, చక్కెర, తిక్తరసము, లఘుగుణములుగల పదార్థములు శాలిధాన్యము, గోధుమలు, ఆవునెయ్యి, ఆవుపాలు మొదలగునవి నేత్రరోగములందు పథ్యములుగాయుండును. మరియు పాలకూర, చక్రవర్తికూర, పొన్నగంటికూర, చిర్రికూర, గలిజేరుకూర, యివికూడా పథ్యములుగా యుండును.

## నేత్రరోగములందపథ్యములు

కన్నీరు, అపానవాతము, మలము, మూత్రము, నిద్ర, వాంతి అనువేగములను నిరోధించుట, కోపము, దుఃఖము, మైథునము, అతి సూక్ష్మములగునస్తువులనుచూచుట, పుల్లలతోపండ్లుతోముట, స్నానము, రాత్రిభోజనము, ఎండ, అధికముగమాట్లాడుట, వమనముచేసుకొనుట, అధికజలపానము, విప్పపూలు, పెరుగు. పథ్యములందు వ్రాయబడిన ఆకుకూరలుతప్పమిగిలిన ఆకుకూరలు, పుచ్చపండ్లు, నువ్వులపిండి మొలకలెత్తిన ధాన్యములు, చేపలు, కల్లు, ఆనూపమాంసము, తాంబూలము, ఆమ్లలవణ రసములుగల ద్రవ్యములు, విదాహి, తీక్ష్ణ, ఉష్ణ, గురుకర పదార్థములు, కటుపదార్థములు, మినుములు, పుల్లనీళ్ళు, ఆవనూనె, నీళ్ళలోమునుగుట, రాత్రిజాగరణము, బెల్లపుపాగు, సూర్యావలోకనము మొదలగునవి నేత్రరోగములందపథ్యములుగా యుండును.

## శిరోరోగములందు పథ్యములు

స్వేదము, నస్యము, ధూమపానము, విరేచనౌషధము, లేపము, లంఘనము, శిరోవస్థి, రక్తమోక్షణము, రక్షవేయుట, పురాణఘృతము, షష్టికధాన్యము, శాలిధాన్యము, పెసలు మొదలగువాని యూషములు. పాలు, జాంగలజంతువుల మాంసరసము, పొట్లకాయ, మునగకాయ, ద్రాక్ష, మామిడిపండు, అల్లము, ఉసిరికపండు, దానిమ్మపండు, హరీ ఫలము, నువ్వులనూనె, మజ్జిగ, కాంజికము, టెంకాయనీళ్లు, గుంటగలగర, కలబంద, వట్టివేళ్ళు, వెన్నెలలో విహరించుట, చందనము, పచ్చకర్పూరము మొదలగునవి శిరోరోగములందు పథ్యములుగా యుండును.

## శిరోరోగములందపథ్యములు

తుమ్ములు, ఆవలింత, మూత్రము, కన్నీరు, నిద్ర, మలము వీని

వేగముల నడ్డగించుట పెరుగు, అంజనము, మైథునము, విరుద్ధాన్న పానము, ప్రకృతివిరుద్ధమైన జలమునందు స్నానము, పుల్లలతో పండ్లు తోముకొనుట, పగటినిద్ర మొదలగునవి శిరోరోగములందపథ్యములుగా యుండును.

## గర్భిణీరోగములందు పథ్యములు

శాలిధాన్యము, షష్టికధాన్యము, పాతబియ్యము, పెసలు, గోధుములు, పేలపిండి, వెన్న, నెయ్యి, పాలు, తేనె, చక్కెర, పనసపండు, అరటిపండ్లు, ఉసిరికపండ్లు, ద్రాక్ష, పుల్లనిపదార్థములు, మధురపదార్థములు, శీతవీర్యముగల పదార్థములు, పొన్నగంటికూర, పొట్లకాయ, బీరకాయ, దోసకాయ, ముల్లంగిదుంపలు, వంకాయ, కస్తూరి, చందనము, పుష్పములు ధరించుట, పచ్చకర్పూరము, పైపూతలు, వెన్నెల, స్నానము, అభ్యంగనము, మృదువైనశయ్యలు, చల్లనిగాలి, తృప్తినికలిగించు భోజనము, ప్రియాలింగనము, మనస్సంతోషకరమైన విహారము, ఇష్టమైన అన్నపానము మొదలగునవి గర్భిణీరోగములందు పథ్యములుగా యుండును.

## గర్భిణీరోగములందపథ్యములు

స్వేదకర్మ, వమనము, క్షారపదార్థములు, చెడిపోయిన అన్నపానములు, మితిమీరి భుజించుట, కొత్తబియ్యము, కొత్తబియ్యపు వంటకములు, దుంపకూరలు, మాంసములు, మద్యము, గురుకరపదార్థములు, ఎక్కువసంచారము, పగలు నిద్రించుట, భారముమోయుట, రాత్రిజాగరణము, కఠినాసనమున నిద్రించుట, గొంతుకూర్చుండుట, కోపము, భయపడుట, మలమూత్రముల నడ్డగించుట విరేచనములకు తీవ్రమైన ఔషధముసేవించుట, ఉపవాసము, మలబద్ధకరద్రవ్యములు, గోష్ఠియొక్క పెరుగు, పాలు మొదలగునవి గర్భిణీరోగములందపథ్యములుగా యుండును.

## సూతికావ్యాధులయందు పథ్యములు

మిక్కిలి పాతబియ్యపుఅన్నము, కారము, కందికట్టు, ఎండుచేపలు, కాల్చినమాంసము, నూనె, తెలకపిండి, పొట్లకాయ, బీరకాయ,

కొయ్యతోటకూర, మునగకూర, అవిసికూర, గుంటగలగరాకుపచ్చడి, పాలు, వెల్లుల్లిపాయలు, ఇంగువ, పాతబెల్లము, ఇనుపమేకులు కాల్చి ముంచిన వేడినీళ్ళు, ప్రసవించినస్త్రీలు 15 లేక 21 దినములవరకు ఒక పూట అన్నముభుజించుట మొదలగునవి సూతికావ్యాధులయందు పథ్యములుగా యుండును.

## సూతికావ్యాధులయందపథ్యములు

కొత్తబియ్యపుఅన్నము, చలిదిఅన్నము, పచ్చిచేపలు, పులుసు, మజ్జిగ, పెరుగు, గాలియందు సంచరించుట, తడిప్రదేశమున సంచరించుట, చల్లనినీటిని తాకుట, త్రాగుట, శ్రమకలుగజేయుపనులు చేయుట, సంభోగము, శీతలపదార్థములు సేవించుట మొదలగునవి సూతికావ్యాధులయందపథ్యములుగా యుండును.

## బాలరోగములయందు పథ్యాపథ్యములు

జ్వరాదిరోగములయందు పెద్దవారికి చెప్పబడిన పథ్యాపథ్యములనే శిశువులకును ఔచిత్యానుగుణముగ నాచరించునటుల చేయవలయును. అగ్నిమాంద్యమునందు చెప్పబడిన పథ్యాపథ్యములనే శిశువులకు జనించు పారిగర్భికవ్యాధియందును ఆచరించవలయును. ఆగంతుక వ్యాధులు, ఉన్మాదము, వాతవ్యాధులు వీనియందు చెప్పబడిన పథ్యాపథ్యములనే బాలగ్రహములు సోకినశిశువులకును నిర్ణయించవలెను.

## విషార్తులకు పథ్యములు

శాలిధాన్యము, షష్టికధాన్యము, ఆరికలు, కొఱ్ఱలు, పెసలు, పెద్దశనగలు, అప్పుడుతీసిననూనె, సద్యోఘృతము, పురాణఘృతము, వంకాయలు, పొట్లకాయలు, ఉసిరికవరుగు, పాలకూర, చిత్రికూర, సైంధవలవణము వీనిని విషార్తులకు ఆహారమునందుపయోగించుట హితకరము.

## విషార్తులకు అపథ్యములు

విరుద్ధపదార్థములు, అధ్యశనము, క్రోధము, క్షున్నిగ్రహము, భయము, ఆయాసము, మైథునము, పగటినిద్ర యివి విషార్తులకేగాక విషవిముక్తులకును అపథ్యములుగా యుండును.

## రసతాపములయందు పథ్యములు

రసౌషధములు సేవించునప్పుడు కలుగు తాపము మొదలగు వికృతములు కలిగినప్పుడు, శీతోదకస్నానము, శ్రీగంధ కర్పూర మిళితలేపనము పూసి విసరుట, చల్లనిగాలి, పేరీపెరని పెరుగును చక్కెరతో కలిపి సేవించుట, టెంకాయనీరు, మధురరసముగల పదార్థములు, శీతవీర్యము గల పదార్థములు, వీనితో తయారుచేసిన ఆహారము, శీతలోపచారము, చెరుకురసము, వెలగపండుగుజ్జు, పాలు, పెరుగు, తేనె, గరికవేళ్ళు, ఉసిరికపండ్లరసము, చందనము మొదలగునవి రసతాపములయందు పథ్యములుగా యుండును.

## రసౌషధములు సేవించునప్పుడు పథ్యములు

సైంధవలవణము, నెయ్యి, ధనియాలు, జీలకఱ్ఱ, అల్లము వీనితో సంస్కరింపబడిన చిఱ్ఱికూర, వంకాయ, పొట్లకాయ, సొరకాయ, గోధుములు, ప్రాతబియ్యము, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, హంసోదకము, పెసరకట్టు, దానిమ్మపండ్లు, ద్రాక్ష, అరటిపండ్లు, బత్తాయి, చెరుకు రసము, పంచదార, శీతవీర్యముగల ద్రవ్యములు, జాంగలజంతువుల మాంసరసము మొదలగువానిని రసౌషధములు సేవించునప్పుడు హితకరములుగా యుండును.

## రసౌషధ సేవనయందపథ్యములు

గుమ్మడికాయ, వెదురుపూవు, కాకరకాయ, మినుములు, చిరుశనగలు, అనుములు, ఉలవలు, ఉప్పు, నువ్వులు, లంఘనము, నలుగు పెట్టుకొనుట, ఆవిరిపట్టుట, కోడిమాంసము, కల్లు, సారాయి మొదలగు మత్తుపదార్థములు, ఆనూపజంతువుల మాంసరసము, వుల్లనీళ్ళు, అరటియాకులోగాని కంచుకంచములోగాని భోజనము చేయుట, గురుపదార్థములు, వేడిగానుండుపదార్థములు, మలబంధము కలిగించు పదార్థములు తీక్ష్ణద్రవ్యములు, ఉష్ణవీర్యముగల ద్రవ్యములు, పగటినిద్ర, స్త్రీసంగమము దోసపండు, బూడిదగుమ్మడికాయ, రేగుకాయలు మొదలగునవి రసౌషధములు సేవించువారికి అహితములుగా యుండును.

# గమనింపు

## 1. అనుపానములు

1. ఇందు సామాన్యముగా ఔషధములకు రోగానుగుణ్యముగా అనుపానములు వ్రాయబడినవి. అట్లుగాక ప్రతిఒక్క-వ్యాధికి ప్రతిఔషధమునకు దేశకాలతత్త్వానుగుణ్యముగ అనుపానములువ్రాయుట కష్టసాధ్యము కావున బుద్ధిశాలురు ఒకదాని అనుపానములు మరియొక మందునకు మార్చియో లేక యితర అనుపానములు కల్పించుకొనియో వుపయోగించుకొనవలెను.

2. కొన్ని అనుపానములు ఔషధగుణములకు సహాయపడుచుండును. మరికొన్ని ఔషధములు చేయు శీతోష్ణాదితీవ్రగుణములను అరికట్టి సౌమ్యావస్థలోనికి దెచ్చి రోగములను శమింపజేయును. మరికొన్ని అనుపానములు ఔషధవీర్యమును శరీరమందలి సూక్ష్మభాగములన్నింటికి వ్యాపింపజేయుచుండును. కొన్ని అనుపానములు ఔషధము చేయుచున్న పనినిగాక అవుసరమైన యితర కార్యములను చేయుచుండును. కాబట్టి అనుపానములను ఆయాసమయముల కనుకూలమగునట్లు కల్పించుకొనవలెను.

3. వ్యాధిబలము హెచ్చుగాయుండి ఒక్కొక్క సందర్భమున ఔషధము చురుకుగా పనిచేయులేదని వెంటవెంటనే చికిత్సలు మార్చుకొనుటచే అనేకరీతుల అపకారము కలుగవచ్చును. కావున నిదానముగా ఔషధగుణములను తెలుసుకొనుట మంచిది.

4. మేము వ్రాసిన అనుపానములన్నియు చాలవరకు మాధర్మవైద్యశాలయందు అనేకమంది రోగులకు వాడిచూచినవియు, మఱికొన్ని శాస్త్రములనుండి సంగ్రహింపబడినవియు, మఱికొన్ని వృద్ధసాంప్రదాయములనుండి గ్రహించినవియు యిందు పొందుపరచియున్నాము.

5. ఔషధములను ఏ మోతాదు (Dose)నకా మోతాదు పొట్లములు కట్టుకొనుటకంటే బేడఎత్తుగాని, పావలాఎత్తుగాని గ్రహించి వానికి చెప్పబడిన అనుపానములను చేర్చిగాని చేర్చకగాని విడిగా

మోతాదు ప్రకారము పొట్లములు కట్టుకొని ఆయా అనుపానములతో వాడుకొనుట శ్రేష్టము.

6. ఔషధమును 1 లేక 2 తులములవరకు సేవించవలసినప్పుడు ఒకేసారి ఔషధమునంతయు పొట్లములుగాని మాత్రలుగాని కట్టుకొని వుంచుకొనుటకన్న బేడఎత్తు లేక పావలాఎత్తుచొప్పున ఔషధమును తీసుకొని పైవిధముగా చేసుకొని వుపయోగించుకొనుట సర్వవిధములమంచిది.

7. వంట ఖజ్జలీ ఔషధములు, భస్మములు, లేహ్యములు, ఆసవారిష్టములు మొదలగువానినన్నింటినిగాని లేక రెండు, మూడు, నాలుగు రకముల ఔషధములను ఒకేసారి సేవించవలసినప్పుడు ఆయారోగానుగుణ్యముగా భోజనపూర్వము, భోజనానంతరము, ఉదయసాయంత్రములు, రాత్రి మొదలగు వ్యవధికాలములయందు వుపయోగించుకొనవలెను.

8. ఔషధములయొక్క ప్రమాణము (Dose)లను సామాన్యముగా పెద్దవారలకే నిర్ణయించి వ్రాయబడినవి అట్లు వ్రాయబడియున్ననూ రోగియొక్క వ్యాధిని, వయస్సును, కాలమును, ప్రకృతుల ననుసరించి మార్పు చేసుకొనవలసినప్పుడు మార్పు చేసుకొనవచ్చును. ప్రత్యేకముగా బాలురకుపయోగించు ఔషధములకు బాలురకు సరిపడు ప్రమాణములు వ్రాయబడియున్నందున అట్టివిధముగానే వుపయోగించుకొనవలెను.

9. అనుపానవస్తువులకు పరిమాణము చెప్పనియెడల ఔషధమునకు సమముగా గ్రహించుకొనవలెను.

10. కషాయ ద్రవ్యపరిమితి చెప్పనియెడల కషాయద్రవ్యములను సమభాగములుగా గ్రహించి మెత్తగా నలియగొట్టి యాచూర్ణమును 1 తులము గ్రహించి అందు మంచినీళ్ళు 16 తులములు పోసి 8 వ వంతు మిగులునట్లు కాచి వడియగట్టి సేవించవలెను. కషాయము ఏరోజునకారోజు మట్టిపాత్రయందు కాచి తయారుచేసుకొనుట మంచిది.

11. అల్లము, మిరియాలు, జీలకఱ్ఱ మొదలగు వాట్లరసములు అనుపానములుగా చెప్పినప్పుడు పచ్చిరసములని చెప్పినచోట్ల తప్ప మిగి

లినచోట్ల పొంగించియే వాడుకొనవలెను. ఏ అనుపానము చెప్పనియెడల మంచినీళ్ళనే అనుపానముగా తీసుకొనవలెను.

## 2. పథ్యాపథ్యములు

1. ఇందు రోగములకు సామాన్యముగ పథ్యాపథ్యములు వ్రాయబడినవి. రోగములయందు రోగులయొక్క తత్వములను కాలప్రకృతులనుబట్టి పథ్యాపథ్యములను వ్రాయవలయునన్న కష్టసాధ్యము, కనుక రోగములకు మాత్రమే పథ్యాపథ్యములు వ్రాయబడినవి. ఒకొక్కప్పుడు పథ్యములు అపథ్యములుగను, అపథ్యములు పథ్యములుగను మారవచ్చును. గాన బుద్ధిశాలురు వ్యాధినిబట్టియు రోగితత్వమునుబట్టియు దేశకాలములబట్టియు వీటియందు మార్పుచేసుకొనిగాని లేక యితర పథ్యములు కల్పించుకొనిగాని పథ్యముల నిర్ణయించుకొనవలెను.

2. ఇచ్ఛాపథ్యమని చెప్పబడినప్పుడు నూనె, ఆవ, గుమ్మడి, బచ్చలి, గోంగూర మొదలగు అతితీక్ష్ణకర పదార్థములను, అతిమంద గుణముగల పదార్థములను వాడకుండా విసర్జించి మిగిలిన పదార్థములను వాడవచ్చును. అనగా పొట్లకాయ, బీరకాయ, సొరకాయ, దోసకాయ, కాకరకాయ, కందిపప్పు, మెంతికూర, పెరుగుతోటకూర, పాత చింతకాయ, పాతదబ్బకాయ, పాతనిమ్మకాయ, ఉసిరికాయ మొదలగు పచ్చళ్లు, రెండు మూడురోజుల కొకసారి పలచనిచారు, ఆవుపాలు, ఆవు మజ్జిగ, నెయ్యి మొదలగునవి సేవింపవచ్చును.

3. సగ్గుబియ్యపుజావ, గోధుమజావ, బియ్యపుజావ, బార్లీజావ మొదలగువానిని వ్యాధినిబట్టియు, తత్వమునుబట్టియు ఒకప్పుడు చిక్కదనముగను, మరొకప్పుడు పలుచగను సేవింపవలెను. జ్వరాదులయొక్క ప్రారంభదశయందును, జీర్ణకోశము బలహీనముగా నున్నప్పుడును పైజావలయొక్క తేటనుమాత్రమే వుపయోగించుట మంచిది. ఆవుపాలు జావలయందు చేర్చవలసివచ్చినప్పుడు ఉప్పువేయుట మానివేసి పంచదారనుగాని, పటికబెల్లపుపొడినిగాని, గ్లూకోజునుగాని చేర్చుకొనవలయును.

4. జీర్ణశక్తిననుసరించి లఘువైనట్టియు, గురువైనట్టియు ఆహారములను కల్పించుకొనవలయును. అగ్నిబలము తక్కువగా నున్నప్పుడు

పప్పాదినుసులు, దుంపకూరలు భుజింపరాదు. సాధ్యమైనంతవరకు లఘువైన ఆహారములుగాని, ఏకభుక్తమునుగాని, పేయ (జావ)ను గాని యివ్వవలయును. వానినికూడ జీర్ణముచేయజాలనప్పుడు •ఉపవాసరూపకమగు లంఖణము చేయుటగాని, అగ్నిదీప్తకర పదార్థములను సేవించుటగాని చేయవలెను.

5. రక్తవికారము మొదలగువ్యాధులయందు పులుసు, కారము విడిచిపెట్టవలెను. వాతవ్యాధులయందు చేదు, కారము, కషాయము ఈ రసములుగల ద్రవ్యములను, పిత్తవ్యాధులయందు పులుపు, ఉప్పు, కారము ఈరసములుగల ద్రవ్యములను, కఫవ్యాధులయందు మధుర రసము, పులుపు, లవణరసములుగల ద్రవ్యములను వర్జింపవలయును.

---

## ఇ త ర వి ష య ము లు
(MISCELLANEOUS)

### ఈ పుస్తకములో ఔషధములయొక్క ద్రవ్యములయందు వ్రాయబడిన ద్రవ్యగణపరిభాష పదములకు అర్థములు

1. కుశాపంచకము:—కుశగడ్డి, దర్భ, రెల్లు, కాశగడ్డి, కిక్కిసగడ్డి.
2. చాతుర్జాతకములు:—దాల్చినచెక్క, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు.
3. చందనద్వయము:— తెల్లచందనము, రక్తచందనము.
4. జీరకద్వయము:— తెల్లజీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ.
5. త్రిఫలములు:—కరక్కాయ, తానికాయ, ఉసిరికాయ.
6. తాళకద్వయము:—పత్రతాళకము, పిండతాళకము.
7. తంగేడుపంచకము:—తంగేడుచెట్టుయొక్క ఆకు, కాయ, పువ్వు, చెక్క, వేరు.
8. త్రిజాతకములు:—దాల్చినచెక్క, ఏలకులు, ఆకుపత్రి.
9. త్రిలవణములు:—సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్రలవణము.
0. ద్విక్షారములు:—సర్జక్షారము, యవక్షారము.

11. దశమూలములు:—మారేడు, దుందిలము, పెగ్గుమ్మ్రుడు, కలిగొట్టు, నెల్లి, (తక్కెలి) ముయ్యాకుపొన్న, కోలపొన్న వాకుడు, పెద్దములక, పల్లేరు.

12. పంచలవణములు:—సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము.

13. పంచకోలములు:—శొంఠి, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలం.

14 పంచతిక్తములు:—నేలవేము, కటుకరోహిణి, తుంగగడ్డలు, పర్పాటకము, తిప్పతీగె.

15. లవణత్రయము:—సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్రలవణము.

16. క్షారత్రయము:—సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము.

## గుణవాచకములగు పారిభాషిక శబ్దముల అర్థ వివరణము.

1. ఆమ్లశమనము:— (Cures Acidity) పులుసుదనమును హరింపజేయునది.

2. అగ్నివర్ధకము:—(Appetisers) ఆకలిని వృద్ధిచేయునది.

3. అస్థిసంధానకరము:—(Joins fractured Bones) విరిగిన ఎముకలను అతుకునటుల జేయునది.

4. ఆమపాచనము :— (Dijests unproperly Boiled food) అపక్వపదార్థమును పచింపజేయునది.

5. అశ్మరీఘ్నము:—(Antilithics) మూత్రాశయమందలి క్షారము రాళ్ళు మొదలగువానిని కరిగించునట్టిది.

6. ఆస్యపాకహారము :— (Cures Eruptions of the Tongue) నోటిపూతనుతగ్గించునట్టిది.

7. ఇంద్రలుప్తహారము:—(Cures Alopecia) పేను కొరుకుడును హరింపు జేయునది.

8. ఉపదంశ హారము:—(Cures Syphilis) కొరుకుడు మొదలగు సవాయి వ్యాధులను హరించునది.

9. ఉష్ణశమనము:— (Refrigerant) శరీరమునందలి ఉష్ణమును తగ్గింపుజేయునది.

10. ఉపసర్గఘ్నము } :—(Disinfectants) అంటు రోగము
11. ఔపసర్గికరోగహరము } లగుగ నేరియా మొదలగువానినితగ్గించునది.

12. ఊర్ధ్వాంగవాతహరము:— (Cures Paralysis of the facial parts) మెడకుపైభాగమున శిరస్సు మొదలగువానియందలి వాతో ద్రేకమును హరించునది.

13. ఋతుకరము:— (Emmenagogue) ఋతుస్రావముయొక్క అక్రమమును నివారణచేసి దానిని క్రమమునకు దెచ్చునది.

14. క్రిమిహరము:—(Anthelmintics) కడుపులోని క్రిముల (నులి పురుగు మొదలగువానిని) ను హరించునది.

15. కుక్షిశూలహరము:— (Cures Colic) కడుపునందు కలుగు శూల (నొప్పి) లను తగ్గించునది.

16. కఫఘ్నము:—(Expectorants) కంఠనాళముల క్రిందిభాగమున గల ఇరు పార్శ్వములనుండి కఫమును బయటకు త్రోయునది.

17. గ్రాహి:—(Aptringent) జఠరాగ్నిని వృద్ధిజేసి ఆహారమును జీర్ణమగునట్లు జేసి ద్రవమును యింకించునట్టిది.

18. గర్భపోషకము:—(Uterine Tonics) గర్భమునందుండు శిశువును పోషించునది.

19. జ్వరఘ్నము:—(Febrifuge) జ్వరమునందు కలుగు ఉష్ణతను తగ్గించి, దానినొక నియమమునకు దెచ్చునది.

20. త్వచ్యము:–(Cures Skin Diseases) చర్మవ్యాధులను హరింపజేసి చర్మమునకు కాంతినిచ్చునట్టిది.

21. త్రిదోషహరము;—(Alterative) వాత, పిత్త, శ్లేష్మము లను మూడు దోషములను శమింపజేయునది.

22. తీక్ష్ణరేచనము:— (Drastic purgative) ప్రేగుల యందుండు మలమును జిగురుపదార్థమును ద్రవముగా చేసి బయటకు త్రోసి వేయునది.

23. దీపనము:—(Stimulant) ఆహారపదార్థమును పచింపజేయక యే జఠరాగ్నిని మాత్రము వృద్ధిజేయునది.

24. ధాతుస్థైర్యకరము:— (Increases Bodily strength) రసరక్తాది ధాతువులకు స్థిరత్వము కలుగచేయునది.

25. దోషపాచనము:— (Cures cold with Atrobilis) ఉద్రేక స్థితియందుండు వాతపిత్త కఫాదిదోషములను పచనము జేయునది.

26. ధాతువృద్ధికరము:-(Stimulates Sperm or Aphrodisiaes) శుక్రాది ధాతువులను వృద్ధిచేయునది.

27. దాహతాపహరము.—(Quenches internal Thirst)శరీరాంతర్భాగమునందు కలుగు ఆరాటమును, బహిర్భాగమున కలుగు మంటను తగ్గించునది.

28. దగ్ధవ్రణరోపణము.—(Cures Scalds) కాలినపుండ్లను మానునటుల జేయునది.

29. నేత్ర్యము:—(Does good to the Eyes) నేత్రములకు మేలు కలుగ జేయునది.

30. నిద్రాప్రదము:—(Hypnotics) నిద్రను కలుగజేయునట్టిది. ఆ కారణముచేత బాధతగ్గించునట్టిది.

31. నేత్రరోపణము:—(Cures Eye Diseasѐs) నేత్రములయందు కలుగు వ్రణరూపకమైన వానిని మాన్పునది.

32. పాచనము:—(Stomachic) భుజించిన ఆహారమును పక్వము చేయు స్వభావము గలది.

33. పిత్తహరము:—(Cholagogues)పిత్తమునుఅధికముగాబయటకు త్రోయునది.

34. పూయమేహహరము:— (Cures Gonorrhea) గనేరియా వ్యాధులను తగ్గించునది.

35. ఫిరంగజహరము:—(Cures Syphilis) సవామేహాసంబంధమైన వ్యాధులను హరింపజేయునది.

36. పాదదారికాహరము :— (Cures broken Feet) అరికాళ్ళు పగులుటచే కలుగు బాధలను తగ్గించునది.

37. పామాహరము:— (Cures Boils) గజ్జి, కురుపులు మొదలగు వానిని హరింపుజేయునది.

38. బల్యము } :—(Tonics) శరీరమున కంతకుగాని లేక ఒక
39. బలవర్ధకము } భాగమునకు గాని బలము నిచ్చునది.

40. భేదనము:—( Removes Constipation ) మలాధిక్యముగా యుండి, కొద్దికొద్దిగా స్రవించునప్పుడు లేక మలములు పిట్టముకట్టి శరీరభాగములయందుండు నప్పుడు అట్టివానిని భేదించి బయటకు త్రోయునది.

41. బృంహణము:—(Nutritive) శరీర పోషణమునకు సహాయకర మైనది.

42. మేధ్యము:–(Brain Tonics)మెదడునకు బలముకలుగజేయునది.

43. మూత్రలము:—(Diuretics) మూత్రమును వృద్ధిజేసి జారీచేయు నట్టిది.

44. మలబద్ధహరము:–(Purgatives)విరేచన బద్ధకమునుపోగొట్టునది.

45. మృదురేచనము:— (Laxative) మలమునుసడలించి సుఖముగా బయటకు త్రోయునది.

46. యోగవాహి:— (Any drug or Article that increases the good qualities of the components without losing its efficacy) తన సహజగుణములను విడువక యితర సంయోగ ద్రవ్యములయొక్క గుణములను అనుసరించునది.

47. రేచనము:—(Cathartic) ప్రేగులయందలి మలమును బయటకు త్రోసి మలాశయమును శుద్ధిచేయునది.

48. రసాయనము:– (Conducive to the diseases of the old age) ముసలితనమును, వ్యాధులను నిరోధించి బలమును కలిగించునది.

49. రక్తస్తంభనము } :— (Styptics) ఏ అవయవము నుండియైననూ
50. శోణితస్థాపనము } కలుగు రక్తస్రావమును నిలుపునట్టిది.

51. రుచ్యము:—(Causes Taste) నోటికి మధురాది రసములను హితముకలుగునట్లు చేయునది.

52. రజఃశుద్ధికరము : — (Purifies Menestrual Blood) ఋతుస్రావమునందు కలుగు దోషములను పోగొట్టునది.

53. రూక్షగుణము:—(Absorbants) ద్రవ, స్నిగ్ధత్వములనుఆర్పి గరుసుతనమును కలుగునట్లు చేయునది.

54. లేఖనము:—(Purgative) శరీరాంతర్భాగముల యందు పేరుకొనియుండు మలదోషములను గీకివేసి బయటకు త్రోయునది.

55. లఘుగుణము:—(Digestive Tonics) జఠరాగ్ని వలన తేలికగా జీర్ణమై, తేలికయైన గుణముకలది.

56. విష్యందికరము:—(Sialagogue) నోటియందు లాలాజలమును వుత్పత్తి జేయునది.

57. విషహారము:—(Antidote) విశిష్టమైన విషముయొక్క పరిణామమును తగ్గించునది.

58. విషమజ్వరహారము:—(Antiperiadics) నియమ ప్రకారముగా వచ్చి విడిచెడి జ్వరములను తగ్గించునది.

59. వాజీకరణము:—(Corporial Perfection) క్షీణంబుగ యున్న శుక్రమును వృద్ధిజేసి గుఱ్ఱమువంటి బలమును కలిగించునది.

60. వ్రణరోపణము:—(Desicants) వ్రణములను మానునటుల జేయునది.

61. వాతహారము:—(Carminative) కడుపు, ప్రేగులద్వారా వాయువును బయటకు త్రోయునది.

62. వృష్యము:—(Aphrodisioc) శుక్రశోణితములను వృద్ధిపరచి సంభోగేచ్ఛను వృద్ధిచేయునది.

63. వలీపలితనాశనము:—(Cures premature wrinkles and grey Hair) అకాలమునందు శరీరముపై కలుగుముడతలు, వెంట్రుకలు నెరయుటను తగ్గించునది.

64. వర్త్మలేఖనము:—(Cures Granules of the Eyes) కనురెప్పలయందు కలుగు దుర్మాంసము మొదలగువానిని కోసివేయునట్టిది.

65. శోణితవర్ధనము:—(Haematics) రక్తమునందు ఎఱ్ఱకణములను వృద్ధిజేసి రక్తవృద్ధిని గావించునది.

66. శీతహరము:—(Removes coldness in Typhoid fevers) సన్నిపాతాది వ్యాధులయందు కలుగు చల్లదనమును హరించునట్టిది.

67. శామకము:—(Sedative) శరీరమందలి వేదనను తగ్గించి శాంతి నొసంగునట్టిది.

68. శూలఘ్నము.—(Cures Bodily pains) శరీరావయవములయందు కలుగు బాధలను తగ్గించునది.

69. శుక్రస్తంభనము:—(Helps the Retention of the Sperm) సంభోగసమయమున శుక్రపతనము త్వరితముగ కాకుండ నిలుపునది.

70. శుక్రమేహహరము:—(Cures Spermatorrhea) మూత్రము ద్వారా శుక్రధాతువు పోవుటను తగ్గించునట్టిది.

71. శోఫనిర్వాపణము:—(Cures Swellings of the body Due to impure Blood) వ్రణములయొక్క వాపులను, దుష్టరక్తాదుల వలన కలుగు వాపులను తగ్గించునది.

72. స్రోతశ్శోధనము:—(Removes Diseases of the Throat Nose & Ear) కంఠనాళము, ముక్కు, చెవి మొదలగు శరీరరంధ్రములయందు నిలచియున్న దోషములను శుద్ధిచేయునది.

73. స్తంభనము: -(Cures involuntary Emmissions) శుక్రాది ధాతువులుగాని, మలమూత్రాది వేగములుగాని త్వరితముగాను అప్రయత్నముగాను పోవువాటిని ఆపుచేయునది.

74. సంజ్ఞాకరము:—(Antispasmodics) స్మృతిని (తెలివిని) కలిగించునట్టిది.

75. స్వేదలము:—(Diaphoretics) చర్మముయొక్క క్రియాశక్తిని హెచ్చించి చెమటను కలుగజేయునది.

76. స్వేదఘ్నము:—(Anhydrotics) విశేషముగవచ్చెడు చెమటను ఆపునట్టిది.

77. స్నేహోపయోగము:—(Demulcents) శరీరమునందలి లోభాగ మునకు మృదుత్వము నిచ్చునట్టిది.

78. హృద్యము:—(Heart Tonics) హృదయముయొక్క బలమును వృద్ధి జేయునది.

## ఉష్ణమానము (Temperature)

సామాన్యముగ ఆరోగ్యవంతుడైనవాని శరీరమునందుఉష్ణమును, ధర్మామీటరును నాలుకక్రింద పెట్టిచూసిన 98-4 డిగ్రీలుండును. నాలుక క్రింద ఉష్ణము చంకక్రింద కన్న ఒకడిగ్రీ హెచ్చుగాయుండును. మరియు యోనియందును, గుదమునందును గూడ ఉష్ణము అంతియే యుండును. ఉదయమున పడకనుండి లేచునప్పుడు ఉష్ణతయధికముగను మధ్యరాత్రి యందుతక్కువగను యుండును. సామాన్యదినములయందు ఉష్ణమానము ½ డిగ్రికన్ననూ న్యూనాధిక్యత లుండవు. శరీరమునందు ఏలాటివ్యాధి గాని లేనిచో ఉష్ణత 97 డిగ్రీలకంటె తగ్గదు. జ్వరలక్షణములు లేనిదే 100 డిగ్రీలకు ఎక్కదు. ఉష్ణత 1 డిగ్రి అధికమైనచో నాడీవేగము 6 నుండి 10వరకు హెచ్చును. శరీరమునందుష్ణత 98-4 డిగ్రీలకన్న మించి నచో అది ఏదేని యొకరోగలక్షణమని తెలియవలెను. ఉష్ణమానము 103 నుండి 105 వరకున్నచో జ్వరముతీవ్రమైనదని యెరుంగవలయును. ఉష్ణమానము 105 నుండి 108 డిగ్రీలవరకు వచ్చిన భయసూచకము. 108 నుండి 109 డిగ్రీలవరకున్నచో మరణముసమీపించుచున్నదనియెరుంగ వలయును. కాని ఉష్ణమధికమైనంతమాత్రమున భయసూచకము కాదు. ఏలననగా చలిజ్వరమునందు ఉష్ణమానము 106 నుండి 108 డిగ్రీల వరకు నెక్కి ఆస్థితియందే కొంతసేపుయుండి తనంతటతానే తగ్గిపోగలదు. యిది

